పారిశ్రామిక గ్రంథమాల,
[ద్వితీయ కుసుమము]

# దేశీయ పరిశ్రమలు.



గ్రంథకర్త:
పెండెం వెంకట్రాములు.

...మిక గ్రంథమాల,
(...యకుసుమము)

# దేశీయ పరిశ్రమలు.

౧౯౩౫ సం॥

శారదా ప్రెస్, తెనాలి.

గ్రంథకర్త:
పెండెం వెంకట్రాములు.



వెల రు. -౮-౦

# ఆంధ్ర నాయకుని ఆశీస్సు.

---

శ్రీ పింజాల వెంకట్రామయ్యగారిచే ప్రచురింపబడిన ఈ పుస్తకము చదువుటకు ఎంతో ముచ్చటగనున్నది. దేశీయపరిశ్రమలు బాగుపడవలెనన్న మొదట ప్రజలకు నాటియందు విశ్వాసము కలుగవలెను. ఇట్టి విశ్వాసమును కల్పించుటకు ప్రత్యక్ష - పరోక్ష ఋజువులు అవశ్యకములు. వేదయుగము నుండి - ఇతిహాసకాలమును దాటి - వరుసగ దిగివచ్చి - ఇప్పటికాలపు వారిచే పూర్ణముగ మరువబడిన అనేక పరిశ్రమలనుగూర్చి మనలకు చెప్పుటకు ఆయా కాలపు గ్రంథములనుండి విషయములను ఉదహరించి ఆధునిక విద్యావంతులమని విఱ్ఱవీగు అస్మదాదుల సందేహములను గ్రంథకర్త పూర్ణముగ నివారింపగలిగినారు. మన దేశమునందు పూర్వుల మహాత్మ్యకు నిదర్శనములగు విచిత్రము లెన్నియో గలవు. ప్రకృతిశక్తుల సంద ర్భములను వశీకరణ చేసుకొనినారు, స్వహస్తముల శిల్పితములగు అనేక విచిత్రములను సృష్టించినారు, వీరలు తమ వైదగ్ధ్యమును వెలిపుచ్చియుండి, అజ్ఞానాంధకారమునందు మునిగియున్న మనలకు ఈ గ్రంథము జ్ఞానతేజస్సునొసంగి ముక్తిమార్గమును చూపుచున్నది.

భో. పట్టాభి సీతారామయ్య.

# తప్పొప్పుల పట్టిక.

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨ | ౧౬ | పారిశ్రమికల | పారిశ్రామికల |
| ౪ | ౧౫ | జరిగియున్నది | జరిగియున్నవి |
| ౨౩ | ౭ | సప్తబా | సప్తభా |
| ౩౩ | ౯ | మనస్వ | మనస్సు |
| | ౨౦ | మహాత్మా | మహాత్మ |
| ౩౬ | ౪ | దీవరేణ్యా | ధీవరేణ్యా |
| ౩౭ | ౯ | తద్రా | తత్రా |
| | ౧౩,౨౪ | సూత్రదారి | సూత్రధారి |
| ౩౮ | ౧౫ | సూత్రదారి | సూత్రధారి |
| | ౧౮ | యున్నడి | యున్నది |
| ౩౯ | ౧౬ | కన్నల్ | కర్నల్ |
| | ౧౭ | యున్నాడు | యున్నారు |
| ౪౮ | ౯ | భార్గవులవ | భార్గవులవని |
| ౫౫ | ౮ | ఆయుద | ఆయుధ |
| ౫౭ | ౫ | సతిబీయుండయి | సతిభీరుండయి |
| ౬౫ | ౨ | కారమగు | కారణమగు |
| ౬౯ | ౧౬ | దీప్తిజాల | దీప్తిజ్వాల |
| ౭౦ | ౧౦ | స్పటిక | స్ఫటిక |
| ౭౭ | ౧౭ | త్వష్ణ | త్వష్ట |
| ౮౧ | ౬ | విశచు | వించు |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౮౨ | ౧౩ | నిషారులం | నిషాదులం |
| | ౧౭ | వశగతుం | వశగతులం |
| ౮౪ | ౧౦ | వంగవంగ | వంగ |
| ౯౬ | ౧౫ | ఘంటు | గంటు |
| ౯౯ | ౪ | కంకబళ్ళాం | కింబళ్ళాం |
| ౧౦౭ | ౧ | తాంత్ర్యాం | తాంప్ర్యాం |
| | ౭ | పీతాంకు | పీతాంబరు |
| ౧౦౮ | ౭ | వసు | పిసు |
| ౧౦౯ | ౭ | జాండ | జాండజ |
| ౧౧౨ | ౧౭ | జహ్వ | జిహ్వ |
| ౧౧౬ | ౪ | ముంచతే | ముచ్యతే |
| | ౯ | పీత్రవన్నకు | పీతపన్నను |
| | ౧౧ | మయూంఖా | మయూఖా |
| ౧౨౧ | ౫ | కిష | కేక్ష |
| | ౧౬ | సాదినాలు | సాదనాలు |
| | ౨౩ | పల్వాంక | పల్యాంక |
| ౧౨౩ | ౮ | పూరుస్న | పూరున్న |
| ౧౨౪ | ౧౩ | ములకు | ములను |
| ౧౩౮ | ౭ | నిక్ష్నత | నిర్మిత |
| ౧౩౯ | ౪ | విలువల | విలువగల |
| ౧౪౭ | ౧౭ | ఎ | వె |
| | ౧౬ | ఎ | వె |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | ౮ | కుటుట | కుట్టుట |
| | ౨ | పాంచాల | పాంచాలి |
| | ౧౩ | అలంకార | అలంకారపు |
| | ౬ | కెక్కించు | కెక్కించు |
| | ౬ | లక్కతట్టు | లక్కపట్టు |
| | ౧౬ | శెలవు | సెలవు |
| | ౧౦,౧౧,౧౩,౧౮,౨౨ | ఎ,ఎ,ఎ,ఎ,ఎ | వె,వె,వె,నె, |
| | ౪ | యున్నది | మున్నది |
| | ౩ | పూజార్హ్వాస్త్రమూహ | పూజార్హమూహః |
| ౧౫౮ | ౧౧ | స్జ్ఞాకు | షబ్బాకు |
| ౧౯౬ | ౧౦ | కవిష్ఫు | కవిష్ఫు |

# పారిశ్రామిక గ్రంథమాల

(స్థాపితము ఆంగీరస సం॥ మాఘ బ ౧౧ లు ఇందువారము)

(౧౯33 సం॥ ఫిబ్రవరి ౨౦)

---

ఏదేశమునందైనను ఆర్థికదుస్థితి సంప్రాప్తమైనయెడ నద్దానిని పరిశ్రమాభివృద్ధివలన బాపుకోగలరు. వర్తమాన కాలమునందు భారతవర్షమునకట్టిది ముఖ్యావశ్యకమని ఎల్లరకు దెలిసియున్నది.

అందుచేత ప్రజలకు దేశీయపరిశ్రమలనుగూర్చి తెలుపవలెనని ప్రాచీన ప్రస్తుత పరిశ్రమలుగల "దేశీయ పరిశ్రమలు" అను ఈ గ్రంథమును రెండవ కుసుమముగా వెలువరించుచున్నాము.

దేశీయ పారిశ్రామిక గ్రంథములను వెలువరించు ఈగ్రంథమాలకు అభిమానులు తగు రీతితో సహాకారము జేసి మాకార్యమును ప్రోత్సహింపవలసినదిగా ప్రార్థించుచున్నాము.

దేశీయ కాగితములు సిరా మొదలగువాటిని వాడి త్వరగా గ్రంథమును ముద్రణపూర్తిచేసి ఒసంగిన తెనాలి శారదా ముద్రణాలయము వారిని అభినందించుచున్నాను.

పేరాల,
చీరాలపోస్టు

ఇట్లు విన్నవించు సంపాదకుడు,
పెండెం వెంకట్రాములు.

# తొలిపలుకు

పరిపూర్ణపారిశ్రామిక విజ్ఞానము గలిగియున్న భారత వర్షమును కాలగతిచేత పారిశ్రామిక అజ్ఞానభూమిగా చూడ బడుచుండుటచేత గలిగిన విచారమును భరింపజాలక ప్రాచీన ప్రస్తుత పరిశ్రమలను చేర్చి "దేశీయ పరిశ్రమలు" అను ఈ గ్రంథమును "ఉడతకు ఉడతాభక్తి" యన్నటులపూర్తి జేసితిని.

గ్రంథరచన సమయమున వేటపాలెమునందు గల సారస్వతనికేతనగ్రంథాలయమువారు కావలసిన గ్రంథము లొసంగి నందులకు కృతజ్ఞుడను. గ్రంథాలయ అధికారులు ఉద్యోగులు చూపు: ఆదరణ కొనియాడదగియున్నది.

ఈ గ్రంథరచనకు మిత్రులగు పండితులు: జేసిన: సహాకారమునకు వందనము లర్పించుచున్నాను.

ఇట్లు విన్నవించు,
గ్రంథకర్త.

# పారిశ్రామిక గ్రంథమాల

---

రాజపోషకులు.

శ్రీయుత బెజవాడ గోపాలరెడ్డిగారు (బుచ్చిరెడ్డిపాలెం)
,, బెజవాడ వెంకటకృష్ణారెడ్డిగారు (బుచ్చిరెడ్డిపాలెం)
,, తాటికొండ లక్ష్మీకాంతరావుగారు (గుంటూరు)

పోషకులు.

శ్రీయుత మద్దుల వెంకటగిరిరావుగారు (భట్టిప్రోలు)
,, మద్దుల వీరభద్రరావుగారు (భట్టిప్రోలు)
,, ఊ. వెం. శ్రేష్ఠిగారు (వేటపాలెం)
,, యస్. పి. రాములు గుప్తగారు (చీరాల)
,, పాలా ముద్దుక్రిష్ణయ్యగారు (మద్రాసు)
,, దే. కా. నాగేశ్వరరావు పంతులుగారు (మద్రాసు)
,, రా. బ. దా. క్రిష్ణమూర్తిగారు బి. ఏ. బి. యల్. ధర్మాదాయముల బోర్డుకమీషనరుగారు (మద్రాసు)
,, పి. వి. రమణారెడ్డిగారు (అల్లూరు)
,, యానాటి చెంచులక్ష్మమ్మ, చెంచుపోలమ్మగార్లు (వరకలిపూడి)
,, గోపి వెంకటస్వామిగారు (విజయనగరము)
,, తిక్కవరపు రామిరెడ్డిగారు (నెల్లూరు)
,, ఒక మిత్రుడు
,, కోసూరు రామస్వామిగారు రైసుమిల్లు మర్చెంటు (కాకినాడ)

శ్రీయుత కులపాక వీరరాజు, బండారు రామమూర్తిగార్లు
(కాకినాడ)

„ తడవర్తి సుబ్బారాయుడుగారి కు. పున్నయ్య అండ్ బ్రదర్సు, మర్చంటు (రాజమండ్రి)

„ ముప్పన సోమరాజు అండ్ వీరరాజు సన్సు
(పెద్దాపురం)

„ వైద్యానువైద్య హకీం వానమాల నారాయణదాసు గారు (హైదారాబాదు)

„ వైద్యభూషణ హకీం దావత్ జనార్ధనస్వామిగారు
(హైదారాబాదు)

„ కొండా రామదాసురావుగారు కంట్రాక్టరు,
(హైద్రాబాదు)

„ చిల్కా రామయ్యగారు (హైద్రాబాదు)

„ విఠోభా శివయ్యగారు వడ్డేపల్లి, (షోలాపూరు)

„ బూరుగుల రామకృష్ణయ్యగారు (షోలాపూరు)

„ దామర్ల నరసింహంభావనారాయణగార్లు
(మంగళగిరి)

„ దామర్ల కనకయ్య, వెంకట సుబ్బయ్యగార్లు
(మంగళగిరి)

„ ఎలిగండ్ల లక్ష్మయ్యగారు (మంగళగిరి)

„ జంజినం బిచ్చంగారు (మంగళగిరి)

„ డాక్టరు డి. సత్యనారాయణగారు, సబ్ అసిస్టెంటు సర్జను, (బంటుమిల్లి)

అభిమానులు.

శ్రీయుత యిసునూరి సుదర్శనముగారు (చీరాల)
,, జి. ఆర్. తిరువేంగడంశెట్టిగారు, ౧౪౪ ఆదప్ప నాయనివీధి (మద్రాసు)
,, మునగాల గోవిందుశెట్టిగారు (మద్రాసు)
,, మార్కాపురము నారాయణస్వామిశెట్టిగారు (మద్రాసు)
,, ఏ. వి. కోటయ్యశెట్టిగారు (చాకలపేట, మద్రాసు).
,, వి. ఎ. వై. యెతిరాజులుశెట్టిగారు (మద్రాసు)
,, గద్దె రంగయ్యనాయుడుగారు (మద్రాసు)
,, నూకల చంగయ్య వెంకటసుబ్బయ్య సన్సు (అప్పయరాజుపేట)
,, నూకల చిన్నయసూరి గరుడయ్య సన్సు (అప్పయరాజుపేట)
,, బోగా వెంకటస్వామి చిన్నయ్యగార్లు (క్రొత్తపేట)
,, అవ్వారు అక్కిశెట్టిగారి వెంకటసుబ్బయ్య అండ్ బ్రదర్సు (క్రొత్తపేట)
,, ఉక్కడాల రంగయ్యగారు (పుల్లంపేట)
,, బోడగల వెంకట్రామయ్యగారు (మాధవరం)
,, తడవర్తి ఆదిశేషుగారు (కడప)
,, క. నారాయణ మునయ్య, కొండప్పగార్లు (జమ్మలమడుగు)
,, మెచ్చిరి సిద్దప్ప, మల్లేశ్వరప్పగార్లు (రాయదుర్గం)

శ్రీయుత కోటా వెంకటాచలపతిశెట్టిగారు (గుడియొత్తం)
,, వెన్నెలగంటి రాఘవయ్యగారుబి.ఎ.,బి.యల్.,(నెల్లూరు)
,, బత్తెన రామకృష్ణారెడ్డిగారు (అల్లూరు)
,, నూకలపాటి లక్ష్మిరెడ్డిగారు (అల్లూరు)
,, విశ్వనాథం సుబ్బరామయ్యగారు, ఆయుర్వేద ఘన వైద్యులు (కోవూరు)
,, యర్రబ్రోలు సుబ్బారెడ్డిగారు (సాల్లపల్లి)
,, కటికనేని కళ్యాణరావుగారు (వెంకటగిరి)
,, కాసరం చెంచురెడ్డిగారు (వెంకటగిరి తాలూకా మోపూరు)
,, పుత్తేటి నారాయణరెడ్డిగారు (అత్తివరం)
,, తూమాటి మల్లారెడ్డిగారు (గండవరం)
,, గండవరం హనుమారెడ్డిగారు (కొరుటూరు)
,, బండ్ల వెంకయ్యగారు (వేటపాలెం)
,, ఊటికూరి జయరామగారు (వేటపాలెం)
,, కంభంపాటి వెంకటసుబ్బయ్య చౌదరిగారు (తిమ్మసముద్రం)
,, ప్రగడ బాలనాగుగారు (మంగళగిరి)
,, పొట్టి రాఘవులు గుప్తగారు (చిన్న గంజాము)
,, భట్ట జ్ఞానకోటయ్యగారు (పెదన)
,, గోపి శ్రీరాములుగారు (కాకినాడ)
,, పెండెం అప్పలస్వామిగారు (రాజమండ్రి)
,, యన్. వెంకటేశ్వరరావుగారు (బెజవాడ)

శ్రీయుత చుక్కల వెంకయ్య బ్రదర్సు (రాజమండ్రి)
,, మిడితిపాటి బలరామస్వామిగారు (ఏలూరు)
,, వానపల్లి పైడయ్యగారు (ఏలూరు)
,, గుత్తికొండ పురుషోత్తంగారు (పాలకొల్లు)
,, బిక్కని వెంకటరత్నంగారు (చోడవరం)
,, మాడుగుల వెంకటప్పారావుగారు, జమీందారు (బొంతలకోడూరు)
,, దేవరశెట్టి వెంకటాద్రిగారు, జనరల్ మర్చెంటు అండ్ కమీషన్ యేజంటు (కంభంమెట్టు)
,, వనం కృష్ణమూర్తిగారు, హైకోర్టువకీలు (మానకోట, నైజాం)
,, వడ్డేపల్లి విశ్వనాథంగారు, పట్టుబట్టలవ్యాపారం (సిద్దిపేట)
,, శిద్దల మల్లయ్యగారు (బోనగిరి)
,, యెక్కలదేవి నరసింహులు (హైద్రాబాదు)
,, గొట్టుముక్కల శ్రీరాములుగారు (భువనగిరి)
,, దత్తాత్రి నరసయ్యగారు గుల్లాపల్లి శ్రీపద్మశాలి తరుణమండలాధ్యక్షుడు (షోలాపూరు)

## సహాయులు.

శ్రీయుత మునగాల వెంకటరెడ్డిగారు (పాతమంగళగిరి)
,, జంజనం వీరాస్వామిగారు (మంగళగిరి)
,, పలమర్తి సుబ్బారాయులుశెట్టిగారు (మద్రాసు)
,, దొంతు తిరపయ్యగారు (పుత్తవారిపాలెం)

" వొడ్డి రంగయ్యగారు (పుత్తవారిపాలెం)
" మేరువ నమ్మయ్య రామానుజులు అండు సన్సు (ఉప్పరపల్లి)
" మేరువ దాసయ్యగారి వెంకటయ్యగారు (ఉప్పరపల్లి)
" వంకదారు వెంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు (జమ్ములమడుగు)
" రాజా వెంకట్రామయ్యగారు (తాటిపత్రి)
" పచ్చారు వెంకట్రంగశెట్టిగారు (గుడియాత్తం)
" బి. ఆదినారాయణశెట్టిగారు (గుడియాత్తం)
" బిట్రగా కోటయ్యగారు (చీరాల)
" వాసపల్లి సుబ్బరాజుగారు, అసిస్టెంటు స్టేషను మాస్టరు (చిన్నగింజాం)
" నామాల అప్పలస్వామిగారు (కాకినాడ)
" గుడిమళ్ల జానకిరామయ్యగారు (వరంగల్)
" రామా బాలలింగంగారు (వరంగల్)
" గునిశెట్టి వెంకటయ్యగుప్తగారు (వరంగల్)
" యన్. వెంకటస్వామిగారు (హైద్రాబాదు)
" పుంజాల వీరయ్యగారు (హైద్రాబాదు)
" దోమల శంకరయ్య, వ. మల్లయ్య (బొంబాయి)

# విషయసూచిక.

# దేశీయ పరిశ్రమలు

## ప్రాచీనకాలము

భారతవర్ష మతి ప్రాచీనకాలమునందే ప్రశస్తములయిన కట్టడములు, పేరెన్నికగల దుకూలాంబరములు, ప్రఖ్యాతిగల యోడలు, విఖ్యాతిగల వాయువిమానములు, శ్రేష్ఠతరమైన యుక్కు, ప్రసిద్ధిగల రత్నములు, విలువలేని బంగారు, కొదువలేని పంటలు, తరుగులేని పాడి, సాటిలేని వాణిజ్యము, అనంతమయిన సంపద, పరిపూర్ణమయిన నాగరికత, సంపూర్ణమయిన భోగపరాయణత్వము, ప్రపంచపాలన జేసిన సార్వభౌములతో పొల్పారుచుండెను.

ప్రకృతి సిద్ధాంతమునుబట్టి జూడ భారతదేశమును పరమేశ్వరు డన్ని విధముల భూలోకముయొక్క సంక్షిప్తరూపముగా జేసియున్నాడు. అస్సాము దేశమున ప్రతి వత్సరము ౫౩౦ అంగుళముల వర్షము కురియుచున్నది. ప్రపంచమునందింత వర్షపాత మెచ్చటను గానరాదు. పూర్తిగ వర్షశూన్యములు గల యెడారులునుగూడ గలవు. జగతియందున్న అన్నిదేశములవారి నాహ్వానించుచున్న హిమవన్నగముయొక్క గంభీర మత్యుచ్ఛ్రితము. ఆ హిమవంతునిలో గల కైలాసగిరిం జూడ పరుగులిడు పరదేశవాసులే యిందునకు సాక్షి. ఇంతకన్న ప్రకాశవంతమగు ఇసుక యెడారులు సుందరములై యానందమునుగూర్చునట్టి యిసుకతిన్నెలుగూడకలవు. ఆఫ్రికా మొదలగు యుష్ణదేశములందుండు మహా వృక్షములును కర్పూర

మృగములును గలవు. ఇంగ్లాండమెరికా మొదలగు సమ శీతోష్ణ ప్రదేశములందు ఫలించు సస్యములుగూడ పండు చున్నవి.

అన్నిదేశములకన్న భారతదేశమున సుఖప్రదమగు శీతోష్ణములు, ఎక్కడలేని భూసారము, ఉపయోగకరమగు జంతుసమృద్ధి, మితిలేని యడవులు, లెక్కలేని గనులవలన నుత్పత్తియగు ముడిపదార్థములవల్ల సమకూడుచున్న పేరెన్నిక గల గృహపరిశ్రమలు, ప్రతిష్ఠగల వృత్తిపరిశ్రమలు, పూజ నీయంబగు పారిశ్రామిక కళలు, ఆదికాలమునుండి లాలిత్య సౌభాగ్యములతో దేశమంతట సజీవమయి యలరారుచుండెను.

హిందూదేశముయొక్క గొప్పతనమునకు కారణభూ తులగు కృషికులు, కార్మికులు, చర్మకారులు, జాలరులు, వేటగాండ్రు, దర్జీలు, వడ్రంగులు, కమ్మరులు, కంచరులు, అగ సాలులు, చిత్రకారులు, శిల్పకారులు, రత్నకారులు, కుంభ కారులు, రంగరాజీలు, పింజారులు, వస్త్రనిర్మాతలు, తంతు నిర్మాతలు, తైలనిర్మాతలు, గాంధికులుగా గల పారిశ్రమికుల పరిశ్రమలే యాధారమేగాని వేరుగాదు.

ఈ పరిశ్రమలయందు పారిశ్రామికులేగాక శిల్పులు మహాశిల్పులుగూడ కలరు. వారు తయారుజేసిన వస్తువు సామగ్రియందు జీవముట్టిపడుచుండును. జీవముట్టిపడుచుండు వస్తునిర్మాణము హిందూదేశమున మాత్రము తయారగును. ఇట్టిహస్తకళాలాలిత్యపరిపూర్ణ విలాసంబై యలరారు వస్తుసృష్టి పరదేశములం దెచ్చటను నేటికిని గానవచ్చుటలేదు. ఈ శిల్పు

లకు కొలిముట్లు చాలతక్కువ. వాటిని వారు స్వయముగ తయారుచేసికొందురు. వీరి యాదాయమునందుగల ప్రతి దమ్మిడీగూడ దేశమునందుండును. వీరికన్న దేశదారిద్ర్యమును బాపగల రక్షకులు వేరుగ గానరారు. "శిల్పులు ఈశ్వరాంశ సంభూతులు. వారి ఆజ్ఞ అనుసంధానక మయియున్నద" ని "కార్లయిల్" 1 పండితుడు వెలువుచున్నాడు.

"భారతదేశమునగల పనివాండ్రు మిక్కిలి కొలది పనిముట్లు వాడుదురు. వాటితో వారెంతసొగసుగ నెంత త్వరితముగ పనిచేయుదురో యైరోపేయు లద్భుతపడుదురని 'స్ట్రావొరినను' వ్రాయుచున్నాడు. 2. భారతీయుల పనిముట్లు గాంచియు వారి సరళ పద్ధతులగాంచియు "ఫాస్టరు" అచ్చెరువొందెను.3.

అతి ప్రాచీనకాలమునుండి జగజ్జేగీయ **మానముగా** భరతఖండమునందు విరాజిల్లుచుండిన పరిశ్రమలను, పారిశ్రామిక కళలను ఆయా కాలములందుగల ఋషిచంద్రులు, కవి సార్వభౌములు తమ గ్రంథములందు చక్కగ పలురీతుల వివర్ణించి యున్నారు. పారిశ్రామిక దేశమని జగమంతట పేరు నడసిన భారతదేశమునందు దురదృష్టముచేత పరిశ్రమలన్ని నేడు సన్నగిలుట తటస్థించినందున ప్రజలలో పారిశ్రామిక విజ్ఞానము మరుగుపడిపోయెను. అందువలన పెద్దలురచించిన గ్రంథములందుగల ప్రారిశ్రామిక కళాలాలిత్య మహత్వము కట్టుకథలుగా మారియుండెను. నిజకళలు కట్టుకథలుగా మార్పు చెందుటచేత దేశమునకు మితిలేని కొఱతచేకూరుచున్నది.

---

1. 2. 3. హిందువుల అధికృత ౧౭౭౬ పే.

దేశీయ పారిశ్రామికకళలు పునరుద్ధరించుటకుగూడ అడ్డుగలు
చున్నది. ఇందుచేత కాలము జరుగుకొలది దేశీయ విజ్ఞానప
శ్రమలు దూరమగుచున్నవి. నవీన విదేశయంత్ర కళాకౌ
లముకన్న ప్రాచీనభారతదేశ ప్రాశస్త్య పారిశ్రామిక కళాప్ర
జన్య మపారమైన విజ్ఞానమయియున్నది. అట్టి కళాసౌలభ
మిప్పటివారి కేమాత్రముగూడ లభ్యముకాలేదని గట్టిగ దెలు
వచ్చును. మరియు వస్తునిర్మాణకౌశలమునగల ప్రాచీను
ప్రజ్ఞ ఇప్పటివారిలో ఏమాత్రముగూడ కానవచ్చుటలేదు.

దేశవాళీ పరిశ్రమలు భారతదేశమునందెన్నిలక్ష
వత్సరములనుండి పాతుకొని యున్నవో ఇంతవర కెవ్వరును కన
గొనలేకున్నారు. "పృశ్నిమాతరః" భూమిని తల్లిగా తెలుస
కొని నాగలితో వ్యవసాయమును ప్రారంభించి విత్తనముల
నాటి వర్షధారలతోను, నూతుల సహాయముతోను భారతీ
యులు పండించుటకు ప్రారంభించిన కాలము లక్షలకొలది
సంవత్సరములు జరిగియున్నది. "విజ్ఞానంవాసః" విజ్ఞానవంత
లగు భారతీయులు మానరక్షణకై వస్త్రము నిర్మింపగలవా
లను గాను "తంతుమాతః" తంతువును తల్లిగా తెలుసుకున్న
కాలముగూడ అతిప్రాచీనతమయి యున్నది. గనులను
త్రవ్వి లోహములను గనుగొని ఇనుము ఉక్కు తయారుచేసి
డాలు, కత్తి, గండ్రగొడ్డలి, విల్లు, అంబులు మొదలగు ఆయుధ
ములుగూడ చాల ప్రాచీనకాలమునందే తయారుచేయుచుండిరి.

# ౧. వెండి బంగారు పరిశ్రమలు

భారతదేశమునందు వెండి బంగారు రత్నములు మొదలగు విలువగల పదార్థములను గ్రహించి నగలు, నాణ్యములు, కవచములు, రథములు, ఇండ్లు, భవనములు, పాత్రసామానులు నిర్మించుచుండెడి వారు.

## నగలు

భారతీయులు నగలు ధరించుటయం దలంకారమేగాక ఆరోగ్యమును మరియు నైశ్వర్య చిహ్నముగూడ కలిగియున్నది. నగలు ధరించుటలో స్త్రీలు పురుషులు సమానముగా ధరించుచుండెడివారు. మురుగులు, మురీడీగొలుసులు, దండచేతి కడియములు, మొలత్రాళ్లు, కంఠాభరణములు, వ్రేళ్ళకుంగరములు, చెవులకుపోగులు మొదలగువానిని వెండిబంగార్ల చేత తయారు చేయించుకొనుచుండెడివారు.

సీ॥ ... ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...
ముందర వెలుఁగొందు ముక్తాలలామంబు
తొంగలసంగడికాని తునుకగాఁగ
... ... ...
... ... ...
గంఠమాలికలోని ఘననీల రత్నంబు
గమనీయమగు మెడకప్పుగాఁగ
ఆ॥ హారవల్లులు రంగ హారవల్లులుగాఁగ
బాలలీల ప్రౌఢబాలకుండు। (భాగ. ద. ౨౯౭ ప.)

శ్రీకృష్ణునిగూర్చి పోతన వర్ణించినట్లు బాలకులకు భారతీయు లెన్నియో యలంకారములుగా నగలను చేయించి ధరింపచేయు చుందురు.

"తూర్యాభరణ నిర్ఘోషైస్సర్వతః ప్రతినాదితామ్॥"
(రామా. సుం. స 3. ౧౧)

లంకయందంతటను స్త్రీలుధరించిన నగలయొక్క సందడి ప్రతిధ్వనిగలిగించుచుండుటను హనుమంతుడు చూచియుండెను.

శ్రీనాథుడురచించిన వీధినాటకమునందానాటి నగల యలంకారము లెన్నియో గలవు.

" ముక్కునత్తొకవింత ముద్దుగుల్క "
" ముక్కున హురుమంజి ముత్యాలమునర "

సీ॥ తళుక్కుతళుక్కునకాంతి బెళుక్కుకెంపులమ్రుంగ।
రండమై కెంపొమ్మవి యందుగుల్క॥
" కనకంపుటందియల్ ఘల్లురనగ "
"మొలగండ లిమ్ముగః ప్రోతతో రంజిల్ల "
"కౌను జవ్వాడ మెట్టె యల్లవిసిరిపోయ "

ఉ॥ వీసపు ముక్కునత్తు నరవీసపు మంగళసూత్ర మోతయు।
న్యాసుకు రాని కమ్మ లరకాసుకు రానివి పచ్చపూసలు॥
"ఇత్తడి సొమ్ములు"

ఇవ్విధముగా దేశమునగల సంపన్నులు మొదలు పేద వాండ్రు వరకు ధరించు నగలను వర్ణించిన కవి సార్వభౌముడు పూజ్యుడు; ముమ్మాటికిని పూజ్యుడు.

సీ. కుప్పెరాగడిబిళ్ల కుంకుమరేఖ పా
పటబొట్టు కమ్మలు బావిలీలు।
లలిసూర్య చంద్రవంకలు సూసకము కెంపు
రవల పల్లెరుబూవు రావిరేక।
బుగడలు నానుగ్రోవులు తీగమెడనూలు
కుతికంటు సరపణ గుండ్లపేరు।
సరిగెముక్కర చిన్నసరము నుత్తును డాలు
కంకణంబులు తట్లు కడియములును
తే॥ సందిదండలు నొడ్డాణ మందమైన
ముద్రికలు హంసకంబులు మ్రోయు గజ్జె
లలరు బొబ్బిలికాయలు గిలుకుమట్టె
లాదియగు సొమ్ముదాల్చి యయ్యబల మెఱయు॥
(హంస వింశతి. ద్వి. ఆ. ౧౯౦ ప.)

చ॥ మిడిగల వజ్రపుంరవల మిన్కుల కమ్మలు జాతికెంపుటా
కడియములుం సుపాణుల చొకాటపుహారములుం॥
(హంసవింశతి. తృ. ఆ. ౪ ప.)

ఇవ్విధముగా స్త్రీలు ధరించు నగలెన్నియో గలిగి యున్నవి. వీటియం దగసాలి తన లలితకళానైపుణ్యమును కనులకింపుగూర్చు రీతితో తీర్చిచూపుచుండును.

"హిందువులకు సున్నితములయిన నగలపైగల యభిరుచి వారు కమసాలిపనిలో నతీతులగుట కర్హతయొసగినదని" 'ఎలిఫిన్‌స్టన్' తనఇండియా చరిత్రయను గ్రంథములో ౧౬౪ పే. లో వ్రాసియున్నాడు.

'మిల్లు' రచించిన ఇండియా అను వాల్యూం ౧౧ పేజి౧లో "కొద్దివెలగల మాయనగలు చేయుటలోవలెనే కొన్నిసున్నితము లైన పరిశ్రమలలోను—(పే3౦) రత్నములు మణులు...... బంగరులోను వెండిలోను సొగసుగ సున్నితముగ బొదుగగలిగి యున్నారని" వ్రాయబడియుండెను.

ప్రాచీనకాలమునుండి పురుషులేగాక స్త్రీలుగూడ నగలు మున్నగునవి చేయుచుండెడివారు. " పేశస్కారీం " ( తై. బ్రా. 3-౪-౯ ) బంగారు మున్నగు లోహముల పని చేయు స్త్రీ 3.

వెండి బంగారు కట్టడములు అలంకార పరిశ్రమలు

క్రి. శ. ౧౯౧౧ సం॥ లో జరిగిన ఢిల్లీ దర్బారునందు జార్జిసార్వభౌమునియొక్క మందిరమునకు బంగారు స్తంభములు, బంగారు శిఖరములు గల గుమ్మటము గలదు. 1. జహాంగీరు దర్బారులోని గోడల నిండుగ బంగారు పూలు రత్నములు కూర్చిన చీనాంబరతోరణములు వ్రేలాడగట్టబడి యున్నవని క్రీ.శ. ౧౬౧3 సం॥ లో వచ్చిన సర్ థామస్‌మన్రోగారు దెలిపి యున్నారు. 2. ఆగ్రాయందు రాణివాసపు స్త్రీలు యమునా నదియందు జలకమాడుటకుగాను నిర్మించిన చలవరాళ్ల భవనముయొక్క లోపలిభాగమున కుడ్యములకు బంగారు లతలమర్చి ఆలతలందు రత్నములను కూర్చిన నిదర్శనములు నేటికిని గానవచ్చుచునే యున్నవి. లోకప్రసిద్ధిగల తాజిమహాల్

---

1. 2. హిందువుల ఆధిక్యత 3. వేద కాలపు స్త్రీలు.

1. ఢిల్లీదర్బారు మహాసభావర్ణనము ౧౧౬ పే. 2.

నందుగూడ బంగారు లతలు లతలందు రత్నముల కూర్పును గలదు. షాజహాను బాదుషా ఆరుకోట్ల రూపాయలు వెచ్చించి తాను కూర్చుండుటకుగాను లలితకళారత్నశిల్ప కౌశలమును వెదజల్లుచున్నట్టి మయూరాసనమును జేయించెను. క్రీ. శ. ౧౪౪౪ సం॥ లో విజయనగరమును దర్శించిన అబ్దుల్ రజాకు వ్రాయుచు "ఇచ్చోట సార్వభౌము డధిష్టించు సింహాసనము మహోన్నతమయి యుండెను. అంతయు స్వర్ణమయమును రత్నఖచితమునయి యుండెను. ఆసింహాసనమును చేసిన యగసాలి యెట్టిశిల్పియో కాని యందలి కళానైపుణ్యము వర్ణనాతీతము. ప్రపంచమునందేదేశమున గాని ఏరాజునకుగాని ఇట్టిసింహాసన మున్నదట నెరుంగను. ఇట్టి పనితనము గూడ ఎచ్చటను జూచియుండలేదు. ఇమ్మడి దేవరాయలు దసరాయుత్సవములకు తాత్కాలికముగా నిర్మించిన దర్బారు భవనము పదిచేతుల సోపానమంటపమును బోలినది నిర్మింపబడి కానవచ్చెను. ఆ మంటపమునకు పై కప్పుగోడలు కత్తివెనుక భాగమున్నంత దళసరి బంగారు రేకుతో కప్పబడి యుందందు మేలయిన నవరత్నములతో మనోహరముగ స్థాపితమైయుండెను. ఆమంటపమునందు మొదటి అంతస్తుమీద రాయల సింహాసన మమర్పబడియుండెను. ఈసింహాసనముగూడ స్వర్ణనిర్మితమే! ఇది చాల ఎత్తుగా యుండెను. 1. క్రీ. శ. ౧౩౬౦ సం॥ లో ఓరుగంటినుండి మహమ్మదుషా 3అడుగుల వెడల్పు ౬అడుగుల పొడవుగల బంగారు రత్నాల సింహాసనమును గొంపోయెను.

---

1. ఆంధ్రదేశము విదేశయాత్రికులు.

ఈ సింహాసనము వెల నాలుగు కోట్ల రూపాయల కెక్కువ గలిగియుండెను. 1 క్రీ. శ. ౧౦౦౫ సం॥ లో గజ్నీ మహమ్మదు కాంగ్రేనగరమునుండి, ౩౦ గ. పొడవు. ౧౫ గ. వెడల్పుగల వెండిగృహమొకటి తనదేశమునకు గొంపోయెను. ఈ గృహము విప్పుటకును తిరిగికూర్చుటకును అనుకూలముగా యున్నది. గజ్నీ మరొకతూరి ౪౦గ. పొడవు, ౨౦గ. వెడల్పు గల చాందినీకియున్న వెండి బంగారు పోతస్తంభములను గూడ గైకొని పోయెను. 2. పాటలీపుత్రమును చంద్రగుప్తుడు పాలించుకాలమున సువర్ణస్తంభములు, బంగారు పిచ్చుకలు నవరత్నములతో చేయబడిన బుష్పములు గలిగిన రాజభవనములు గలిగి యున్నవి. 3.

"జాంబూనదమయైర్ద్వారైః॥ "

(రామా. సుం. స 3. ౮)

" ప్రాసాదమాలావితతాం స్తంభైః కాంచనరాజతైః "

" శాంతకుంభమయైర్జాలైః "

(రామా . సుం. స ౨. ౫౧)

బంగారుతో చేయబడిన ద్వార, గవాక్షములు, వెండి బంగారు స్తంభములు, లంకయందుండగా హనుమంతుడుచూచి యుండెను.

"జాంబూనదమయాన్యేవ శయనాన్యాసనానిచ"

"భాజనానిచ ముఖ్యాని దదర్శహరియూథపః"

(రామా సుం. స ౬. శ ౧. ౪. ౨.)

---

1. ఆంధ్రుల చరిత్ర. 2, 3. మనకీ దారిద్ర్యమేల .

"జ్వలంతః కాంచనాదీప్తాః"

(రామా. సుం. స౯. ౬.౭)

రావణుని యుత్తమభవనంబున పాన్పులు, పీఠంబులు పాత్రములు, దీపపుసెమ్మెలు బంగారుతో చేయబడినవి యుండగా హనుమంతుడు గాంచియుండెను.

సీ. ఏందేని సర్వభూతేశుండు సృజియించె
సచరాచరములైన జగములెల్ల.
గంగ ప్రత్యక్షంబు గావింప నెందేని
కృతవాసుడయ్యె భగీరథుండు
నలినసంభవ నరనారాయణ స్థాణు
వాసవ ప్రభృతి గీర్వాణముఖ్యు
లెందేని క్రతువు లనేకయుగంబుల
జేసిరి రత్నవిచిత్ర వితత
ఆ॥ చైత్యములు మహావిశాల హిరణ్మయ
యూపతతులు నోలినొప్పరుచుండు
నట్టి బిందుసరమునందున్న వివిధ ర
త్నోప కరణచయము లోనరగొనియె.

(భార. సభా)

భారతకాలమునాటివరకు బిందుసరోవరమునందు విశాలమై విచిత్రములగు రీతితో రత్నములనుగూర్చిన చిత్రస్థూపములును, యజ్ఞయాగాదిక్రతువుల విజయగుర్తుల దెలుపు బంగారు జయస్తంభములును ఎక్కువగా యుండెను. ఇక్కడ

గల గనులనుండి త్రవ్వబడిన రత్నములు స్ఫటికములు, చంద్రకాంతరాళ్లు మొదలగు వాటితో నిర్మించినదే మయసభ—

## ౨. కట్టడములు వాటి గొప్పతనము

### మ య స భ .

“ఏను దానవ విశ్వకర్మ ననేకవిధ శిల్పకలాకుశలుండ మీ కిష్టంబయిన దాని నిర్మించెద ననుపుండనిన... కృష్ణుండు పెద్దయుం బ్రొద్దు విచారించి మయునకిట్లనియె.

(భార. సభా)

చ. కురుపతికిన్ యుధిష్ఠిరునకున్ సకలక్షితి పాలసేవ్య సు
స్థిరవిభవాభిరామున కతిప్రమదంబుగ రత్నరాజి సుం
దరమగు దాని నొక్కసభ ధాత్రికపూర్వముగానొనర్చి చె
చ్చెర గొనిరమ్ము నీదయిన శిల్పకలాకుశలత్వ మేర్పడన్.

(భార. సభా ౧ ఆ)

“ తొల్లి వృషపర్వుండను దానవేంద్రున కొక్క సభ నిర్మింప సమకట్టి వివిధరత్నమయంబులైన యుపకరణంబులొడఁ గూర్చి బిందుసరంబను కొలన సంగ్రహించినవాడనయ్యుపకరణంబుల దాని విచిత్రంబుగా రచియించి తెచ్చి ధర్మరాజున కిచ్చెద ”

(భార. సభా.)

క. విమల మణిమయము లగు దూ
లములం గంబముల గోడలను వేములగు

ట్టిమముల జుట్టిన ప్రాకా
రములను గరమొప్పచుండ రచియించె సభ౯

(భార. సభా ౧౧.)

సీ. సురుచిరహారినీల కిరణజలంబుల
బద్మరాగారుణ పద్మములను
రాజితరాజీవ రాజహంసావళి
నిర్మలసౌవర్ణ కూర్మములను
గమనీయ వైడూర్య కుముదంబులను వజ్ర
మీనమౌక్తిక నవఫేనములను
మరకతశైవలోత్కరముల విలసిల్ల
గొలనని సన్మణి స్థలము సూచి
ఆ॥ పలుగురాల కుడ్యముల రుచుల్ గప్పిన
జలములున్న యెడలు వెలయజూచి
యనుపమ స్థలంబులని జనులెరుగక
యుండునట్లుగా మయుండు సేసె.

(భార. సభా. ౧౨ ప)

"మఱియు సకలజన మనోహరంబులయిన నానావిధ యంత్రంబులును ననవరతకుసుమ ఫలభరితంబులైన తరువనంబులును వికచక కుముదాభిరామంబులైన జలాశయంబులును వివిధవిచిత్ర పతాకావిలంబితతోరణ విటంకప్రదేశంబులునుం గలిగి దశవిష్కుసహస్ర ప్రమాణవృత్తాయతంబును సహస్రకర ప్రభాప్రసరవిభూతియును వివిధరత్నవిభవాభి శోభితంబునుం గాన పూర్వసభాభవనంబు పదునాలుగు నెలలు నిర్మించి దాని

నెనిమిదివేల రాక్షసకింకరుల మహాకాయుల మహాజవసత్వ సంపన్నుల నంతరిక్షచరులం బనిచి మోపించికొని వచ్చి ధర్మ రాజున కిచ్చె”

మహాశిల్పులు నిర్మించిన మయసభయందు కళావిజ్ఞాన మపారముగ నున్నది. ఇందుగల శిల్ప విశేషములు విమర్శన గావించుట సులభసాధ్యమయిన పనిగాదు. శ్రీమదాంధ్రమహా భారతమంత గ్రంథము వ్రాసినను తనివితీరదని తలంపనగును.

### లంకలో విచిత్రవిహారము.

“కృతాశ్చ వైఢూర్య మయావిహంగం
రూప్యప్రవాళై శ్చతధా విహంగాః
చిత్రాశ్చనానావసుభిర్భుజంగా
జాత్యాను రూపాస్తురగా శ్శుభాంగాః ॥
ప్రవాళజాంబూనద పుష్పపక్షా
స్సలీలమావర్జిత జిహ్వపక్షాః
కామస్య సాక్షాదివభాంతి పక్షాః
కృతావిహంగా స్సుముఖా స్సుపక్షాః ॥
నియుజ్యమానాస్తుగజా స్సుహస్తా
స్సకేసరాశ్చోత్పల పత్రహస్తాః
బభూవదేవీచ కృతాసుహస్తా
లక్ష్మీ స్తధా పద్మిని పద్మహస్తా ॥
(రామా. సుం. స ౭. ౧౨. ౧౩. ౧౪.)

లంకయందు గల విహారగృహముసందొక తామర కొలను నిర్మింప బడి యున్నది. అందు తామరాకులు పూవులు

నిండుగ గలవు. ఒక తామరపువ్వులో తామరపూవులను చేత ధరించిన లక్ష్మీదేవి, నిండు కళాకౌశలముతో శోభించు చున్న ఏనుగులు గలవు. వైఢూర్యములతోను వెండితోను పగడములతోను చేయబడిన పక్షులు అనేకరంగుల రత్నములతో చేయబడిన సర్పములు, శుభకరములగు అవయవములు గల తురంగములు, బంగారుతోను పగడములతోను మరియు అనేకరీతుల రెక్కలుగల పక్షులతో లలితలావణ్యంబగు శిల్ప కళా శోభ ముద్దులొలుకు చుండిన ఈ ప్రదేశమును హనుమంతుడు గాంచెను.

## నాగార్జున విహారము

గుంటూరు మండలమున పల్నాటి తాలూకాలో మాచర్లకు నుత్తరముగా పదునైదు మైళ్ళ దూరమున కృష్ణానది యొడ్డున శ్రీపర్వతమను నాగార్జున కొండగలదు. ఈపర్వతమునందు శాతవాహనుడు నాగార్జునుం డుండుటకుగాను బౌద్ధవిహార గృహమొకటి కట్టించెను. కొండలో రెండుమైళ్ళ పొడవున సారంగము గలదు. ఆసారంగమందు నడచుట కనుకూలముగనుండి యిరుప్రక్కల స్థలంబులుగలిగి పొడవుగానున్న విహారములును, ఎత్తైన గోపురముల క్రింద వసారాలుగల ఐదంతస్థుల కట్టడము నొకదానిని జూచితిని. ఆయంతస్తులలో నొక్కొక్క దానియందు నాలుగేసి విహారములు గలవు. విహారములకు నడుమ దానిని చుట్టుకొను పడసాలలు (వసారాలు) గలవు. ఆవిహారములం దొక్కదానియందు సువర్ణమయము లయిన బుద్ధుని జీవప్రతిమలు గలవు. అవి నవరత్న ఖచితము

లయి చిత్రవిచిత్రా లంకారములతో శోభిల్లుచున్నవి. ఈపర్వ తాగ్రమునుండి సెలయేటిధారల కాల్వలు ప్రతియంతస్తునందును, మంటపములగుండను వసారాలచెంతను, విహారముల చుట్టును పారుచు కొండక్రిందకు బ్రవహించుచుండును. అచ్చటచ్చట గుహలపై గానవచ్చు సొరంగములు, పైనుండి లోపలి గుహలోనికి విహారములలోనికి గాలిని వెలుతురును బోనిచ్చుచు వాటిని కడు రమణీయములుగను, నివాసయోగ్యములుగను జేయుచున్నవి.

ఈ సంఘారామమునకు తొమ్మిదికోట్ల సువర్ణములు ఖర్చుపడెననియు "యుఆన్‌చ్వాంగ్" చెలుపుచున్నాడు 1.

ఈ విహారములన్నియు శిల్పరహస్యములయం దారితేరిన మహాశిల్ప శిఖామణులచేత నిర్మింపబడియున్నవి. నాగార్జున విహారములకు సమకాలీనమైన విహారములు ఇట్టి మహాశిల్పులచే నిర్మింపబడినవి అమరావతి, ధాన్యకటకము, జగ్గయ్యపేట, భట్టిప్రోలు, మోటుపల్లెయందును గలవు.

## ఎల్లోరా విహారములు.

గుహలలో తొలువబడిన గుళ్లు ఈ దేశమునకు విశిష్టములు; ఇవి జనుల సహజకళా పరిజ్ఞానమును బ్రకటించుచున్నవి. ఎల్లోరాదేవళముల గురించి హీరెక్ పండితుడిట్లనుచున్నాడు; "నేలపైన నెంతగొప్పగ, నెంత దివ్యముగ, నెంత శృంగారముగ వాస్తుకల్పనము సేయుట సాధ్యమగునో అంతయు నిక్కడ జూడనగును. పైననే కాదు నేలలోగూడ

1 విదేశయాత్రికులు- ప్రాచీనాంధ్రదేశము.

నట్లే యొనర్పబడినది. సోపానశ్రేణులు, వంతెనలు, పూజా మందిరములు, స్తంభములు, మండపములు, సూక్ష్మాగ్ర స్తంభములు, హిందూదేవతాస్వరూపములగు, గొప్పగొప్ప విగ్రహములు ఇంచుమించు అన్ని గోడలపైనను జెక్కబడిన దేవతల యొుకు చిత్రములును ముఖ్యములయిన యుదాహరణములు" "గ్రిఫిత్ గారిట్లనిరి" "ఎంతోకాల మీ గుహాలను నేను మిగుల శ్రద్ధతో బరిశీలించితిని. పొరపాటున రాయి కొంచెమెక్కువగ గోసినట్లొక చోటనయిన గనిపెట్ట జాలనయితిని. ఒక్కసారి చేయిజారినయెడ బాగుపరచుటకు వేఱొకతాతిముక్క తెచ్చి యతుకవలయు, నట్లతికినచో నందవికారమై దోసమువాటిల్లును గదా! అట్టి దోసగిందొక్కటియు గానరాదు. 2.

ఎలిఫెంటుగృహాలు

బొంబై నగరమునగల సముద్రపురేవునందు నౌక నెక్కి యొక ఘంటసేపు తూర్పుదిక్కున సాగరయానము జేసిన తరువాత "ఘూరాపురి" యనంబడు చిన్న లంకవంటి ప్రదేశ మున్నది. ఆ నిలయమునందు రెండుకొండలు గలవు. ఒక కొండయందు ౧౨౦౦ సం॥ క్రింద చెక్కబడిన కొన్నిగుహ లున్నవి. అందు ౧౨ అడుగుల నిడివిగల విగ్రహములు గుహాల యందు కొండలో తొలువబడియున్నవి. త్రిమూర్తులు, పార్వతీ కళ్యాణము, కళ్యాణాంతర వేడుకలు, అర్ధనారీశ్వరావతార విశ్వసందర్శనము, అష్టభుజాదేవి, మొదలగు పెద్దపెద్ద శిల్పముల యలంకారముతో లాలిత్యలావణ్యములతో విరాజిల్లు

---

1-2. హిందువుల ఆధిక్యత ౫౪౬-౫౪౭.

చున్నవి. మరియు నూ●గజముల నిడివి అంతవెడల్పునుగల విశాలమైన మండపము దానికొలఁకు స్తంభములు కొండల యందే మలవబడియున్నది. మంటపమునకు ప్రక్కన ౧౬ అడుగుల లోతుగల పెద్దకోనేరు, కోనేరునందు పైకొండకు పోటీగా రెండు పెద్ద స్తంభములు మలువబడి యుండెను. ఈ విహార మంతయు మిక్కిలి మనోహరముగా నున్నది. ఈ కొండ రాతితో ఒక పెద్ద ఏనుగను తయారుచేసినందున ఈ కొండ లకు ఏనుగ విహారము (ఎలిఫెంటుగృహాలు) అని పేరువచ్చి నది. ఈ యేనుగ ప్రస్తుతము బొంబాయిలోని విక్టోరియా గార్డనులో గాంచనగును.

## అమరావతి శిల్పము

భారతదేశమునగల బౌద్ధస్తూపములలో నమరావతి స్తూపము ప్రధానస్థానము వహించియున్నది. ఈస్తూపశిల్పము నకు పల్నాటి నాపరాళ్ళ నుపయోగించియున్నారు. క్రీ. పూ. ౨౦౦ స॥ క్రింద ఈ స్తూపనిర్మాణవ్యారంభమయి యుండెను. క్రీ. శ. ౧౩౫ స॥ ధరణికోట పాలించిన వశిష్టపుత్ర పులుమావి అతని గురుండగు సిద్ధనాగార్జునుండును ఈ చైత్యముయొక్క కట్టడమును పలురీతుల పెంపొందించి లెక్క లేని చిత్రములతో పెద్ద ప్రాకారమును విశేషయలంకారశిల్పపు శిలలతో నిలయ ములు నిర్మింపజేసి యున్నారు. అందుచేతనే ప్రపంచయాత్రగా ధరణికోట చైత్యమేర్పడి యుండెను. కోట్లకొలది రూపాయ లను వెచ్చించి నిర్మింపజేసిన స్తూపరాజము దురదృష్టముచేత ౧౧ వ శతాబ్దమున కూలద్రోయబడి యుండెను. అనంతరము

మహాశిల్పముతో నిండియుండిన ఇచ్చటి శిలలను సున్నము కొఱకు కాల్చుటకును, ఇతరకట్టడములకు పలురీతుల భిన్న పరచి యుపయోగింపబడు చుండెను.

ఇట్టీవిలువ లేని శిల్పసంపద నాశము జెందుచుండగా క్రీ.శ. ౧౭౯౭ సం॥ క్యాప్టన్ మెకంజీగారు చూచుట తటస్థించెను. వెంటనే వారు నిలువయున్నంతవరకు రక్షించియుండిరి.

౧౮౮౧ సం॥ అమరావతినుండి తీసికొని పోబడిన చెక్కడపు శిలలలో నెక్కుడు భాగము లండనులోని బ్రిటిషు మ్యూజియములోను కొద్దిగ చెన్నపట్టణములోని చిత్రవస్తు దర్శనశాలలోను ఉన్నవి. కొన్ని మచిలీ బందరునకు, మరి కొన్ని కలకత్తాకును చేర్చబడెను.

శిల్పకళాశాస్త్రజ్ఞుడగు ఫెర్గ్యుసన్ గారీ శిల్పనైపుణ్యమున కచ్చెరువంది దాని నవగాహనము చేసికొని ఆస్థూపమును గురించి ఒక యుద్గ్రంథమును బ్రకటించెను. రాబర్టు స్యూయల్ గారు గూడ ఆస్తూపమునుగూర్చి సవిస్తరవృత్తాంతమును ౧౮౮౦ సం॥లో ఒక గ్రంథమును బ్రకటించెను. తరువాత నిందలి వైభవములను జూపు పటములతో నీస్థూపమును గూర్చి "బర్గెస్సు" అను నాతడు సంపూర్ణవర్ణనమును వ్రాసెను.

ఈ శిల్పమునందు సజీవచైతన్యము జూపట్టుచుండును. రాజకీయ దర్బారులు, రాణుల దర్బారులు, మహాభక్తకూటములు, దేవతా సమావేశములు, బౌద్ధపురాణ గాథలు గల చిత్రములు వేలకొలది గలవు.

---

1. అమరావతి శిల్పమునుగూర్చి ఆంధ్రవిజ్ఞాన సారస్వమునందు గైకొనబడినది.

ప్రస్తుత కాలమునందు ఈ శిల్పమును గూర్చి గాంచగల ప్రదేశములు రెండుగలవు. ఒక టమరావతియందు స్థూపనిర్మిత ప్రదేశమున భిన్నములయిన శిల్పము లొకచోట గాన్పింప గలవు. మరొకచోట ధనాగారమను భావిచుట్టు కొన్ని శిల్పపు పలకలు గానవచ్చుచున్నవి. రెండవది మదరాసు చిత్రవస్తు దర్శనశాల. ఇచ్చట ఒకపెద్ద గదినిండుగ ఈ శిల్పపు పలక లుంచబడి యున్నవి.

## బీజపూరు గోల్ గుమ్మటము

బొంబైరాజధానియందు మహమ్మదు ఆదిల్ షాహ పాలించిన బీజపూరుయను నగరమొకటి గలదు. ఈ నగరము నందీ షాదుషా ౧౬౭౦ సం ప్రాంతమున కట్టించిన ప్రశస్త కట్టడములు గలవు. అందు గోల్ గుమ్మటమను పేర ౧౯౮ అడుగుల ఎత్తుగలిగి ౧౫౦ అడుగుల చుట్టుకొలతగల గుమ్మటము గలదు. గుమ్మటములోనికేగి మనమొక శబ్దమిడిన నెనిమిదిపర్యాయములు ప్రతిధ్వని స్పష్టముగా వినవచ్చును. గుమ్మటముయొక్క గోడకొక వాక్యము నెమ్మదిగా వెలిపి నట్లులయిన వాయువార్తయై వెంటనే ఎదుర నూటిగాయున్న గోడవద్ద గట్టిగా వినవచ్చుచున్నది. ఇట్టి నిర్మాణము భారత దేశమునం దెచ్చటను గానవచ్చుటలేదు. ఈగుమ్మటమును నిర్మించిన త్వష్ట నిర్మింపజేయించిన ఆదిల్ షా అభినందనీయులు. ప్రాచీన భారశిల్పుల పనితనములోని నద్వితీయ చాతుర్యములను గాంచుటకివేగద నిదర్శనములు.

## ప్రతిధ్వనినిచ్చు పర్వతము

మైసూరు రాజధానిలో మలకాలమ్మయను నగరము గలదు. ఆనగరమువద్ద "నుంకేమల" లేక త్రిపర్వతములు అను మూడు కొండలుగలవు. ఈ కొండలలోని తొలికొండ పైభాగమునగల చెరువునకు ప్రక్కగా కొంచెమెత్తున నిర్జన ప్రదేశము గలదు. అచ్చోటజేరి మాటలాడిన అక్కడకు నూరు గజముల దూరమునందున్న రెండవకొండ గుట్టనుండి స్పష్టమైన ప్రతిధ్వని వినవచ్చుచున్నది. శబ్దమువినవచ్చుటలో మన వాక్కునగల అమృతవాక్కు, లేక గబల, కీచు, మొదలగు రీతుల నిర్మలముగా వినవచ్చుచున్నది. పరమేశ్వర నిర్మితమగు ఈ యద్వితీయ వాయువార్తయాత్రకు దేశీయులు పరదేశీయులువచ్చి వినోదమానందించి వెళ్లుచుందురు. పిడేలు, మద్దెల, వీణాదిగాగల సమస్త సంగీతగానములుగుండ పాడి ప్రతిధ్వనివిని యాత్రికులానందించు చున్నారు.

## ఇతర కట్టడములు

మూర్షదాబాదును ప్లాసీ యుద్ధానంతరము క్రీ. శ. ౧౭౫౭ సం॥లో క్లయివు స్వయముగాచూచి యాశ్చర్యము చెందెను. "ఈపట్టణము జనసంఖ్యయందును వైశాల్యమందును లండను నగరము బోలియుండెననియు, ఈ నగరమునగల యఖండైశ్వర్యవంతులు లండనులో లేర"నిగూడ తెలిపియుండెను. 1. గంగానదీ తీరమునందు గొప్ప నౌకావాణిజ్యమును విదేశములతో సాగించుచుండిన "గౌరు" నగరమునందు ౧౨

---

1. భారతవస్త్ర పరిశ్రమల చరిత్ర.

లక్షల కుటుంబములు గలవని ౧౬. శ॥ నందు హంటరుదొరగారు దెలిపియున్నారు. 2. క్రీ. శ. ౧౦౧౭ సం॥లో గజ్నీ కనోజు పట్టణమును దోచుకొనుటకువచ్చి; నగరమునందుగల భవనముల నిర్మాణకళా సౌభాగ్యముల కాశ్చర్యమునొంది తనవారి కిట్లు వ్రాసియుండెను. "ఇచ్చట వేలకొలది మందిరములుగలవు. అవి నిశ్చలభక్తుని నమ్మికవలె దృఢమైనవి. అవి చాలవరకు చంద్రకాంత శిలా నిర్మితములు. ఇవిగాక యసంఖ్య దేవాలయములుగలవు. ఈ కనోజుపట్టణమున కింతచక్కదనము వచ్చుటకు కోట్లకొలది దీనారులు వెచ్చింపబడియుండవలెను. రెండు వందల వత్సరములలోగూడ నిట్టి పట్టణము గట్టుట దుర్లభము" 3. రాజస్థాన చరిత్రకారుడగు కర్నల్ టాడ్ క్రీ. శ ౧౬ శ। లో కనోజు పట్టణమును దర్శించియుండెను. "ఈ నగర మెటుచూచినను ౧౫ క్రోసులు (30 మై) వైశాల్యము గలిగి ప్రస్తుత లండనుపట్టణమువలె యున్నది. ఇందు 30 వేల తాంబూలపు దుకాణములు ౬౦ వేల గాయకమేళములు గలవని తెలియజేసెను." 4. పాటలీపుత్రముయొక్క కోట ఎనిమిది మైళ్ళ విస్తీర్ణముగలిగి ౫౭౦ బురుజులు ౬౪ ద్వారములు గలిగి యున్నది. 5. కర్ణాటాంధ్రావనికి జగజ్జేగీయ మానంబగు కీర్తినిగూర్చినవి జయనగరపుకోట ౧౨౦ మై. చుట్టుకొలత గలిగి 30 లక్షల జనసంఖ్యతోగూడి యున్నది. ఇట్టి మహా వైభవ ప్రాశస్త్యభవన నగర దుర్గములయొక్క గొప్ప

---

2. మనకీ దారిద్ర్యమేల 3. మహమ్మదీయ మహాయుగము ౨౫ పే
4. హిందువుల అధిక్యత ౧౬ పే 5. హిందూమహాయుగము

తన మానాటి భారతదేశ ప్రజలయందుగల హస్తకళా నైపుణ్యమును జాటుచున్నవి. ఈహస్తకళలే గృహపరిశ్రమలు వృత్తి పరిశ్రమలను పేరపెంపొందినవి.

"అర్ధయోజన విస్తీర్ణమాయతం యోజనంహితత్
భవనం రాక్షసేంద్రస్య బహుప్రాసాదసంకులమ్"
(రామా. సుం. స ౯. ౨)

"సప్తభౌమాష్ట భౌమశ్చ
రామా. సుం. స ౨. ౫౨.

"సపాండురోద్విద్ధ విమానమాలినీం
రామా. సుం. స ౨. ౫౬.

లంకాపురి ౬. మై. వెడలుపు ౧౨ మై. పొడవు గలిగి వీధులందు ఏడెనిమిది దంతస్తుల మేడలును; ఆమేడలు తెల్లగనున్ననె పస్తులు దీరి కానవచ్చుచున్నవని హనుమంతుడు చెలుపుచున్నాడు.

ఇంత సంపద లంకకు ప్రాప్తించుటకు గారణము వారి పరిశ్రమలు వారు పరదేశములతో జేసిన వాణిజ్యమే ముఖ్య కారణములని తలంపవలెను.

# 3. వర్ణచిత్రలేఖనము.

---

హావెల్ గారు "భారతీయుల చెక్కడపు పనులు చిత్ర లేఖనములు" అను పేరుగల గొప్ప గ్రంథమును రచించినారు. ఆ పుస్తకములో "భారతీయ కళాసృష్టిలో నీశ్వరప్రేరణాంశ

మెంతయున్నది" అను శీర్షికగల యొక యధ్యాయములో నీక్రింది యంశములు వివరించెను. "హిందూజాతి యాధ్యాత్మిక చింతనము గలది. అడవిచెట్లగుండ వీచు వాయువులలోను, నాకనిర్మితములైన హిమాలయములనుండి ప్రవహించు జలములలోను, ఉదయాస్తమాన భానులశక్తి సౌందర్యములలోను; మిట్టమధ్యాహ్నపువేళ మూలమూలకు ప్రాకు వేడిమి వెలుగులలోను; తూరుపుసీమల వారి కుల్లాసమొసగుచుండు వెన్నెలలు సోయగంబులలోను; వానకాలములో గంభీరముగ నాకసము గప్పి విఱ్ఱవీగి నడయాడు మబ్బులలోను; భయానకములై చెలగు తుపానులలోను; జీవప్రదాయినులై యుల్లముల బొంగజేయు వానజల్లులలోను; వానికి దోడయి వచ్చు తళుకు మెఱుములలోను, ఉఱుములలోను; ఎంతెంత యర్థమిమిడియున్నదో హిందువులు కన్గొనినారు. 1. అజంతాచైత్రవిహారముల చిత్రలేఖనములలో ప్రదర్శింపబడిన శాస్త్రసంబంధమైన కౌశలమును గూర్చి గ్రీఫిత్సుగారు ఇట్లు వ్రాసిరి. ఈయన బొంబై కళాపాఠశాలలో తనయొద్ద జదువుకొనుచున్న వారిచే స్వయముగ దగ్గరనుండి యాబొమ్మలకు ప్రతులు తీయించెను.

"ఈబొమ్మ వ్రాసిన పనివారు అఖండమయిన పనితనము గలవారు. నిట్రములయిన గోడలమీద సయితమును కొన్నికొన్ని రేఖలు కుంచెనొక్కమారిట్టియుంటించి లాగినంత మాత్రాన నేర్పడినవి. ఇది మిక్కిలి యద్భుతమని నామనస్సుకు గాఢముగా

1. హిందువుల ఆధిక్యత ౫౩౬

తట్టినది. గోడలమీద వ్రాతలటుండ పైకప్పుల దేసనైగూడ నల్లె వంపుగీతలను కించిత్తు వ్యత్యాసమయినను జిత్రించిరి. ఈపని దానికంటె వేయిరెట్లు కష్టము. గేవలము అలౌకికముగ గన్పట్టును. 1.

"చిత్రశాలాగృహాణిచ.........క్రీడాగృహాణిచ"

(రామా. స ౬. ౩౬, ౩౭

చిత్తరువులు వ్రాయబడియుండి క్రీడింపయోగ్యమైన ఇండ్లను హనుమంతుడు లంకయందు చూచెను.

## స్త్రీలుచిత్రలేఖనము.

"యా ప్రలిఖతే తస్యై ఖలతిరపమారీ" ౨.

తై. సం. ౨. ౫. ౧. ౭.

ఎవతె యేకవస్త్రయైయుండి చిత్రలేఖనము చేయునో యామెకు బట్టతల గలవాడును నపస్మరణ శీలుడును జన్మించును.

అష్టదిక్పాలకులలో నొకడగు వరుణదేవుని సతి చిత్రరేఖయను నామముధరించి యుండుటచేత ఆర్యులకాలము నాటి చిత్రలేఖనము యొక్క ప్రాశస్త్యము తేటపడుచున్నది.

వృషాకస్యకలయందు గాంచిన వరుని దెలుపుటకై చిత్రరేఖయను చెలికత్తె లోకములోగల రాజులపటంబులు చిత్రించెను.

చ॥ సరసిజనేత్ర యేటికివిచారము నాకుశలత్వమేర్పడన్
నరసుర యక్షకింపురుష నాగనభశ్చర సిద్దసాధ్య కి

1. హిందువుల ఆధిక్యము ౫౬౧. 2. వేదకాలపు స్త్రీలు ౯ వ పే.

న్నిర వరముఖ్యులఁ బటమునఁ గ్రి లిఖియించి జూచి నీమనో
హరుఁగని నీరజాక్షిపొమ్మనిఁ దప్పకే నానిని నీకు దెచ్చెదఁగ॥

వ. అని యొడంబరచి మిలమిలని మంచుతోడం బురుడించు ధళధళమను మెఱుంగులు దుఱంగలిగొను పటంబుసేసి వజ్రంబున మేదించి పంచవన్నియలు వేలువేల కనక రజత పాత్రంబులనించి కేలందూలికఁ ధరించి యొక్క విజనస్థలంబునకుం జని ముల్లోకంబులం బేరుగలిగి వయోరూప సంపన్నులయిన పురుషముఖ్యుల నన్వయగోత్ర నామధేయంబులతోడ వ్రాసి యాయితంబయిన యప్పటంబు దనముందట దెచ్చిపెట్టి యిప్పటంబునందగులని వారలేను వారిం జెప్పెద సావధానంబుగ నాకర్ణింపుమని యిట్లనియె.

(భాగ. దశ. ౩౮౫, ౩౮౬)

సీ॥

గీ॥ గలలఁదోఁచిన రూపు గ్రక్కునఁ లిఖించు
వారు నేర్పున దోఁతెచ్చు వారుగలరె
నీటిలోఁ జాడఁబుట్టించు నేర్పునీక
కాక గల్గనే మూఁడు లోకములయందు.

భాగ. గ. ౩౭౦ ప.

చిత్రలేఖయను నామము సార్థకమగునంత చిత్రితశక్తి గలిగి యుండుట చేతనే యింత కార్యమును సులభముగ సాధింప గలిగెను.

'ప్రతిలిఖితి' అను వేదపదమునకు భాష్యము వ్రాయుచు సాయణాచార్యులు "భిత్తౌ చిత్రాణి కంకరోతి" యనగా గోడ

మీాద బొమ్మలు మున్నగు వానిని వేయునో యని చెప్పి యున్నారు 1.

సీ॥ అమర వల్లభుఁడు గౌతము కూర్మియిల్లాలి
జీకటి తప్పుసేసిన విధంబు
సితభాను డాచార్యు చిగురాకు బోడిపై
గన్ను వైచిన కన్నె కలుపుమరులు
నట్టేట దాసకన్యకకు నువ్విళులూరి
జాలిబొందిన పరాశరువిరాళి
గారాపు కూతుపైఁగాగాని పనిబూని
వనజసంభవుని నెమ్మనము వెలితి

తే॥ దారువనవీధి శీతాంసుధరుని రంతు
శౌరి గోపాల కామినీ చౌర్యకేళి
కామరస భావములమించి కానబడఁగ
దీర్చి యిడుపులయందుఁ జిత్రించినారు।

(శృం. నై. అ 2. విహారసౌధము ౧౯౧)

నలుని విహారగృహమున నొకచోట నైవిధములయిన చిత్రలేఖనము గోడలపయి చిత్రింపబడియున్నది.

విజయనగరమున జరుగు దసరా యుత్సవములకు "రమణీయమయిన మందిరములు, అయిదేసి అంతస్థులు ఎత్తు గలవి అనేక మందిరములు తాత్కాలికముగా నిర్మింపబడి యున్నవి. ఆ యంతస్థులయందు అత్యద్భుతములయిన, నానా విధరూపములతో సొంపుమీారి చిత్రములు, చిత్రపటములు

1. వేదకాలపు స్త్రీలు ౯౮ పే.

వ్రేలాడఁగట్టబడియున్నవి. ఆ చిత్తరువులలో పక్షులు, జంతువులు, మృగములు, మనుష్యులు, స్త్రీలు, మున్నగునవి యనేకములు చిత్రింపఁబడియున్నవి. ఇవి యన్నియు నత్యాశ్చర్య కరమైన కళాచాతుర్యముతో చిత్రింపబడిన చిత్తరువులుకాని యొండుకావు అని అబ్దుల్ రజాకు దెలుపుచున్నాఁడు. 1.

---

# వాయువిమానములు.

వెయ్యిమంది ప్రయాణము జేసిన కర్దముని విమానము.

సరస్వతీనదీ తీరమునఁగల బిందుసరోవరమునందు కర్దమ ప్రజాపతిని వసించుచుండెను. ఈ మునిచంద్రుఁడు దేవహూతిని పెండ్లియాడెను.

కర్దముని విమానయాత్ర:— "భార్యాసహితంబుగ దశకన్యాసహస్రంబు గొలువని జవిమానారూఢుండై"

(భాగ. తృ. ౮౨౦ వ.

మ॥ అమరోద్యాన వనప్రదేశములు సవ్యారామభూముల్ దళ।
త్కుము ధాంబోజ విభాసిమానస సరః కూలంబులున్ మంజుకుం।
జములుం జైత్రరథంబు విస్ఫురిత విస్రంభంబుసం జూచెనే।
య్యమునం గర్దమయోగిగామగ విమానారూఢుఁడై చెచ్చెరన్॥

(భాగ. తృ. ౮౨౩)

1. విదేశయాత్రికులు ప్రాచీనాంధ్రదేశము.

"ఇవ్విధంబున సమస్తభూభాగంబును వాయువేగంబునం గలయఁగ్రుమ్మరి నిఖిలవై మానికలోకంబు నతిశయించి లోకంబులం జరించె.........ఇట్లు కర్దముండు దేవహూతికి నిఖిల ధరాచక్రంబంతయుఁజూపి మరల నిజ నివాసంబునకుం జనుదెంచె".

## విమానఅలంకారము.

సీ॥ దివ్యమణిప్రభ దీప్తి జెన్నొందుచు
మరకత స్థలముల మహిమదనర
వరవజ్రకుడ్యకవాట శోభితములై
విద్రుమదేహళీ వీథులమర
గోమరొప్ప నవశాత కుంభకుంభములపై
హరినీల శకల విస్ఫురణ మెరయ
దగ బద్మరాగంపు మొగడల జెలువొందు
వైడూర్య వలభులు వన్నెజూప
తే॥ దరళతరధూత కేతు పతాకలమరి
మంజుశింజత్సమంచిత మధుపకలిత
సురుచిరాలంబమాన ప్రసూనరాజ
మాలికలనొప్పు వివిధ గృహాళిదనరి.

(భాగ. తృ. ౮౦౮.

క. మఱియును నానాలంచీనాం
బరకౌశేయాది వివిధపట పరివృత మం

దిర సుభగాకారంబై
యుదార విచిత్రపట్టి కాలంకృతమై.

భాగ. తృ. ౧౦౯.

మ॥ లలితోద్యాన వనాంతసంచరణ లీలారమ్యహంసాళి కో
కిల పారావత చక్రవాక శుక కేకివ్యూహ మంచత్సము
త్కలికం గృత్రిమపక్షులం నిజవిహంగశ్రేణియంచుం గుతూ
హలియై పల్కుచునాడుచుం బ్రతిశాఖారోహణవ్యాప్తులన్

(భా. గ. తృ. ౧౧౦)

క॥ ఘన సౌధాంతర శయ్యా
సన కేళీగేహకృతక జగతీధర శో
భన చంద్రకాంత చారుభ
వన ఫలభరితాననిజ సంతతములగుచున్॥

(భాగ. తృ. ౧౧౨)

ఆకాశగమన విమానములలో నిది చాలపెద్దది. ఇందు వెయ్యిమంది ప్రయాణము జేసియున్నారు. వీరు నివసించుటకు ప్రత్యేకశ్రేణులవలె కట్టడములు గలవు. పాంచాలికా యంత్ర సంబంధమగు వనముగలదు. అందు కృత్రిమపక్షులు మొదలగు నిర్మాణ మతీతకార్యము. ఈ పాంచాలికాయంత్రపు మాయ పక్షులు పలుకుట, భాషించుట, నడచుట, ఆడుట, పాడుట, ఎగురుట మొదలగు చర్యలు చూచువారలకు జీవము గలిగినట్లు ఉట్టిపడుచుండును.

## పుష్పక విమానము.

పుష్పకమను విమానము కుబేరునివద్ద కలదు. ఈవిమానమునకు కోట్లకొలది రూపాయలను వెచ్చించి విశ్వకర్మచే తయారుచేయించి యున్నారు. దీనియందు చిత్రములగు పనితనముగల గృహములు చాలగలవు. ఈగదుల కూటములన్నియు గోపురములతో కూడియున్నవి. ఈ విమానమంతయు బంగారు జాలరులతో చేయబడి యుండెను. జాలరులన్నియు రత్నములు మణులుతో చేయబడిన కీళ్ళతో సమర్పబడి యున్నవి. అందు చేత జనులు కొద్దిగా నున్నప్పుడు ముడుచుటకును, ఎక్కువగా నున్నప్పుడు పెద్దదిగా విప్పుటకును అనుకూలము గలిగి యున్నది. దీని నిండుగ అనేకవిధములగు జీవరాసుల ప్రతిమలు, పెద్ద శరీరములుగల మనుష్యులయొక్క యాకారములు గల ప్రతిమలు గలవు. ఈ ప్రతిమలన్నియు యంత్రనిర్మాణముతో నిండియున్నవి. ఇట్టిది ప్రపంచమునం దింతవర కెవ్వరును మరొకటి చేయించినవారు చేసినవారు గానరారు. ఇట్టి యద్వితీయకీర్తినిగాంచిన పుష్పకవిమానమును తయారు చేసిన విశ్వకర్మ లోకపూజ్యు డగుచున్నాడు.

“సతస్యమధ్యేం భవనస్య సంస్థితం
మహద్విమానం మణివజ్రచిత్రితమ్
ప్రతప్తజాంబూనద జాల కృత్రిమం
దదర్శ వీరః పవనాత్మజః కపిః

(రామా. సుం. స ౮. ౧)

ప్రకాశవంతమగు బంగారుతో జేసిన జాలరులు, వజ్రములు మణులతో చేయబడిన కీళ్లుగలిగి, చాలచిత్రముగా కూర్పబడి మిక్కిలి బలముగాయుండునట్లుల తయారుచేసిన పుష్పకమను విమానమును లంకలో రావణుని భవనమందు నొక గదిలోనుండగా హనుమంతుడు జూచెను.

"తదప్రమేయా ప్రతికార కృత్రిమం
కృతంస్వయం సాధ్వితి విశ్వకర్మణా
దివంగతం వాయుపథ ప్రతిష్ఠితం
వ్యరాజతాదిత్య పథస్య లక్ష్మవత్ ॥
(రామా. సుం. స ౮. ౨)

విశ్వకర్మ తనయొక్క గొప్ప పనితనమంతయు నుపయోగించి అపాయ మెట్టిసమయమందైనను వాటిల్లకుండునట్లుగా నుండునట్టి యంత్రనిర్మాణముతో తయారుచేసియున్నాడు. ఇట్టి నిర్మాణము నెవ్వరుగాని చేయలేనంత పనితనమునుగూడ జూపియుండెను. ఆకాశమున సంచరించు సూర్యునివలె ప్రకాశించుచున్న పుష్పక విమానమును భూమి కానకుండునట్లు గదియందుంచబడెను.

"నతత్రకించిన్నకృతం ప్రయత్నతో
నతత్రకించిన్న మహార్హరత్నవత్
నతేవిశేషాని యతాస్సు రేష్వపి
నతత్రకించిన్నమహావిశేషవత్ ॥
(రామా. సుం. స ౮. 3)

పుష్పకవిమానముయొక్క ప్రతిభాగమును చాల ప్రయత్నముతో చేయబడియున్నది. కీళ్లకుపయోగించిన రత్నములన్నియు మహారత్నములేగాని సామాన్యమైనవిగావు. (సమ్మెట పెట్లకు విచ్ఛేదముగాని రత్నము మహారత్నమగుచున్నది.) ఈ విమానముయొక్క ప్రతిభాగము నందును చూపరుల కాశ్చర్యము కలిగింపని పార్శ్వము గానరాదు. ఇంత గొప్ప పనితనము గల విమానము దేవతలయం దెవ్వరికిని లేదు.

"తపస్సమాధాన పరాక్రమార్జితం
మనస్సమాధాన విచార చారిణమ్
అనేక సంస్థాన విశేషనిర్మితం
తత స్తతస్తుల్య విశేషదర్శనమ్"

(రామా. సుం. స ౮. ౪)

చాల పనితనముతో అనేక గదులు గలిగి, ప్రతి గదియు సమానమైన పనితనముతో గూడిన పుష్పక విమానమును రావణుడు పట్టుదలతో జయించి యుండెను. మనస్సునం దెచ్చటకైన వెళ్లవలెనని తలంచి ఈ విమాన ప్రయాణముజేసి నట్టులయిన స్థలభేదము లేక వెంటనే చేరుచుండును.

" మనస్సమాధాయతు శీఘ్రగామి నం
సురావరం మారుతతుల్య గామినమ్
మహాత్మనాం పుణ్యకృతాంమహర్ధినాం
యశస్వినామగ్ర్యము దామివాలయమ్ "

రామా. సుం. స ౮. ౫.

అడ్డగింపులేని ప్రయాణము చేయగలిగినట్టిన్ని, ఎంత త్వరితముగా నడపుటకైన సందేహములేక గాలితో సమానముగ ప్రయాణముచేయునట్టిన్ని, సంపదగలవారు, పుణ్యాశీలురు, ఆనందపరులు, కీర్తివంతులు, మహాత్ములుండదగిన స్వర్గమువలెయున్న పుష్పకవిమానమును హనుమంతుడుగాంచెను.

"విశేషమాలాం బ్యవిశేషసంస్థితం
విచిత్రకూటం బహుకూటమండితమ్
మనోభిరామం శరదిందు నిర్మలం
విచిత్రకూటం శిఖరంగిరేర్యథా"

రామా. సుం. స. ౮. ౬.

విచిత్రనిర్మాణముగల గదులు చాల నిర్మింపబడియుండి గదులకూటమునందు కొండశిఖరములవంటి గోపురములను నిర్మించియుండిన పుష్పకవిమానము శరత్కాలమునందు నిండు చందురునివలె ప్రకాశించుచున్నది.

"మహాంతియం కుండల శోభితాననా
మహాశనావ్యోమచరా నిశాచరాః
వివృత్తవిధ్వస్త విశాలలోచనాః
మహాజనాభూతగణాస్సహస్రశః"॥

(రామా. సుం. స. ౮. ౭)

కుండలములతో నొప్పుచున్న ముఖంబులును, గొప్ప శరీరములును, గుండ్రములైన పెద్దకండ్లును గల వేలకొలది ప్రాణికోట్లు పైపోయుచు వేగముగా గొంపోవుచున్నట్లు పుష్పకమును నిర్మింపబడియున్నది.

"వసంతపుష్పోత్కర చారుదర్శనం
వసంతమాసాదపి కాంతదర్శనమ్
సపుష్పకం తత్ర విమానముత్తమం
దదర్శ తద్వానర వీరసత్తమః॥"

(రామా. సుం. సవ. ౮౮)

వసంత ఋతువగుటం జేసి సుందరంబులైన పూలుగల ప్రదేశములకన్న అధికముగా గన్పట్టుచున్న పుష్పకవిమానమును హనుమంతుడు లంకయందు చూచెను.

## సౌంభకవిమానము

మహావీరుండగు సాళ్వుడు శ్రీకృష్ణునితో యుద్ధము చేయుటకుగాను సౌంభకంబను విమానమును మయుండను గొప్ప శిల్పకళా ప్రవీణునిచే తయారు చేయించెను. ఈ విమాన సహాయముతో ద్వారకపై సాళ్వుడు దండయాత్ర సలిపి యిరువదియేడు దినంబులు యుద్ధము జేసి యుండెను.

సీ॥ ఒకమాటు నభమున బ్రకటంబుగాదోచు
నొకమాటు ధరణిపై నొయ్యనిలుచు
నొకమాటు శైల మస్తకమున వర్తించు
నొకసరి చరియించును దధినమున
నొక్కటోయంబున నొక్కటియైయుండు
నొక్కడ గనుగొను బెక్కులగును
నొకమాటు సాల్వసంయుక్తమై పొడసూపు
నొగతోయ మన్నియు నుడిగితోచు

ఆ॥ నొక్కతేప కొంలవియుడుగక త్రిప్పిన
గతిమహోగ్రవృత్తి గానవచ్చు
మరియు బెక్కుగతుల నరినరుల్ గలగంగ
దిరిగె సౌంభకంబు దీవరేణ్య
(భాగ. దశ. ఉత్త. భా ౮౬.౭)

సౌంభకవిమానము ఆకాశమునందేగాక భూమియం దును కొండలయందును ప్రయాణము చేయగలిగియున్నది. ఒక్కొక్కప్పుడు పెక్కు విమానములుగాను మరొక్కప్పుడు అగ్నివలెను గాన్పించును. కానరాకుండ ఆకాశమున లీనమై యుండుటయు గలదు. రధికు (సాళ్వుడు) డెక్కడయున్నది వాయురధమున గానవచ్చుచుండును. మరొకప్పుడు రధికుడు లేనట్టులుండును. ఇన్నివిధములైన చిత్రములుగా తయారుచేసిన మహాశిల్పియగు మయునియందెంత పరిపూర్ణపారిశ్రామిక కళా విజ్ఞానముగలదో ఎవ్వరికి నూహించుట కసాధ్యమేగదా? ఇట్టి ప్రాచీన పారిశ్రామిక విజ్ఞాన కళాపరిపూర్ణ శిల్పులు దేశీయ పరిశ్రమల కాదర్శకులగుటయేగాక పూజ్యులగుచున్నారు.

భోజుని కాలపువిమానములు

భారతయుద్ధ కాలమునాటి వరకు భారతపల్లిముల వాయువిమానముల యుత్పత్తి పలుకీతుల వృద్ధిపొందియుండెను. యుద్ధానంతరము సంపూర్ణముగా నీరసించి పోయెను. ౧౧ శ॥ పండిత పోషకుండని పేరు వడసిన భోజరాజు పారిశ్రామిక కళాశిల్పులను గూడ చేరదీసి పూజించి పోషించి యుండెను. భోజుని యాదరణవలన నీరశించిన యంత్రపరిశ్రమ మొలకలెత్తి

వికసించెను. భారత యుద్ధములో నీరసించిన వాయురథము లను గూడ భోజరాజు పునరుద్ధరించి యుండెను. అందు మూడు విమానములను పూర్తి చేయించి వెలువరించెను. ఒకటి ఒకమనిషి ప్రయాణము చేయగలిగినది. ఇందు సామాన్య మైన యంత్రము గలదు. రెండింటి నగ్ని పాదరసములతో నడిపి యుండిరి. ఆకాలమున పెట్రోలునకు బదులు పాదరసమును వాడుచున్నట్లు తెలియుచున్నది.

ఒకమనిషి ప్రయాణము జేయు విమానము.

శ్లో॥ తద్రూపాఖ్యః పూరుష స్తస్య పక్షౌ
ద్వంద్వోచ్చాల ప్రోద్యతేనానిలేన
సుప్తస్యాంతః పారదస్యాస్య శక్త్యా
చిత్రం కుర్వన్నంబరే యాతిదూరం॥

(సమరాంగణ సూత్రధార. ౧ వా)

ఈ విమానమునందు కూర్చున్నవానియొక్క బలము చేత దాని రెండు రెక్కలను యధికముగా కదలించుట వలన గలిగిన గాలితో ఆకాశమునందు దూరముగా పోవుచున్నది. ఈ విమానపు శక్తి సప్తసముద్రముల కావలియొడ్డుకయినా చేరగలదని యాశ్చర్యము గలుగ చేయుచున్నది.

కొయ్య విమానము.

శ్లో, లఘుదారుమయం । మహావిహంగం
దృఢసుశ్లిష్టతనుం । విధాయితస్య
ఉదరే రసయంత్ర । మాదధీత
జ్వలనాధారంమధో । స్యాగ్నిపూర్ణం॥

(సమరాంగణ సూత్రధార. ౧ వా)

ఈ విమానము తేలికకొయ్య పలకలను నొకదానిలో నొకటి మిక్కిలిబలముగానుండునట్లుల చేర్చి కూర్చబడి తయారు చేసియున్నారు. దీని గర్భస్థానమున పాదరసముతో అగ్ని కూర్చిన యంత్రము గలదు. ఆ యంత్రమువలన గలుగు వేడి చేత ప్రయాణము చేయుచున్నది.

సురమందిరమువంటి విమానము.

శ్లో॥ ఇత్థమేవ సురమందిరతుల్యం
సంచలత్వ లఘుదారువిమానం
ఆదధీత విధినా చతురంతః
తస్యపార్శ్వగ భృశాన్ దృఢకుంభాన్॥

శ్లో॥ అయః కపాలాహిత మందవహ్ని
ప్రతప్త తత్కుంభభువా గుణేన
వ్యోమ్నోజఘీత్యాభరణ త్వమేతి।

(సమరాంగణ సూత్రధారి. ౧ వా)

ఈవిమానముగూడ పైవిమానమురీత్యా కొయ్యపలకలను చేర్చి శాస్త్రానుసారముగ దేవాలయ గర్భగుడివలె చతురముగా నుండునట్లుల కూర్చబడియున్నది. దీని ప్రక్కలందినుముతో చేయబడిన కుండలనుబెట్టి దానిలో పాదరసము పోసి కుండలపై ఇనుప మూతలనుబెట్టి నిప్పు కొద్దిగా యుంచుటచేత మిక్కిలిగా కాగి మరగును. శ్రేష్ఠమైన పాదరసము మరగుటచేత కలిగిన ఆవిరివలన గొప్ప శబ్దమేర్పడి ఆకాశమున పోవుచున్నది. అట్లాకాశమున పోవుట ఆకాశమునకే యలంకారము గలుగుచున్నది.

ఇవ్విధముగా భోజరాజుచేత పునరుద్ధరింపబడిన ఆకాశ గమన రథముల పరిశ్రమ భోజుని యనంతరము పోషకులులేక పూర్తిగ నశించి రానురాను యీకళ కల్పనకథగా **మారి** పోయినది.

ప్రాచీన హిందువులు సమస్త శాస్త్రములలోను పారంగతులైరనుటకు వారి సంగరశాస్త్రములో నొక నిదర్శనము గలదు. వారి యాకాశయుద్ధములు ప్రశంసనీయములు, అద్భుతములు. వారు "ఆకాశమును సంచారార్థ ముపయోగించు కొనెడివారు. ఆకాశములో యుద్ధములు చేసెడివారు. కాబట్టి విమానవిద్య కగత్యమైన సర్వశాస్త్రములును వారికి దెలిసి యుండెనని యూహింపవలయును. వాతావరణమంతయు నొకతీరుగనుండక పోనుపోను అంతస్థులంతస్థులుగ వివిధస్వభావములు గల్గియుండుననియు, వాయుతరంగములగూర్చియు, వివిధ వాయుపదార్థములవేడిమి, తడి, బరువు, తారతమ్యగరిమ మున్నగు ధర్మములును వారికిదప్పక తెలిసియుండవలెను." 1. అని కర్నల్ ఆల్కాట్‌గారు అల్లాహాబాదులో ౧౮౮౧ సం॥లో యొసంగిన ఉపన్యాసమునందు నుడివియున్నాడు.(ఈయుపన్యాసము ౧౮౮౧ సం॥ మార్చి నెలలో దివ్యజ్ఞానసమాజమువారి సంచికలో వెలువరింపబడి యుండెను.)

# ౫. ఉక్కు — ఇనుము.

---

ఉక్కు, ఇనుప పరిశ్రమలు భారతదేశమునందు వేద కాలము నాటికే ప్రసిద్ధిగలిగి యుండెను. సోముడను రాజు విశ్వకర్మచేత అక్షయబాణములు, గాండీవము, చక్రము, గద మొదలగు వాటిని మేలయిన ఉక్కుతో తయారుచేయించి అనేక యుద్ధములయం దుపయోగించి జయమును గాంచెను. సోముని తరువాత ఈ యాయుధము లన్నియు వరుణదేవుని వద్ద చేరియుండెను. వరుణదేవు డీ యాయుధముల సహాయముతో అనేక ప్రశస్త యుద్ధములు జేసి గెలుపొందెను. ఈ యాయుధము లన్నియు భారతకాలము నాటిదనుక వరుణ వంశీయులు భద్రపరచి యుండిరి. ఖాండవ వనదహన సందర్భమున అగ్నిదేవుడు వీటిని వరుణ వంశీయుల వద్దనుండి కృష్ణార్జునుల కిప్పించి యుండెను.

గాం డీ వ ము.

క. ఘనభుజ యిది గాండీవం
బన బరగిన ధనువు దీని శస్త్రావళిచే
ల్చన తాకి భగ్నమగు న
త్యనుపమ వజ్రాభిహత శిలాసమితి వోలెన్.
(భార. ఆది. ఆశ్వా. ౨౨౯ ప)

గాండీవమతి శ్రేష్ఠతరమగు యుక్కుతో చేయబడి యున్నందున ఎంతవాడిగల అంబయినను గాండీవము నేమియు

చేయజాలకపోయినది. మరియు గాండీవమును తాకిన యం బులన్నియు మొక్కవోయి యుపయుక్తముగాక భగ్నమగు చుండెను.

## చక్రము.

క॥ ఈ చక్రము మధుసూదన
నీచేత విముక్తమగుచు నీ రిపుల ద్రియా
మా చరులజంపి క్రమ్మఱ
నీచేతికి నచ్చు దేవ నిర్మితశక్తిన్॥

ఓ కృష్ణా! ఈ చక్రము దేవశిల్పిచే తయారుచేయబడి నది. దీని చేతాళము చాల కళాకౌశలముతో గూడియున్నది. ఈ చక్రమును నీ వైరులమీద విడిచినప్పుడు వారిని సంహ రించి తిరిగి నీ యొద్దకు రాగలదు. ఈ శక్తి నిర్మించిన శిల్పి యొక్క చతురత్వమై యున్నది.

"ఆగ్నేయాస్త్రములను, నా స్వప్నములుపయోగించు బూమెరాం గును (చక్రమును) బూమెరకు నిది యసాధ్యమని భావించెడి వారని" విల్సను పండితుడు చెప్పుచున్నాడు 1.

వేదకాలమునాడు సోమదేవుడు దేవశిల్పిచే తయారు చేయించిన ఉక్కు యుద్ధసామానులు భారతయుద్ధమువర కుపయోగపడిన కారణముచేత ఈ వస్తువుల కుపయోగించిన యుక్కులోని శ్రేష్ఠత్వము, శిల్పియొక్క కళానైపుణ్యము మిక్కిలి ప్రాశస్త్యమైనదని వేరుగ తెలుపనక్కర లేదు.

---

1. హిందువుల అధికృతి.

భారతదేశపు లోహపరిశ్రమలనుగూర్చి విల్సన్ పండితుడిట్లు వ్రాసెను. "ఇనుము పోతపోయువిద్య పరిశ్రమలే ప్రధాన వృత్తిగాగల మన యీ యింగ్లండుదేశములో గడచిన, కొలది యేండ్లనుండి మాత్రమే యనుష్ఠింపబడుచున్నది. హిందువులు ఇనుమును గరగించుట, కాచి ముక్కలతుకుట, ఉక్కు చేయుట ఈ విద్యల ననాదినుండియు నెరుగుదురు. 1.

విద్వాంసుడగు రాయిగా రిట్లనుచున్నారు. "ఉక్కును గాల్చి చల్లార్చి పదును చేయుటలో భారతీయులు మిక్కిలి నిపుణులని యెన్నికగనిరి. ఉక్కునుచేయు రహస్యము పారసీకులు భరతఖండమునుండి గ్రహించిరి. వీరిద్వారా అరబ్బులు నేర్చుకొనిరి. కుతుబుదగ్గరనున్నట్టి ౧౫౦౦ యేండ్లనాటి పది టన్నుల యెత్తుగల చేత యినుప స్తంభము, జగన్నాధములోని పెద్ద యినుపదూలము, సోమనాధములోని చిత్రపు పనిగల ద్వారములును; నూర్వారులోని ౨౪ అడుగుల పొడవుగల చేత యినుప ఫిరంగియును, వెనుక నొకప్పుడుండి ఇపుడు లేని విద్యకు స్మారకచిహ్నములు. హిందువులు లోహశోధనములో నత్యద్భుతమయిన నైపుణ్యమును గడించిరనుట కివి నిశ్శబ్దములయ్యు, దిశలుమ్రోయు ప్రమాణములు పలుకుచున్నవి." 2.

కుతుబు స్తంభమునుగూర్చి ఫెర్గుసన్ గారిట్లు వ్రాయుచున్నారు. ౧౪౦౦ ఏండ్లు ఎండకెండి వానకు తడిసి తుప్పుపట్టకుండుటయు శిఖరభాగమును అక్షరములును స్పష్టముగ యొక్కింతయు మొక్కవోవక ౧౪౦౦ యేండ్లనాడెట్లుండెనో

1. 2. హిందువుల అధిక్యత ౧౬౮ పే.

నేటికి నట్లుండుటయు విచిత్రముగనున్నది. ఇది యచ్చముగ గలితీలేని యినుమనుటకు సందేహములేదు. దీనిలో నొక తునకను జనరల్ కనింఘాము ఈదేశములో విద్వాంసుడగు మర్టేచేత బృథక్కరణము చేయించెను. మరియొకతునక నిక్కడ గనులపాఠశాలలో విద్వాంసుడగు "పెర్సి" పృథక్కరించెను. ఉభయులును ఇదియెట్టి మిశ్రమములేని స్వచ్ఛమయిన ఘన వర్ధనీయమయిన యినుమని నిర్ధారణపరచిరి. 1.

పద్మినీమానసంరక్షణార్థమయి మేవాడు దుర్గపు నాయకులు స్త్రీవేషధారులయి మేనాలెక్కి అల్లాయుద్దీను సైన్యము ప్రవేశించినపుడు ఒడ్డాణములుగా ధరించిన పట్టాకత్తులయుక్క చాలశ్రేష్టమగుటయేగాక తయారుచేసిన పనివారల గొప్పతనమునుగూడ ఆశ్చర్యకరమగుచున్నది. ఈ కత్తులు వేడుక కొఱకుగాక ప్రచండ వైరులతో బోరుట కుపయోగింపబడి యుండెను.

క్రీ. శ. ౧౦ శ: వరకు ఖడ్గములకు యుక్క భారత దేశమునుండి ప్రపంచమంతట కెగుమతి యగుచుండెను. 2. భారతదేశమునందు తయారగుచుండిన నాటు ఉక్కుతో కొఱ ముట్లుచేయు డమాస్కసు లోకప్రసిద్ధి గాంచియుండెను. 3. ఇంగ్లాండులోయున్న జేమ్సునదియందుగల ట్యూబిలార్ బ్రిడ్జి నిర్మించుటకుగాను ఇండియాయందు తయారుచేసిన చేతాలపు ఉక్కు ఇనుము వాడబడియుండెను. 4.

1. హిందువుల ఆధిక్యత ౫౭౧ పే. 2. భారతవస్త్రపరిశ్రమల చరిత్రము ౫ పే. 3. 4. మెద్రాసు అడ్మినిస్ట్రేషన్ రిపోర్టు ౧౫౭౬ సం॥

విశాఖపట్టణం జిల్లా వీరవల్లి తాలూకా కత్తుల కోడూరునందు ప్రాచీనకాలమునుండి శిల్పులు కత్తులు, పట్టా కత్తులు, అంబులు, ఈటెలు మొదలగునవి నిర్మించుటలో చాల విఖ్యాతివడసి యున్నారు. పేరెన్నికగల వీరబొబ్బిలి యుద్ధమునందు వీరిచే నిర్మింపబడిన కత్తులు ప్రఖ్యాతిగా వాడబడి యుండెను.

చేంబర్సు ఎన్సైక్లోపీడియాలో హిందువుల చేతిపనులను గూర్చి పొగడుచు "విచిత్రాకారములును, ప్రశస్తమయిన గట్టితనమును గల ఖడ్గములు తయారగుచుండెనని వ్రాయబడియున్నది. 1. హిందువుల ఖడ్గములు జగతిలోనెల్ల శ్రేష్ఠములని టెసియస్, మార్కు్సు పెంకర్ గార్లు తెలుపుచున్నారు. 2. ప్రాచీన కాలమునందు పారసీకులలో నొక జాతీయోక్తి గలదు. "భారతీయఖడ్గముతో దెగవేయుదును—భారతీయ సమాధానమిత్తును." భారతీయఖడ్గధారులను లోకమంతట ప్రసిద్ధినడసియున్నారు. "సమీపబంధువులు పెట్టుహింసలు హిందూఖడ్గపాణిచేయు గాయములకంటె గఠినతరముల"ని సబామొ అలకాయనుపేరుగాంచిన యరబ్బి పద్యకావ్యములోనున్నది 1.

క్రీ. శ. ౧౮౫౧, ౧౮౬౨ సంలలో జరిగిన సర్వజాతీయ ప్రదర్శనములందు హిందువుల యాయుధములను ప్రదర్శింపబడెను. వానినిగూర్చి ఇట్లు నుడివినారు. "భరతఖండము నుండి వచ్చిన రత్నఖచితాయుధములు సుందరములేయయి

1. హిందువుల ఆధిక్యత ౫౭౮. ౪౮౮.

నప్పటికిని, ఆసాగసులకంటె వానిచేతలో నుపయోగించిన యుక్కుపటిమను గురించి మిక్కిలి గొప్పగ శ్లాఘించిరి. 1.

ఉక్కుకొలిమూట్లకు బంగారుపాదుగుట.

థక్కర్ హైద్రాబాదు నగరమునందున్న వస్తుప్రదర్శన శాలలోని ప్రదర్శనవస్తువులలో ప్రాచీనకాలమునాటి యుక్కుతో చేయబడిన కత్తులు, అంబులు, డాళ్లు, కవచములు, కిరీటములు మొదలగు యుద్ధ పనికరములు పలువిధములుగా తయారుజేసినవి గలవు. ఈ యాయుధములపై కుందనపు బంగారుతో లతలు, పక్షులు, మృగములు, ఆకులు, పువ్వులు మొదలగు అలంకారములెన్నియో చెక్కబడియున్నవి. ఇక్కడ గల ఖడ్గములలో కొన్నింటికి బంగారు, దంతములతో మిక్కిలి యలంకారములు గల పిళ్ళుగలవు.

అతిప్రాచీనకాలమునుండి భారతదేశమున పేరు ప్రతిష్టలతో విఖ్యాతిగాంచిన గృహాపరిశ్రమలలో ప్రఖ్యాతివంతంబగు యుక్కుయుత్పత్తి, యుక్కుకొలిమూట్లనిర్మాణము, వీరాధివీరుల కనువగు యాయుధ, కవచ, కిరీటములు రాజాధిరాజుల సంపదకు తగినరీతిగా సృష్టించుచున్నట్టి ప్రాచీనభారతయుక్కు శిల్పులను నేటికాలపు ప్రదర్శనశాలలలోని యాయుధములు స్ఫురణకు దెచ్చుచున్నవి.

ప్రాచీనకాలపు భారతీయులు యుక్కు నెక్కువగా యుద్ధ పనికరములకొఱకు తయారుచేయుచుండెడివారు. వారి యుద్ధపనికరము లయిదువిధములుగా నుండెను.

---

1. హిందువుల అధికృత.

౧. యంత్రయుక్తములు (యంత్రాదిసాధనలచే ఉపయోగింపబడునవి) శతఘ్నులు, సహస్రఘాతి, శతసహస్రఘాతి, బ్రశ్భి కాలి, న్యాలత మొదలగునవి.

౨. హస్తయుక్తములు (చేతితో ఉపయోగింపబడునవి) చక్రము, ఆగ్నేయాస్త్రము మొదలగునవి.

3. ముక్తాముక్తములు (ఉపయోగించుటకు ఉపయోగించుటకు వనుకూలములయినవి.) ఈటెలు, త్రిశూలములు మొదలైనవి.

౪ ఉపయోగింపబడనివి—ఖడ్గములు, గదలు మొదలగునవి.

౫. పిడికిలియందుండు యాయుధములు.

ఇందు మొదటివి ఫిరంగులనాటివి, రెండవదానిలోని చక్రమునే విష్ణుచక్రమని పిలతురు. శ్రేష్ఠమయిన యుక్కుతో గుండ్రముగా కొలతప్రకారము చేయబడును. మొన మిక్కిలి వాడిగలిగి చుట్టును గూడియుండును. దీనిని విసరుటకు చక్కని నేర్పుగలిగి యుండవలెను. చక్కని నేర్పుగలవారు విసరినప్పుడు కడుదూరమేగి కార్యమును సాధించి వెనుకకు మరలి విసరినచోటికి వచ్చి చేరుచుండును. ఇట్టి ప్రావీణ్య కళా కౌశలము భారతదేశమున ప్రాచీనకాలమునుండి గానవచ్చుచునే యున్నది.

"తవ్‌శీర్ అజీజ:

తేగెహిందీవఖుంజ రేరుమీానకు నద।

ఆంకే ఇనాన్సజారకునద॥

హిందూఖడ్గముకంటెను తుర్కికత్తికంటెను ప్రియుని.

విరహము దుస్సహము 1.

ప్రాచీన భారతదేశమునగల యుక్కుపరిశ్రమశిల్పులీ వస్తువులను తయారుచేయుటలో గొప్ప శక్తిగలిగియున్నారు. కొన్ని యంబులుగూడ గురి తప్పినయెడల తిరిగి బయలుదేరిన చోటుకి చేరుచుండును. అక్షయబాణము లనుపేర కొన్ని గలవు. అవి విడచిన కార్యమును సాఫల్యముగావించి వచ్చి చేరుచుండును. వీటిని నిర్మించుటలో శిల్పి తన బుద్ధికుశలత్వమును బహుచక్కగ ఉపయోగించుచుండును.

"యంత్రాగారస్తనీమృద్ధాం॥ (రామా. సుం. స. 3. ౧౮.

బలిష్ఠములయిన యంత్రములుండు గృహములు లంకయందు గలవు. ఈ యంత్రములు శతఘ్నులు మొదలయినవిగా యున్నవి.

## ఔర్వాగ్ని.

ఏడువేల సంగల క్రింద సాగరాధిపత్యము వహించిన సార్వభౌముడగు సగరుడు ఔర్వుని శిష్యుడయి యుండెను. ఔర్వుడు భృగువంశసంజాతుడగుటచేత భార్గవగోత్రీకుడయి యున్నాడు.

తాళజంఘులులను హయహయులను జంపుటకు మార్గము లేక ఔర్వుడు సముద్రమునందుగల బడబానలమును గొని వచ్చి యంబులయందు నింపి సగరునిచేత హయహయులను జంపించెను. వైరులనుజంపు కోపముతో తొలుదొత్త బడబా

1 హిందువుల అధిక్యత ౪౮౮ పేజీ

పోయెడివాడు. శత్రువు గదిసినపు డా ఋషులు తుపానులను ఉఱుములను గల్పించి వెడల గొట్టుచురు. ఆ తుపానులు సాక్షాత్తు ఆకసమునుండి పుట్టినట్లే యుండును. ఐగుప్తీయులగు హెర్క్యులీసు బైకసు లేకమై యొక్కమారుగ వారిపై దలపడి యంత్రసాధనములచే నెట్లయిన నాశ్రమముల స్వాధీనపఱచు కొనఁ జూచిరి. శత్రువులు పయిబడ నుంకించు దనుక ఋషు లెట్టి జోక్యములేని వారువలె మిన్నక చూచుచుండిరి. వారు గదియగనే పైనుండి యుఱుము లుఱిమి యగ్నిజ్వాలలలో సుడిగాడ్పులు లేచి సర్వనాశము గావించెను. 1.

ఆధునిక ప్రకృతిశాస్త్రజ్ఞులకు అస్త్రవిద్యలో నణుమాత్రమైనఁ దెలియదు. అస్త్రప్రయోగములెరిగినవారు శత్రుసైన్యముల నంతటి నొక్కమాఱుగ బరిమార్ప జాలెడివారు. విషవాయువుల గల్పించి వానిలో భయంకరస్వరూపములు ధ్వనులు గలుగునట్లొనర్చి శత్రుసేనలను చుట్టవేసెడివారు. శత్రువులు దానిలో బూర్ణముగ నాశనముగా వలసినదె." అని కర్నల్ అల్కాటుగారు వ్రాయుచున్నారు. 2.

భారతీయప్రభుత్వమువారికి విదేశాంగమంత్రిగ నుండిన ఎచ్. ఎచ్. ఎలియటుగారు ౧౮౪౫ సం॥లో ప్రాచీనకాలమున నీ దేశమున నగ్న్యస్త్రముల యుపయోగమును గుఱించి చర్చించి యిట్లనెను. "మొత్తముమీద పూర్వకాలము హిందూదేశమందేదో యొకవిధమైన యగ్న్యస్త్రములు వాడుకలో నుండెననియు, ఱువ్విన గోళాదులు ప్రేలెడివనియు; వానిని

1. హిందువుల ఆధిక్యత ౪౯-౫౦ పే. 2. హిందువుల ఆధిక్యత ౫౦౧

ఇచ్చవచ్చినప్పుడు ఇచ్చవచ్చినరీతిని వెల్గింప వీలుగనుండెడి దనియు; ప్రక్షేపనీయాస్త్రములను ద్వారములకు గట్టడములకు దగిల్చి కొంతదవ్వునుండి యంత్రసాధనములచే వానికి నిప్పంటించెడివారనియు; మనము నిర్ధారణ చేయవచ్చును. మరియు, తుపాకిమందుయొక్క స్వాభావికధర్మమునకు సురేకారము మూలమగుటచే నందులోచేరు ద్రవ్యములలో నిది ప్రధానమైనది. ఇది గంగానది ప్రవహించు ప్రదేశములో స్వభావికముగా సిద్ధమై విస్తారముగ లభించును.........గంధకము వాయువ్యప్రాంతమున సమృద్ధిగ లభించునదిగాన, నదియు నందులో చేర్చియుండవచ్చును. 1.

## ౬. విద్యుచ్ఛస్త్రము.

సీ॥ ఒకచోట సాలభంజికఁ గీలుపన్నఁగ
ముద్దెంపు సొగసుగా స్త్రీ పరిఢవించు
గుహ్యగర్భాగారగూఢమై యొకచోట
నలనాక నొక్క సద్మాక్షి పలుకు
నొకచోట జలయంత్రయుక్తి సలిలపూరాలు
మొగులుగా చల్లి చిన్నముసురుగురియు
నొకచోట బగలు చంద్రికలుగా యమరించు
జంద్రకాంతోపల స్తంభవితతి
శృం. నై. అ. ౬. వి. నా. ౧౪౯.

1. హిందువుల ఆధిక్యత ౮౯౫

సలుగని విహారసౌధమునందొక చోట కీలువత్తగనే అందమైన బొమ్మకులుకులతో చిరుత నృత్యమాడుచుండెను. మరొక చోట గోడలో చక్కని కంఠధ్వనితో నొక స్త్రీరత్నము పాడుచున్నట్లుండెను. (ఈ బొమ్మలను పుత్తళికలనిగూడ బిలతురు.) వేరొక చోట జలయంత్రముచేత మేఘమువలన చిన్న ముసురు పట్టి సన్నవర్షము కురియుచుండెను. ఇంకొక చోట పగలు చంద్రకాంతరాళ్ళతో నిర్మించిన కంబములవలన వెన్నెల గాయుచుండెను.

సీ॥ ఒకకీల మార్చిన నున్న దీపంబులు
 నప్పుడె తమకు దా మాఱుటయును
వాయుస్ఫురితానిల చేలాంచలాదిక
 వ్యాపారముల దీపమాఱమియును
నాటిన కీలంబు లప్రయత్నంబున
 మణిమూసె జూడంగ మండుటయును
మండి దీపాళియు నాటి మండినదీపంబు
 వెలుగు శిఖలయు గావించుటయును
తే॥ గలుగునట్టుల వివిధ శక్తి కలుగ రాజ
 శిల్పముల సత్పటాలను జేయుచుండె
వినుతి కుతుకప్రసాధ్యభాతాతిక భార
 సంకటమ్మాయినై సార్వభౌమికమయ్యె.
 శ్రీ. నై. స. ప. విహా. ఆ ౭ ౧౬౬-౫ ప

సలుగు విమయాంతితో విహరించు ప్రదేశములం దాశ్చర్యకరమగు దీపప్రదర్శనములుగావించెను. ఈ ప్రదర్శనశాలను

నిర్మించిన మహాశిల్పివిద్యుచ్ఛాస్త్రమునం దెంత శక్తి గలిగి యుండెనోగాని ? ఒక దీపమార్చిన నున్న దీపములన్ని యారు చుండెను. విసరు గట్టతోగాని, వస్త్రముతోగాని విసరి యార్ప జూచిన ఆరకుండుటయు, కొన్నిదీపములారుటయు యప్ర యత్నముగ వెలుగుచుండుటయు గలదు. కొన్నిచోట్ల దీపము లన్ని యారుట వెలుగుట గలిగియున్నందున చీకటి వెలుతురు వచ్చుచుండెను. ఇవన్నియుజూచిన దమయంతి చిత్తభ్రాంతి గలిగినదాయెను.

యవనులు విద్యుచ్ఛాస్త్రజ్ఞానమును భారతీయుల యొద్దనుండి గ్రహించిరి. "థేల్సు" అను యవనబుధుడు భరతఖండ ములో సంచారముచేయుచుండినపుడు, అంబరు (తృణమణి) పట్టుమీద రుద్దినపుడు తేలిక వస్తువుల నాకర్షించు గుణముబ్బు నని నేర్చుకొనెను. 1.

ప్రాచీనకాలపు హిందువులు విద్యుచ్ఛాస్త్రమును లోహచుంబక శాస్త్రమును సర్వసర్వత్ర అభ్యసించి యుండు టయే గాక గాఢముగ కృషి సలిపి విస్తారముగ వృద్ధిచేసిరి. మెరుపు వర్షములో నుండి వచ్చునని వేదాంతి యెరుగును. ఊా ఇటే ప్రభృతులుచేసిన సుప్రసిద్ధ ప్రయోగములవలన దీనిని నిరూపించుట సులభము. 2.

కాంత, విద్యుచ్ఛాస్త్ర సిద్ధాంతములపై నాధారపడి యున్నట్టి కాలక్రమానుగతములయిన యాచారములు

1. 2. హిందువుల అధికృత. ౫౭౫ పే.

మఱికొన్ని గలవు. ఉదాహరణమునకు—౧. దేవాలయము లన్నింటికి శిఖరముపై నినుపకడ్డీలుగాని, రాగికడ్డీలుగాని గ్రుచ్చుదురు. ౨. బంగారు, వెండి, యినుము, వీనితోఁజేయ బడిన తాయత్తుగొట్టములు వ్యాధిపీడితాంగములకు గట్టుదురు. 3. పట్టు, ఉన్ని, దర్భలు, గడ్డి, బొచ్చూడని లేడి పులిచర్మ ములు ప్రార్థనాదిక సమయములం దాసనములకై యుపయో గింతురు. ఈ యాచారముల తాత్పర్యమేమో విద్యుచ్ఛాస్త్ర సిద్ధాంతముల పరిచయము గలవారికి తెలియును. 'హిందూ దేవాలయ శిఖరములపయినుండు త్రిశూలము (ఇనుపది) ఆధు నికులు పిడుగుపాటునుండి కాపుదలసేయుట కుపయోగించు చున్న విద్యుద్వాహకమునంటిదేయని వారెఱుగుదురు. ఉన్ని యాసనములను చర్మాసనముల నుపయోగించువారికి అశని పాతసమయమున బ్రహ్మాఘాతభయములేదు. వారికి భూమితో సంసర్గము లేకుండ నడుమను అవిద్యుద్వాహక మున్నదికదా. 1

## ౭. గరుడుం డమృతము దెచ్చుట.

అగ్నియంత్రము.

………గరుడుం డమృతస్థానమున కరిగి దానిం బరివేష్టించి ఘోరసమీరప్రేరితంబై దుర్వారశిఖాజిహ్వల నంబరంబు నాస్వాదించుచున్న యనలంబుంగని తత్క్షణంబ.

(భార. ఆ. ద్వి. ౧౦౧. వ.)

1. హిందువుల అధిక్యత ౫౩౧ పే.

వనరక్షకులు పార్థుసు నిశితాస్త్ర
ధారల పగతదర్పులై యరిగిరి
యమసదనంబున కమిత బలులు
ఆ॥ శిఖియును ప్రదీర్ఘ జిహ్వలుసాచి యు
ద్ధురస మీరణంబుతో డుసేసి
కొనియుగాంతకాలకు పితానలాకారు
డయ్యెఖాండవమున కద్భుతముగ॥

భార. ఆ. అ. ౨౩౧ ప

చ॥ జ్వలనశిఖాళియుఁ విజయుసద్విశిఖాళియు జుట్టుముట్టి సం
దలరిభయాకులంబులగు తద్వనజీవుల యార్తనాద మం
దులియుచు నొక్కపెట్టదివి నుద్గతమయ్యెన మందమందరా
చలపరివర్తన ప్రసభసంక్షుభితార్ణవ ఘోషఘోరమై॥

భార. ఆ. అ. ౨౩3 ప

బ్రతికిన వారార్గురు.

తే॥ మయుడు నశ్వసేనుండును మందపాల
సుతులు నలుగురు శార్ఙకుల తులదాన
దాహభీతి కయ్యార్వురు దప్పిరన్య
జీవులెల్ల సందపగత జీవులైరి।

భార. ఆ. అ. ౨౬౧ ప.

“అన్నలువురుశార్ఙకులు నున్న వృక్షంబు భక్షింపక పరిహరించిన”

భార. ఆ. అ. 3౧౨ వ.

మ య ుడు.

"అట్టి యవసరంబున నముచి యను దనుజు ననుజుండు మయుండనువాఁడు ఖాండవంబు వెలువడ నేరక తక్షకు గృహంబున బరిభ్రమించుచున్నంత దన్నగ్నిచుట్టుముట్టిన నచ్యుతుండును జంపవచ్చిన నతిభీయుండయి యర్జును మఱువు సొచ్చిన."

క॥ శరణాగతరక్షణ తత్పరుడు
ధనంజయుడు మయుని ప్రాణముగాచెం
గరుణను శరణాగతులను
పురుషుల రక్షించుకంటె బుణ్యముగలదే॥

భార. ఆ. అ. ౨౮౯-౨౯౦.

ఇవ్విధంబుగా మయుం డర్జునుని రక్షణవేడి మరుగుసొచ్చి బ్రతికెను.

అశ్వసేనుడు.

"వెండియు నశ్వసేను నేయ సమకట్టిన యప్పారునకు తక్షణంబ మోహిని యను మాయ గావించి యమరేంద్రు డశ్వసేను విడిపించె." (భార. ఆ. అ. ౨౭౪)

పదార్థ మొకచోటబెట్టి దాని చాయను యదార్థమైన వస్తువుగా జూపు కార్యమునకు మోహిని మాయయనం బడును. అశ్వసేనుడు ఇంద్రుని సహాయముచేత అర్జునునకు తన చాయ జూపి మోసగించి తప్పించుకొని పోయెను.

### మందపాలసుతులు.

శార్ఙకవంశీయులు ప్రాచీనకాలమునుండి శిల్పమునందు గొప్ప కళాకౌశలము గలిగి యున్నారు. వీరి వంశీయులలో నొక మహాశిల్పి విష్ణుదేవునకు ధనువును జేసి యివ్వ దానిని శార్ఙకమని పిలువబడుచుండెను. భారత కాలమునందు గల మందపాలుని పుత్రులగు జరితారి, సారిసృక్కుడు, వస్తంబుడు, మిత్రద్రోణుడు, యను నల్వురు శార్ఙకవంశీయులయియున్నారు. వీరు ఖాండవవనమున నివసించుచుండిరి. ఖాండవ వన దహన సందర్భమున వీరొక చెట్టుక్రింద యుండి యాచెట్టు ద్వారా వాయు ప్రయోగమును జేసి చెట్టుతోసహా వీరు నలువురు అగ్ని వాతబడక తప్పించుకొనియుండిరి.

క॥ జ్వలనంబు వాయువశమున
దొలగుడు... ... ... (భార. ఆ. అ. ౩౦౯ ప.)

---

## ౬. అగ్నితో నడచిన యశ్వము.

---

ఉదంకుడను విద్యార్థి గురుని భార్యకొఱకు పౌష్య మహారాజు భార్య నడిగి కుండలములు దెచ్చుచు దారి మధ్యమున నందొక జలాశయమున శుచి ప్రదేశమునుంచి యాచమనము జేయుచుండ నాగు డొకడు కుండలముల దొంగిలించి నిజదేశంబున కేగ వెంటనే యుదంకుడు గూడ చని నాదేశపాలకునికి విన్నవించెను. నా రాజొక యశ్వ

మొసంగి నగర మధ్యమున నీయశ్వకర్ణరంధ్రధ్మానంబు సేయు
మనిన నట్లొనర్ప

శా॥ పాతాళైకనికేతనాంతరమునం బర్వొందదశ్వాఖిల
స్రోతోమార్గవినిర్గతోగ్ర దహనార్చుల్ పన్నగవ్రాతముల్
భీతిల్లెన్ భుజగాధినాథుమనము భేదిల్లెఁగల్పాంత సం
జాతప్రోద్ధతబాడబానల శిఖాశంకాధికాతంకమై॥

భార. ఆ. ప్ర. ౧౧౧ ప.

"ఇట్లు నాగలోకంబున కెల్ల మహాక్షోభంబు" గావించి తక్షకుచేత కుండలంబులుగొని యుదంకుఁడాత్మ గతంబున నేఁగె.

భార. ఆ. ప్ర. ౧౧౩ వ

సీ॥ కుండలమ్ములు వేగకొనిరమ్మ నాలవ
నాఁటికిని పూని నన్ను బనిచె
గురుపత్ని నేఁడె యక్కుండలంబులు దొఱఁగ
దినసమీపదివస మతిక్రమించె
కుండలంబులు పోక యెల్లొ పెగూపు నిన్నాఁగ
భవనముసొచ్చుట వెల్వడఁబోలు
నేమొకో ననినాఁడు నిష్ఫలం బమ్మహా
యత్నమంతయు నని యధికచింత

ఆ॥ దవిలియున్న యయ్యుదంకు నభిప్రాయ
మెఱిఁగి దివ్యపురుషుఁ డిట్టులనియె
నీహయంబు నెక్కి యేఁగుమయి దివడి
గలను మనసుకంటె గాడ్పుకంటె।

భార. ఆ. ప్ర. ౧౧౪. ప.

"అనవుడు నద్దివ్యపురుషు వచనంబున నత్తురంగంబు నెక్కి తత్క్షణం బయయ్యుదంకుండు గురు గృహంబునకు వచ్చె. నట గురుపత్నియు శుచిస్నాతయై నూతన పరిధాన శోభితయై బ్రాహ్మణులం బూజించి నిజ సంకల్పిత మాహాత్మ్యవం బొనరించె నట్లు గురుకార్యంబు నిర్వహించిన యుదంకుంజూచి గురుం డిట్లనియె.

భార. ఆ. ప్ర. ౧౧౭ వ

సీ॥

ఆ। అత్తురంగమగ్ని యప్పురుషుండు ప
ర్జన్యు డింద్రసఖుడు సమ్మునీంద్ర।

ఉదంకుడు పాతాళము (ఉత్తరమెరికా) నుండి ఆర్యావర్తమున కొక్కనాటి ప్రయాణము జేసిన యశ్వం బగ్నితో చేయబడియుండెను. ఈ హయము పర్జన్యుడను రాజువద్ద యుండుటచేత ఈ రాజుకాలమునం దగ్నితోగూడిన యంత్ర పరిశ్రమ యున్నటుల తేటపడుచున్నది. నన్నయవంటి మహాకవి "అత్తురంగమగ్ని" ఆతురంగ మగ్నితోచేయుబడినదని రచించుటనుబట్టిగూడ సందియము తీరుచున్నది.

భోజరాజుకాలమునాటి కీలుగుఱ్ఱము.

"ఘటైక యాక్రోశ దశైక మశ్వః ।
సుకృత్రిమోగచ్ఛతి చారుగత్యా॥ 1.

(భోజప్రబంధము)

---

1. సత్యార్థప్రకాశము ఏ. ము. ౨౦ పే.

భోజరాజు లలితకళలనేగాక శిల్పమును మహాశిల్పమునుగూడ పోషించుచుండెను. ఒక మహాశిల్పి అశ్వమును బోలియుండిన యంత్రయానమొకటి నిర్మించి భోజునివద్దకు దెచ్చియుండెను. అది ఒకగడియలో ౧౧ కోసులనగా గంటకు ౫౫ మైళ్ళదూరము బోవుచుండెను.

### యంత్ర నిర్మితంబైన వీవెన.

"వాయుందదాతి వ్యజనం సుపుష్కలం
వినా మనుష్యేణచలత్యజస్రం॥ 1.
(భోజప్రబంధము)

ప్రసిద్ధిగల శిల్పియొకడు యంత్రకళాయుక్తమగు నొక వీవెనను జేసియుండెను. అది మనుష్యుని సహాయములేకయే తనంతటదానే విసరుచు కావలసినంత గాలినిచ్చుచుండెను.

### పాంచాలికా యంత్రము.

విజయనగరమునందు జరుగు దసరా యుత్సవములకు నిర్మించు తాత్కాలికపు మందిరములలో కొన్ని పాంచాలికా యంత్ర నిర్మితములుగలవు. అవియూరక యప్పుడప్పుడు ప్రదక్షిణము జేయుచుండును. అవి యొక్కొక్క ప్రదక్షిణమందు ఒక్కొక్క వింత రూపమును దాల్చుచునుండును. మరియు ప్రతి క్షణమందును ఆ మందిరములు క్రొత్తక్రొత్త శృంగారములతో మనోహరముగ గన్పట్టుచుండును. ఒకమారు చూచి తనివి నొందుటకు వీలులేని యందములు, వింతలు వర్ణింప నలవిగాని శృంగారములు ఆ ప్రదేశమందెచ్చట చూచినను

1. సత్యార్థప్రకాశము ఏ. ము. ౨౦ పే.

గాన వచ్చుచుండెనని. 1. క్రీ. శ. ౧౪౪౩ సం॥రలో విజయ నగరమునందు చూచిన వృత్తాంతమును అబ్దుల్ రజాకు వ్రాసి యుండెను.

# ౧౦. రత్న పరిశ్రమ.

హిందూదేశమునందు రత్నపరిశ్రమ అతి ప్రాచీనకాలము నుండి విరాజిల్లుచుండెను. "రత్నగర్భతల్లి" యను నామము భారతదేశమునకు సార్థకనామముగా పరిగణించినది. ప్రస్తుత కాలమునందు ప్రపంచవిఖ్యాతిగాంచిన మణులు రెండు. ఒకటి ౧౪౦౦౦౦ సవర్ను క్రయముగల కోహినూరు, రెండవది ౪౮౧౦౦౦ సవర్ను క్రయముగల పిట్టు. ఈమణులు భారత దేశమున జన్మించియున్నవి. ముత్యములు, పగడములు, వజ్రములు, కెంపులు, గరుడపచ్చలు, వైఢూర్యములు, గోమేధికములు, నీలములు, భారతదేశమున యెక్కువగా యుత్పత్తియగుచుండెను. నీలములు రెండువిధములు. ఇంద్రనీలములు, మహానీలములు. మహానీలములు సింహళమునందు మాత్రము దొరకుచుండును. 2. భారతసముద్రము పగడములకుగూడ చాల ప్రసిద్ధిగలిగియున్నది. పగడములు సముద్రమునందు జన్మించుచుండును. సముద్రమున జన్మించిన ప్రతివస్తువు యందును ఏదో

1. విదేశయాత్రికులు ప్రాచీనాంధ్రదేశము. ౧౨౬ పే. 2. రామాయణము సుందరాకాండ. స౯. ౧౬

యొకవిధమగు విద్యుచ్ఛక్తి ఏర్పడియుండుటగలదు. పగడము లలోగూడ మానవజాతి కాపాదించు కొన్ని విషవాయువులను హరింప శక్తి గలిగియున్నది. అందుచేతనే పగడములను దండలుగా కట్టించి మెడయందు ధరించు వాడుకగలదు. పెద్దపెద్ద పగడపుతీగలను తెచ్చి చక్కగ తరివెనబట్టించి మంచపుకోళ్లుగా రాజకుటుంబములలో వాడుచుందురు. సోపానములందుగూడ అమర్చువాడుకగలదు.

ముత్యములుగూడ సముద్రమున పుట్టుచున్నవి. వీటి యందు శరీరమున కాపాదించిన విషమును హరించు గుణము గలదు. "బాణుడు రచించిన హర్షవిజయమునందు నాగార్జుని నద్ద "మందాకిని" యను ముత్యాలహార మున్నటుల తెలిపి యుండెను. ఈ హారము సర్వవిషసంహారిణియైయున్నది. దీని స్పర్శచే సర్వజంతు కోటికి సమస్తమగు బాధలు నివారణ మగుచుండెను." 1.

భారతీయులు రత్నములవలన నలంకారమేగాక ఆరోగ్యము గూడ కనుగొని యున్నారు. అందుచేతనే రత్నముల విలువ చాల ఎక్కువగా యుండును. పూర్వకాల మందొకప్పుడు సత్రాజిత్తు సూర్యునితో చెలిమిజేయ నాతడు తన మెడనున్న శమంతకమణిని కానుకగా నిచ్చెను. ఆమణిని సత్రాజిత్తు మెడయందు ధరించి ద్వారకయందుగల శ్రీకృష్ణుని జూడవచ్చినప్పుడది సూర్యునివలె ప్రకాశించుచుండెను. 2.

1. విదేశ యాత్రికులు, ప్రాచీనార్యధదేశము యువాన్ చ్యాంగ్ ౫౦

2. భాగవతము దశమస్కంధము.

క॥ ఏరాజేలెడు వసుమతి
నారత్నము పూజ్యమానమగు నక్కడ రో
గారిష్ట సర్వమాయిక
మారీ దుర్భిక్ష భయములు మాను నరేంద్రా॥

(భాగ. దశ. ౫౨)

శమంతకమణిని పీడారోగములు దాపరించిన దేశములందుగల రాజులు తమదేశములయందు ప్రదర్శింపజేసి ప్రజల నందరిని రావించి దర్శనముచేయుట కవకాశము చేయుచుండురు. అందుచేత ఆయాప్రాంతములగల అంటువ్యాధులన్నియు నశించుచుండును. ప్రదర్శనకాలములందు వచ్చుప్రజల కాతిథ్యమిచ్చి సర్వవిధముల పూజించుటకుగాను ప్రతిదినము నెనిమిది బారువుల బంగారు రాకార్యమునకు వెచ్చమగుచుండెను. (ఆ కాలమునందు బంగారు వెండి తూకములద్వారా మారకపుధరలు నిర్ణయింప బడుచుండెను.)

భీమరాజు నలునకు సర్పవిషము సోకకుండుటకు గరుడపచ్చతో చేయబడిన భోజనపాత్రయొకటి కానుకగానిచ్చెను.

మ॥ పవనాహార విషంబుసోకదు ... ...
నవగారుత్మత భుక్తిపాత్రయొసగె న్రాజాత్మజాభర్తకున్॥

(శృంగార నైషధం)

క్రీ. శ. ౧౪౩౫ సం॥లో శ్రీనాథుడు విక్రమ రత్నముల చరిత్రనుగూర్చి వ్రాయుచు నిట్లు నుడివెను.

తే॥ క్రాలు నెనిమిది తురగులడాలు గలిగి
సకల దుర్మంత్రయంత్ర హృజ్జఠరశోక

ఘనత రోన్మాదమూర్ఛా వికారపైత్య
హరణకారమగు శుద్ధమరకతంబు

దృష్టిదోషములు, గర్భబాధలు, చపలత్వము, మూర్ఛ పైత్యవికారములను మరకతమను గరుడ పచ్చ పోగొట్ట గలిగి యున్నది.

"రత్నములు చానపట్టుటలో భారతీయుల కతి ప్రాచీన కాలమునుండి తెలియునని జేమ్సుమిల్లు చెలుపుచున్నాడు." 1.

గీ॥ మలచి యేకాండముగ నొక మానికమున్.
వెక్క నెద్దాని నిర్మించె విశ్వకర్మ
యట్టి దేవేంద్ర దత్తమహార్ఘ్య నూత్న
పీటికాపేటి మామభూవిభున కొసగె

(శృంగారనైషధం)

మిక్కిలి విలువగల మాణిక్యము (కెంపు) ను దేవలోకపురాజు విశ్వకర్మచేత ఏకాండముగా, తాంబూలపు పెట్టెగా, తరివెసపట్టించి భీమరాజున కొసంగెను. అల్లుడయిన నలుని కాపెట్టెను భీమరాజొసంగెను.

విద్వాంసుడగు రాయ్‌గారు వ్రాయుచు "వజ్రమునకు వేడి లేకుండ ప్రకాశించు గుణముగలదని ప్రప్రథమున క్రీ. శ. ౧౬౬౩ స॥లో సుప్రసిద్ధుడయిన రాబర్టు బాయిల్ కనిపెట్టె నని తెలిపియుండెను." "క్రీ. శ. ౧౧వ శతాబ్దమువాడగు భోజు డీవిషయము నుదాహరించి యుండెను." 2.

---

1. హిందువుల అధికృత. 2. హిందువుల అధిక్యము ౬౭౬.

మార్కో-పోలో యను వెన్నిసుదేశపు యాత్రికుడు రచించిన చరిత్రయందు పాండ్యదేశము ముత్తెపుచిప్పల వేట యందును ఆంధ్రదేశము రత్నాలవేటయందును చాల ప్రసిద్ధి గలిగి యున్నవని చెలిపియుండెను. ఆంధ్రదేశమునం దమరావతీ సమీపమున కృష్ణ కావలియొడ్డునందు పరిటాలయను రత్నాల కొండల ప్రదేశమును మార్కో-పోలో గాంచియుండెను. దీనిని మనవారు వజ్రాల దిన్నెయని బిలచుచున్నారు. ఇక్కడ జరుగుచున్న రత్నాల వేటను పూసగ్రుచ్చినట్లుల మార్కో-పోలో వర్ణించియున్నాడు.

వజ్రాల దిన్నెయందు నేటవాలుగానున్న ఎత్తైన పర్వతపంక్తులు చాలగలవు. వర్షపాతమిచ్చట విశేషముగ నుండును. వర్షములు కురిసినప్పుడు కొండలమీదనుండి నీరు త్రుళ్ళింత లిడుచు వాకలవలె వడిగా క్రిందికి ప్రవహించును. వర్షములు వెలిసిన తరువాత నావాక లెండి పోవును. అంతట జనులు ఆ యేటిగర్భములందు ఇసుకలో గులకరాళ్ళయందు వజ్రములకై వెదకుదురు. అప్పుడు వారికి రత్నములు విరివిగా లభించుచుండును. తరుచుగా వేసవి కాలమందు వజ్రములు లభించుచుండును. కాని గ్రీష్మతాపము నకు వెరచి జనులు కొండలలోనికి బోరు. అచ్చట త్రాగుటకు గ్రుక్కెడు నీరుకూడ లభించదు. అదియునుగాక యక్కడ భయంకరమైన విషసర్పములు అసంఖ్యాకములుగ నుండును. సర్పములేగాదు; క్రూరజంతువు లనేకములుగూడ గలవు. వాటి యునికికి భరింపరాని యుష్ణము కారణము. వజ్రములపై నాస

గొని జనియు విషసర్పముల కాటులకు మరణించిన వారెం దరోగలరు.

ఈ కొండలనడుమ పెద్ద పెద్దలోయలున్నవి. ఏటవాలుగ నుండుటచేతను, నాలుగు ప్రక్కలను ఎత్తైన కొండలుండుట చేతను ఈలోయలలోనికి మార్గములులేవు. వజ్రములకై వెడలునపుడు సన్నగా కోసిన మాంసపు ముక్కలను తీసుకొని పోయి జనులాకొండ లోయలందు పారవేయుచుందురు. అచ్చట నివసించు పాములను బక్షించుటకై గరుడ పక్షులాప్రాంతము లందు విశేషముగానున్నవి. అవి సర్పములకొఱకై ఆకాశము మీద నెగురుచున్నపుడుమాంసపుముక్కలు విసరబడుటగాంచి, వాటికై లోయల యడుగు భాగమునకు హుటాహుటి దిగు చుండును. రాళ్ళనడుమ చిక్కుకున్న మాంసపుముక్కలను వాటికి గ్రుచ్చుకున్న రాళ్ళతోసయితము గ్రద్దలు తన్నుకొని పోవుచు, నే కొండకొననో నే చెట్టుమీదనో గూటిలో పిల్లల యాహారమునకై పెట్టుచుండును. గ్రద్దలు వ్రాలుటచూచి, జనులు రాళ్ళుగ్రుచ్చుకొనిన మాంసపుముక్కలకై ఆ పక్షు లను తరిమివేసి యా మాంసపు ముక్కలను దెచ్చుకొందురు. అందు తఱచుగా నితర రాళ్ళతోపాటు వజ్రములుగూడ నుండును. ఆ కొండలోయల యడుగున వజ్రములట్లు కుప్ప తిప్పలుగా బడియుండుట నిజముగా నాశ్చర్యకరమయిన విష యము. కాని కొండలలోనికి వజ్రములకై ప్రాణములపై నాశ వీడి యెవడును చనజాలడు. అచ్చటి సర్పములు మనుష్యులను సయితము మ్రింగివేయగలవు. వజ్రములకై జనులు అప్పుడ

ప్పుడు గ్రద్దల గూండ్లకడకేగి వాటి రెట్టలను వెదకి యందు రత్నములను గాంచుటయుగూడ గలదు. మాంసపు ముక్కలతోపాటు అందుచిక్కుకొనిన రాళ్ళనుగూడ పక్షులుమ్రింగి రాళ్ళను జీర్ణముచేసుకొనలేక రెట్టలతో కలిపి విడుచును. ఒకప్పు డీపక్షులను పట్టుకొని జనులు రత్నములకై పొట్టచీల్చి చంపుదురు. వాటిలోగూడ వజ్రములు లభించుటయు గలదు.

పెద్దవజ్రములు ముటఫలి (మోటుపల్లి) సీమయందు తప్ప నింకెక్కడను లభింపవు. మన పాశ్చాత్యదేశములకు గొని రాబడునవి అచ్చటివారు మంచి వాటిని యేరుకొనగా మిగిలిన రెండవరకపు సరకులని నమ్ముదు. అచ్చటి రాజులు, శ్రీమంతులును మేలయినవాటిని తామే ఉపయోగించుకొందురు. 1

“హిందువులు రత్నములను మణులను కోసి దీప్తినొసగునట్లు వానికి మెరుగుదేగలరని మిల్లు యిండియా యను చరిత్రను రచించుచు దానియందు వ్రాసియున్నాడు.” 2

బనగానిపల్లి ఎస్టేటులోని నిలువగళ్ళ, నిచ్చెనమెట్లు అను గ్రామములందును అనంతపురంజిల్లా వజ్రకరూరులోను వజ్రపు గనులు నేటికిని గానవచ్చుచున్నవి.

1. వజ్రాలదిన్నె చరిత్ర “విదేశయాత్రికులు, ప్రాచీనాంధ్రదేశము అను గ్రంథమునుండి గైకొనబడినది. 2. హిందువుల ఆధిక్యత ౫౭౬ పే.

# ౧౧. స్పటికపు పరిశ్రమ.

స్పటికములతోఁగూడ కట్టడములు, పాత్రసామానులు, అలంకారపు సామానులు, కంటియద్దములు, మొదలగు వాటిని నిర్మించుచుండెడివారు.

"స్ఫాటికాంతరపాంసుభిః" (రామా. సుం. స 3-౧౦. లంకలో చతుశ్శాలల మధ్య భాగమున స్పటికపు కట్టడములమర్చి దాని మధ్యలో తెల్లని ఇసుకపోసియుండిన ప్రదేశములను హనుమంతుడు చూచియుండెను.

"స్ఫాటికైరావృతతలాందం తాంతరతరూపికాం"

(రామా. సుం. స ౯-౨౩)

రాజభవనమున స్పటికములచే కప్పబడిన భూమియందు దంతపు శిల్పమును పొదగబడియుండగా హనుమంతుడు లంకయందు గాంచెను.

"భాజనైస్స్ఫాటికైరపి" (రామా. సుం. స ౧౧-౨౨)

రావణునింట స్ఫటికపు పాత్రలను హనుమంతుడు చూచెను.

"స్పటిక దీప్తిజాలపరివృతంబైన జలాశయంబు స్థలంబుగావగచి"

(భార. సభా. ద్వి. ౮౬ వ.)

మయసభయందు స్పటికపు కట్టడములు గల కొలనులందున్న "జలంబు స్థలంబుగా" కానుపించుచుండెను.

స్పటికపుకాంతులు జలములను కానరాకుండునంత ప్రకాశమానముగా నుండును.

భట్టిప్రోలునందుగల బౌద్ధస్తూపమును త్రవ్వగా బుద్ధుని దంతమునుంచిన స్ఫటికపు భరిణెలుమూడుగానుపించియుండెను. వాటిని మదరాసు చిత్రప్రదర్శనశాలయందు ప్రదర్శింపబడి యున్నవి. ఈ స్ఫటికపు భరిణెలు చాల సొగసుగ లాలిత్య లావణ్యములతో ముద్దులొలుకుచున్నవి.

బొంబాయి మ్యూజియమునందు స్ఫటికపు పిడినమర్చిన ఖడ్గమొకటి విరాజిల్లుచున్నది.

ధార్వాడదగ్గర గడు విలువగల స్ఫటిక శిలాశ్రేణులు సమృద్ధిగాగలవు. 1. అమరావతియందు వాసిరెడ్డివారు ప్రతిష్ఠించిన లింగమూర్తి స్ఫటిక నిర్మితము. ఇది చాల పెద్దదిగూడ నైయున్నది. తంజావూరు ప్రాంతమున ఇప్పటికిని స్ఫటికపు కంటియద్దములు తయారగుచునేయున్నవి. మదరాసు రాజధానియందు నగలలో సానలుదీర్చిన స్ఫటికపు రాళ్ళు విరివిగా వాడుచున్నారు. స్ఫటికములను సానలుదీర్చుటలో మద్రాసు రాజధాని చాల ప్రసిద్ధికెక్కియున్నది.

## ౧౨. చంద్రకాంత లేక చలువరాళ్లు.

చంద్రకాంత రాళ్ళలో గొప్ప విశేషముగలదు. వెన్నెలలో గల చంద్రుని వెలుగునందున్న ఆనంద మీరాళ్ళయందు గాననగును. నిండు కొలనులోగల నీటిగాంభీర్య మీ రాళ్ళ

1. హిందువుల ఆధిక్యత ౬౨౫ పే..

యందు జూపట్టుచుండును. ఈరాళ్ళయందు చాల యందమగు పలు రంగులుగూడ యుండును.

మయసభ నిర్మించుట కుపయోగించిన రాళ్ళలో సూర్యకాంత (స్ఫటికము) చంద్రకాంత (చలువ)రాళ్ళు ముఖ్యమైనవి. కవాటములుండియు లేనట్లును, కవాటములు లేని చోట ఉన్నట్లును నుండవలెనని శిల్పి సూర్యకాంత చంద్ర కాంతరాళ్ళ నుపయోగించియుండెను. కొలనుయున్న చోట నీరుకానరానట్లుండుటకు సూర్యకాంతరాళ్లను, నీరులేనిచోట కొలనుయున్నటుల చూపుటకు చంద్రకాంతరాళ్లను నుపయోగింపబడియుండెను.

ప్రాచీనకాలమునాటి భారతీయులకును, భారతీయ శిల్పులకును, ప్రతి శిలయందుగల గుణములు తెలిసిన వారగుట చేతను, ఆనాటి భారతదేశము భాగ్యవంతమైన దగుటచేతను ప్రాచీన కట్టడములందు సూర్యచంద్రకాంతరాళ్లనే గాక నవరత్నములు పగడములు మొదలగు విలువగల పదార్థములుపయోగించుచుండెడివారు. ఆనాటికట్టడముల చరిత్రలు దరిద్రనారాయణ సేవ చేయుచున్న ఈనాటి భారతీయులకు కట్టుకథలుగా యుండుటాశ్చర్యము గాదు.

## తాజ్‌మహాల్.

క్రీ. శ. ౧౬౩౦ సం॥లో షాజహాను చక్రవర్తి తాజ్ మహాలును చలువరాతితో ఆగ్రాయందు కట్టించియుండెను. ఇయ్యది యిరువది రెండువేల పనివారలతో ఇరువది వత్సరములపాటు కోట్లకొలది రూపాయలు వెచ్చించి పూర్తిచేయబడి

యుండెను. నగిషీపనిని, రత్నములపనియు, చూపరులకు దిగ్భ్రమ గొలుపుచు భారతీయుల పూర్వ శిల్ప చాతుర్యము నకు ఆశ్చర్యమును నవీన దుస్థితికి విచారమును ఒక్కమారే గలిగించును. ప్రపంచమంతటలో నిట్టికట్టడముతో సమాన మయినది నేటికిని గాన్పించకున్నది. ప్రపంచమందలి అన్ని భాగములనుండి దీనిని తిలకించుటకు ప్రజలు వచ్చుచుందురు.

హైదరాబాదునందుగల ప్రదర్శన శాలలో చంద్రకాంత రాయితో చేయబడిన "టీ" త్రాగు చిన్న పళ్లెరముగలదు. బొంబై మూజియమునందు మొదటి యంతస్తులో చంద్రకాంత రాళ్ళతో తయారుచేసిన జైన విగ్రహములు కొన్ని గలవు. ఈ విగ్రహములు మిక్కిలి పనితనముతో నిండు జీవమును వెదజల్లుచున్నవి. వీనిని నిర్మించిన శిల్పుల భావ ప్రపంచము లోని కళా విజ్ఞానచతురతయెట్టిదోగాని; శాంతశమదమాది భక్తి మార్గములను లోకైకేశ్వరునియందు మూర్తీభవించు సౌలక్షణములతో విరాజిల్లు మహాభక్తుండగు జైనుని యానంద లీలాతరంగభావ ప్రపంచమంతయు ఈవిగ్రహములం దీశిల్పులు కనులకద్దినట్టు లాయన సర్వతేజోవికాసములను విమర్శగ గానవచ్చునట్టుల సృష్టించియున్నారు. ఇందుగల యంత్రరాళ నిర్మితములు, ఉనికి, ఠీవి, సొగసు మొదలగు భావములు ముద్దులమూటగట్టుచున్నవి.

ఉత్తర హిందూస్థానమందలి ప్రాచీన నగరమని విఖ్యాతి గాంచిన కనోజునగరమునందును, త్రిలింగదేశమునందలి ప్రాచీన కాలమునుండి పేరు గాంచిన ఘంటసాలయందును చంద్రకాంత

శిలా నిర్మిత స్థూపములు, భవనములు, దేవాలయము లనేకములు గలవు. యవి యన్నియు నేడు గనుపింపకపోయినను కొన్ని సంపూర్ణ శిధిలావస్థయందు భూమిలో పాతుకొని యున్నట్లుల స్పష్టమగుచున్నది. హిందూదేశము నందనేక ప్రాంతములలో చలువరాళ్ళ గనులు కొండలు గలిగి యున్నవి.

## ౧౩. దంతపు పరిశ్రమ.

"దంతకాంచనరాజితైః ... ... ... రథైః"

(రామా. సుం. స ౬౬)

వెండి, బంగారు, దంతములతో నిర్మించిన రథములు లంకయందు గలవు.

"మణికాంచన రచితగజదంతమయ శిబికాసనంబులు"

(భార. ఆది.)

ధర్మరాజు రాయసూయ యాగమునందు బంగారు, దంతము, రత్నములతో తయారుచేయబడిన పాలకీలు కానుకలుగా వచ్చి యుండెను.

"దంతపుగద్దె" (హంసవింశతి. తృ. ఆ. ౫౨ ప)

దంతముతో చేయబడిన ఎత్తయినపీట.

బొంబైమ్యూజియము రెండో యంతస్తు రెండవ గదిలో గల ప్రాచీన వస్తురాజములలో షుమారు మూడడుగుల పొడవు గలిగి ఏకదంత నిర్మితంబగు మయూరముగలదు. దీనియంద

మపారము. నిందుకళాకౌశలముతో చైతన్యమును పొందు చున్న నిజమయూరమువలె నిర్మింపబడియున్నది. గాని శ్వేత రూపము దాల్చి యున్నందున ఏ దేశమునుండి తెప్పింపబడెనో యని యాశ్చర్యమును గూర్చుచున్నది.

ప్రపంచమునకెల్ల దంతపు పరిశ్రమ ప్రాచీనకాలము నుండి భారతదేశమునందు మాత్రము గలిగియుండెను. అతి ప్రాచీన నాగరిక దేశములగు బాబిలోనియా, పాలస్థీను, పరిష్యా మొదలగు విదేశములలోని సంపన్నులు భారతదేశము నందు తయారగుచుండిన దంతపు శిల్పవస్తువులను, ఆభరణము లను మితిలేని ధనమిచ్చికొని వాడుకొనుచు ఆనందించుచుండెడి వారు. "హిందూదేశమున దంతపు వస్తువులుజేయు విద్య యత్యంత పరిపూర్ణ స్థితికి వచ్చియుండెనని హీరెన్ పండితుడు దెలుపుచున్నాడు." 1.

క్రీస్తు పుట్టుటకు పదిశతాబ్దముల మును ఇశ్రాయేలు రాజగు సాలమోను, టైరురాజగు హీరామును భారతఖండ మున కోడలునంపి సింధూనది మొగ్గనగల అభీరియా దేశమున వెండి, బంగారు, రత్నములు, నెమళ్లు, చందనపు చెక్కలతో పాటు దంతములుగూడ తెప్పించుకొని యున్నారు. 2.

ఐగుప్తునకు దొలుత గజదంతములతో బరిచయము గలిగించినది భారత వర్షమని స్ట్రాబో దెలుపుచున్నాడు. 3.

భారతదేశమునగల అంగళ్ళలో ఏనుగు దంతములు విరివిగా నమ్ముటగలదు. యవనులు రోమీయులు భారత

---

1. 2. 3. హిందువుల ఆధిక్యత. ౧౮౦ పే.

దేశమునుండి దంతములను తెప్పించుకొనుచుండెడివారు. హ్యూయానుడు దంతములు విరివిగా నుపయోగమందుండినట్లు గూడ వ్రాసినాడు. 1.

## ౧౪. మట్టిపరిశ్రమ.

భారతదేశమునందు పలువిధములగు మట్టితో అనేక విధములయిన పరిశ్రమ లుత్పత్తి యగుచుండెను. నేడీ పరిశ్రమను పలురీతుల పునరుద్ధరింపవలసియున్నది.

తెల్లసుద్దమట్టి, నల్లజిగురుమట్టి, చవిటిమట్టి, పాలవంటి తెల్లమట్టి, ముగ్గుఇసుక, బూడిదవర్ణముగలమట్టి, సీమసున్నమువంటిమట్టి, వంద్రుమట్టి, ఎర్రమట్టి, చందనమువంటి రంగుగల మట్టి, ఆకుపచ్చనిమట్టి, మొదలగు రీతులుగల మట్టిజాతులు గలవు.

ఆయా మట్టివిశేషమువల్ల కుండలు, పింగాణీలు, గాజులు, సబ్బులు, అద్దములు, సుద్దమూసలు, ఇటుక, పెంకు, నిప్పుఇటుక, జాడీలు, ఎర్రపెంకు, నీటితూములు, బొమ్మలు, తంతివార్తలకు సామానులు, రంగులద్దుటకును, భవనములకు రంగులెక్కించుటకును, నూలు, బట్టలు, మరబియ్యమునకు రంగువేయుటకు నుపయోగింపబడుచున్నవి.

మరియు మట్టిని యనేకములగు పాళ్లతో జిగురును హెచ్చించి గట్టిని సమకూర్చి కోటల్లు, మేడల్లు, చిత్రము

1. హిందువుల ఆధిక్యత. ౧౮౦ పే.

లయిన అలంకారపు వస్తువులు నిర్మించుచుండెడివారు. భోజ రాజుకాలమునందు పదియంతస్తుల రాజభవనములు మట్టితో నిర్మించినట్లుల తెలుపబడియున్నవి. 1. తూర్పు గోదావరి జిల్లా మండపేటలో కరణాల వీధియందు వీధికి మొదటి దగు మేడమట్టితో నిర్మింపబడియున్నది. ఈ భవన మిప్పటికిని సహజ గాంభీర్యముతో కానవచ్చుచున్నది. మరియు ఇట్టి మట్టి మేడలు తెలుగు దేశమున పలుచోట్ల కానవచ్చుచునేయున్నవి.

మిక్కిలి గట్టిపరచిన మట్టితో కోటగోడలుకట్టుటలో గూడ భారతీయు లెక్కువప్రజ్ఞ గలిగియున్నారు. గుంటూరు జిల్లా నర్సారావుపేటలోని మట్టి కోటను చూచినవారికి ప్రాచీన భారతదేశమున ప్రసిద్ధిగాంచిన మట్టి పరిశ్రమలోని గొప్పతనము సులభముగా తేటపడగలదు.

నిజామురాష్ట్రములోగల ముఖ్యనగరములందన్నిటి యందును కోటలుగలవు. అందు నూరింటికి తొంబది మట్టి కోటలుగలవు. ఆ కోటలలో కొన్నింటికి రాగంబలి మొదలగు పదార్థములను మట్టిలోచేర్చి ఎనుబోతులచేతను, ఏనుగుల చేతను త్రొక్కించి గోడలు పెట్టుటచేత ఇనుప గోడలవలె స్థిరమైయున్నవి.

"చమత్కారమైనకుండలు, జాడీలు, పాత్రలు, అహ మదాబాదు, చూనార్, అమ్రకోట, ఆర్కాటు, మద్రాసు, 2. మొదలగు ప్రాంతముల తయారగుచున్నవి. కడపజిల్లాయందొక

1. సమరాంగణ సూత్రధారీ. 2. భారతవస్త్ర పరిశ్రమల చరిత్రము. ౯ పే.

యింట పుట్టెడు ధాన్యము నింపగల గరిసె కాగును చూచితిని దీనినే ఓడకాగని గూడ బిలుతురు.

ఉదయగిరి తాలూకా చల్లావారి పల్లెయందు ఎన పందుము (౧౬౦ పెద్దమానికలు) ధాన్యమునింపగల మట్టి గరిసెలను కుంభారకులు తయారుచేయుచున్నారు. ఇప్పటికిని గరిసెకాగులకు మంచి వ్యాపారము గలదు. తెలుగుదేశము లోను, నిజామురాష్ట్రమునందును గల పల్లెలందు ముప్పాతిక పాలు మట్టిగరిసెలు, అరివేణిబానలు మొదలగు మట్టిపాత్రల యందు ధాన్యమునింపి దాచుకొనుచుందురు. ఈ బానలు ఒక్కొక్కరింట ఒకగది నిండుగయుండును. ఇందు అరివేణి కుండలకుగల సన్నపుపూత ఆచీకటిగదులందు వెలుగు నిచ్చు చుండును.

ప్రాచీనభారతదేశము నౌకావాణిజ్యము జరుపునప్పుడు పెద్ద మట్టిగరిసెలు, మట్టిజాడీలు, మట్టిపాత్రలు విరివిగా ఎగుమతి యగుచుండెడివి. నేడా వాణిజ్యము పూర్తిగ నసించి యుండెను. ఎగుమతులు నసించినప్పటికిని పరదేశములందు జరుగు ప్రపంచ ప్రదర్శనశాలలందు భారతదేశ మృణత్పాత్రల కీర్తి విరాజిల్లుచునేయున్నవి. ఉత్తరార్కాటు జిల్లా గుడియెత్తం తాలూకా కాట్పాడిస్టేషనుకు ౮ మైళ్ళ దూరమునందున్న కరిగెరి గ్రామమున తయారగు మట్టిపాత్రలు ఇతర మట్టివస్తుసముదాయములు పరదేశ ప్రపంచ వస్తుప్రదర్శనశాలలందు గొప్ప బహుమానములు పొందుచున్నవి.

## మట్టి దిగుమతి.

౧౯౩౩ సం॥మునందు రు ౧౭౧౭౩౮౯ లు, విలువ గల పింగాణిమట్టి—కాగితములు, వస్త్రములు, రంగులు రబ్బరు, పండ్లపొడి, సబ్బులు, బలపముల పరిశ్రమలందుపయోగించుటకుగాను చైనానుండి దిగుమతిచేయబడియుండెను. ఈ చైనామట్టివంటి మట్టి మన దేశమున టన్ను రు ౫-౦-౦ లకె దొరకునట్లున్నను తెలుసుకోలేక పోవడము విచారకరముగ నున్నది.

## ఇటుక - పెంకు.

చాల పెద్దవిగను మిక్కిలి గట్టిగను తయారుచేయు ఇటుకరాళ్ళ పరిశ్రమనుగూర్చి సమరాంగణ సూత్రధారీ యను గ్రంథమున దెలుపబడియున్నది. ఒక్కొక్కప్పుడు మూడడుగుల పొడవుగల యిటుకరాళ్లుగూడ తయారగుచుండెను. చిన్నగంజాము స్టేషనుకు రెండు మైళ్ళ దూరమునందుగల పరంగుల దిన్నెవద్దగల శిథిలనగరమునందు కట్టడములకు చాల పెద్ద పెద్ద ఇటుకరాళ్ళు కట్టిన నిదర్శనములుగాన వచ్చుచున్నవి.

వేటపాలెమున కాదు మైళ్ళ దూరమునగల మోటుపల్లె యందున్న లంజదిబ్బ యనంబడు బౌద్ధస్తూప దిబ్బపయి రెండున్నరంగుళముల వెడలుపు మూడున్నరంగుళముల పొడవు గల ఇంటిపైకప్పు పెంకులుగల శిథిలములు గలవు. ఇంత చిన్న పెంకులతో గట్టిన కట్టడముయొక్క శృంగారమును తలంచిన గుండె లవిసిపోవుచున్నవి. ఇట్టి ప్రాశస్త్య విచిత్ర నిర్మాణ

భవనము లెన్ని రూపు తెలియరాకుండ **నాశనమాయెనో** గదా!

పునహో వ్యవసాయకళాశాలకు ప్రధానాచార్యుడగు **మాన్** విద్వాంసుడు శిల్పసమీపమున నున్న యొక పురాతన స్తంభమున కుపయోగింపబడిన గచ్చును పరీక్షించి అది మొదటిరకపు సున్నపుగచ్చు అని కనుగొని యిట్లనెను. "ఈ పరీక్షవలన చక్కగ సిద్ధపరుపబడిన గచ్చెట్టిదో మనకెరుక యైనది. సున్నపు ప్రయోజన మెంతవరకు గలదో, ఇసుక బంక మట్టి యుపయోగించుటచే నెంతెంత ప్రయోజన ముండునో పూర్తిగ గుర్తెరిగి సిద్ధముచేసినది, ఈగచ్చు. ఈగచ్చు చక్కగ నుపయోగపడవలెనన్న నిసుకపాలు సరిపడ నుండవలయును. ఫొనీషియనులు గ్రీకులు వాడిన గచ్చులో ఇసుక మిక్కిలి తక్కువ గన్పించును. కాబట్టి యీస్తంభపుగచ్చు వానిని మిక్కిలి యతిక్రమించినట్లున్నది." అనెను. ఇంకొక్కరు బాహాటముగా నిట్లనిరి. "ప్రాచీనహిందువులు సున్నపుగచ్చు ఉపయోగించినంతగా పురాతనవస్తుశాస్త్రజ్ఞులెల్లరును గొన్నికారణములనుబట్టి నమ్ముచుండిరి.

ఇప్పుడీ నూతనావిష్కారము వారికి దిగ్భ్రమ గలుగ జేసినది. ఈగచ్చును మొట్టమొదట మహమ్మదీయులీ దేశములో ప్రవేశపెట్టిరని నమ్ముచుండిరి. కాబట్టి యెప్పుడో క్రీ. పూ. ౨౫౦ సం॥ లప్పుడు అనగా యీ యిటుక గోడకట్టబడినదని చెప్పు కాలము నాటికేమన వారు దీని నెరింగియుండిరని యెంచుట కేవల మనోకల్పనమని భావింపసాగిరి. తుదకు

మాన్ విద్వాంసుడు కావించిన పృథక్కరణమువలన చిరకాలమునుండియు గట్టిపట్టుదలతో బోషింపబడిన విశ్వాసములలో నొక్కటియగు నిది నశింపగల్గెను" అనెను. (ఈవిషయము హిందూదేశపు ప్రాచీన శిల్పకళాపరిశోధన సంఘమువారి ౧౯౧౫ సం॥ మార్చితో అంతమగు నివేదిక ౬౦ పేజీలో చూడనగును.) 1.

### మంగుళూరు పెంకులు.

భారతదేశమునందు మంగుళూరుపెంకుల వ్యాపారము నానాటికెక్కుడగుచున్నది. అందువలన వ్యాపారులు స్వలాభమునకై మంగుళూరు పెంకులవంటివానిని జపాను, మలయాదీవులనుండి తెప్పించి విక్రయించుచున్నారు. మట్టితోచేయబడు పెంకులనుగూడ పరదేశములనుండి తెప్పించుకొనునట్టి దుస్థితి ప్రాప్తమైయుండుట మిక్కిలిగా విచారమును గలిగించుచున్నది.

## ౧౫. నౌకాపరిశ్రమ.

మానవుడు తొల్లి నీటియం దీదుటకొరకు చిన్నకొయ్యను నాధారముగా గైకొనియుండెను. అనంతర మా కొయ్యకు యిరుప్రక్కల రెండు చిన్న కొయ్యలనుకట్టి తెప్పచేసి తనకన్న నిడుపాటి పొడవుగల ఎదురుకట్టెను నీటియం దాడించుచు ప్రయాణముసాగించెను. ఇట్టితెప్పలే పడవలుగాను, వోడలుగానునిర్మించిప్రపంచయాత్రలుజేసినవారుప్రాచీనభారతీయులు.

మానవునికి విజ్ఞానమబ్బిన కాల మారంభము మొదలు క్రీ. శ. ౧౭౫౦ సం॥ నాటిదనుక ప్రపంచమునం దేదేశీయులు

1. హిందువుల అధికృత. ౫౭౬ పే.

చేయలేనంత పనితనముగల యోడలను భారతీయ నౌకా శిల్పులు నిర్మించుచుండెడివారు. ఈ మహాశిల్పుల నైపుణ్య మేమోగాని గట్టితనముగను, పెద్దవిగను, సౌందర్యముగను, అందేపేటలు, వనములు కడకు వెండి బంగారు రత్నములు గూడ కూర్చి సంపన్నులు సకల సౌభాగ్యములతో సమస్త భోగము లనుభవించుచున్నట్లుగాను నౌకలను నిర్మించుచుండెడి వారు.

సాధారణముగా నిర్మించుయోడ ౧౫౩ అడుగుల పొడవు, ౮౨ అడుగుల వెడల్పు, ౩౧ అడుగుల ఎత్తుగలిగి ౬౦ గదులతోను అడుగుభాగమున ౧౩ పొరలతోను నిర్మింపబడుచుండెను. కొన్ని యోడలు నాలుగు పెద్దస్తంభములు రెండు చిన్న స్తంభములుగూడ కలిగియుండును. పదునైదు ఇరువది తెరచాపలవరకును కట్టిగాలి వీచు దిశలకేగాక ప్రక్క దిశలకుగూడ వేగముగా నడుపగల యుక్తిగలిగి యుండిరి. ఈ యోడలు ౫౦ సం॥ ల కాలమద్వితీయముగా ప్రయాణము జేయుచుండెడివి. ఒకటన్ను ౨౦౦ రు/ లెక్కను ౨౦ వేల టన్నుల ఓడలు ౨౦ లక్షల రూపాయల విలువతో కొన్ని తయారగుచుండెను. ఒక్కొక్క నావపై ౧౫౦ మొదలు ౩౦౦ వరకు కలాసులుండెడివారు. వెయ్యిమంది వరకు ప్రయాణముచేయుచుందురు. "భారతదేశపుటోడలు నిర్మించిన తరువాత పదిసంవత్సరములపాటు వాణిజ్యమున కుపయో

గించి పరదేశీయులకు యుద్ధపుటోడలుగా విక్రయించువాడుక గలిగి యుండెను. "1.

## యుద్ధపుటోడలు.

ఋగ్వేదకాలమునందు భుజ్యుడను యువరాజు ద్వీపవాసులను జయింప యుద్ధపు నౌకపై సముద్రమునందు ప్రయాణము చేయుచుండగా మార్గమధ్యమున భయంకరమైన తుపాను వలన నతని యోడ మునిగిపోగా అశ్వినీ దేవతలు తమనౌకపై వచ్చి యాతని రక్షించియుండిరి. రఘుమహారాజు వంగదేశాధీశునితో నౌకాయుద్ధము జేసినట్టుల రఘువంశమునగలదు. రామాయణమునందయోధ్యాకాండలో నైదువందల ఓడల నిండుగ వందలకొలది కైవర్తులు సన్నిద్ధులైయున్నట్లుగలదు. 2. భారతమునందు సభాపర్వములో సహదేవుడు "సాగరద్వీపనివాసులైన నిషాదులం బురుషాదుల నేకపాదులం గాలముఖులం గర్ణప్రావరణుల నరరాక్షసయోనుల రామశైల కోలశైల తామ్రద్వీప సంజయంతీ పురవాసులను వశగతుంజేసి" కానుకలు బడసి యుండెను. ఇందునుబట్టి సహదేవు డపారమైన నౌకా యుద్ధ ప్రశక్తిగలిగి యున్నాడని వేరుగ దెలుప నక్కరలేదు.

౩౩౦౦ సం॥ క్రింద అసీరియా పాలించు సెమిరరాణి విశ్వప్రయత్నము జేసి ౨౦౦౦ యుద్ధపు నౌకలను, 3 లక్షల కాల్బలమును, ౫ లక్షలశ్వదళముతో హిందూదేశముపై దండయాత్ర సాగించి రాగా భారతీయులు ౪౦౦౦ వేల యుద్ధపు

1. ప్రాచీనాంధ్రనౌకాజీవనచారిత్రము.

టోడలతో సింధూనదిపై నెదుర్కొని పగతురలో నొక్కరై నను బ్రతుకనీక నాశముగావించి యుండిరి. బౌద్ధజాతక కథల యందొక నౌక ౮౦౦ మూరల పొడవు ౨౦ నిలువుల ఎత్తు మూడు స్తంభములతో రక్తవర్ణము గలిగి యుండెను. 1. దీని యాకార వర్ణములను బట్టి యుద్ధ నౌకగా నిర్ణయింప వచ్చును. *అలెగ్జాండరు సింధూనదిని దాటుటకు హైందవులచే నిర్మింపబడిన నావల నుపయోగించి యుండెను. మరియు నతని సైన్యములు స్వదేశమున కేగునపుడు అతని సేనాధిపతి యగు 'నియార్కస్' సింధూనదిలోని నౌకలను రమారమి రెండువేలు చేర్చి వాని సహాయమున సింధూనది నతిక్రమించి అరేబియాసముద్రమును ప్రవేశించి "పెర్షియన్ గల్ఫ్" వరకును సముద్రముమీదనే ప్రయాణముచేసెను. ఈ నౌకాదళము సుమారు ౮౦౦౦ సైనికులును, వేలకొలది గుఱ్ఱములను, అపరిమితమగు యుద్ధసామగ్రిని వహించెను. ఈ మహాదళము హైందవులకార్మికులతో హిందూదేశపు కలపతో నిర్మింపబడెను. ఇట్టి మహాదళములసైతము నిర్మింపగల ప్రత్యేక నిర్మాణ స్థలము లాకాలమున చాల యుండెను. 2.

పదిపదకొండు శతాబ్దముల దక్షిణ హిందూస్థానమున చోళచక్రవర్తులు నౌకాదళమును విరివిగ నిర్మించిరి. రాజరాజచోళుడు "చేర" నౌకాదళమును నాశన మొనర్చి సింహళమును జయించి దక్షిణ హిందూస్థానమున నౌకా బలసమన్వితమగు సామ్రాజ్యమును స్థాపించెను. అతని కుమారుడగు

---

1. ప్రాచీనాంధ్రనౌక జీవనచారిత్రము. 2. మనకీదారిద్ర్యమేల? ౧౨౦ పే.

రాజేంద్రచోళ దేవుడు ఈ నౌకాబలముతో ఓఢ్ర, వంగ, విహార, ఘూర్జర, దేశముల జయించెను. గంగాతీరమును స్వాధీనము చేసుకొనుటచే "గంగయకొండ-చోళ" యని బిరుదు గాంచెను. మరియు నితడు మహాసారధిని కలియ దిరిగి ౧౨౦౦౦ దీవులను తన వశము చేసుకొనెను. ఇంతియ గాక, కాటరము (పెగూ) దేశాధీశ్వరుడగు "సంగ్రామ విజయోత్తుంగ వర్మను" సముద్రరంగమున నోడించెను. 1.

గజనీమహమూదును ఎదిరించుటకుగాను భారతీయులు సింధూనది మీద ౪౦౦౦ యుద్ధపు టోడలతో సిద్ధపడియుండిరి. "గ్యాసుద్దీన్ బల్బన్" (క్రీ. శ. ౧౨౬౬-౮౧) వంగ వంగదేశపు నవాబగు 'టుగ్రీల్ ఖాన్' పై దాడి వెడలినపుడు అనేక నావలను నిర్మించి, రెండు లక్షల సైన్యముతో సరయూనదిపై ప్రయాణము చేసి శత్రువుల జయించెను. "ఫిరోజషా తుగ్లకు" నౌకాదళము గైకొనియే లక్నోపట్టణముపై దాడి వెడలెను. అతడు ౫౦౦౦ నావలను నిర్మించి, ౯౦౦౦ గుఱ్ఱములను, ౪౮౦ ఏనుగులను గైకొని వానిపై సింధునదియందు ప్రయాణమొనర్చి ౧౩౭౧ సం॥లో పట్టాను వశపరచుకొనెను. తైమూరులంగు దండయాత్ర ౧౩౮౮ సం॥లో కూడ నదులు దాటుటకును శత్రువుల జయించుటకును హిందువులచే నిర్మింపబడిన నౌకలే యుపయోగింప బడెను. 2.

---

1. 2. మన కీ దారిద్ర్యమేల ౧౨౯-౧౩౩ పే

క్రీ. శ. ౧౫౦౦ సం॥లో నొకగుజరాతు ఓడపైనుండిన నావికులు పోర్తుగీసువారిపై ననేక శతఘ్నుల ప్రేల్చినట్లును; ౧౫౦౨ సం॥ లో కళ్లికోట వాస్తవ్యులైన భారతీయులు అగ్న్యస్త్రము లమర్పబడిన యోడ నుపయోగించినట్లును; మరుసటియేడు జామొరిన్ నౌకలపై ౩౮౦ ఫిరంగులుండెనని యు ఫరియా-ఎ-సౌజా వ్రాసెను 1.

అక్బరు పాదుషా కాలమున అనేక విధములగు నోడలను పడవలను నౌకానిర్మాణశాఖవారు నిర్మించు చుండిరి. ఇందుకొన్ని ఏనుగులను మోసికొని పోవుటకును, కొన్ని యుద్ధములం దుపయోగించుటకును, కొన్ని వర్తకపుసరకులను గొంపోవుటకును నేర్పాటులు చేయబడెను. రాజవిలాసార్థమై నిర్మింపబడిన కొన్ని నౌకలు ఉద్యానవనములతోడను, పణ్యవీధులతోడను, నాటకమందిరములతోడను నొప్పారుచుండెను.2.

బొంబాయి నగరము ప్రసిద్ధమగు ఓడలకును, నావికా నిర్మాతలకును నిలయమై యుండెను. మలబారు, గుజరాతు, అరణ్యములనుండి యిక్కడికి టేకు కలప వచ్చుచుండుటచే దీనికి సహజముగు నేర్పు స్థానమున కుండవలసిన సౌకర్యము లన్ని యుండెను. ఇంగ్లాండులో చేయబడిన ఓడలకంటె టేకు కర్రతో నిర్మింపబడిన బొంబాయి ఓడ లెంతయు ప్రశస్తముగ నుండెను. ఆంగ్లేయ నావికాదళమునందలి ప్రతియోడయు పన్నెండు వత్సరముల కొకసారి మరమ్మతు కోరుచుండును. టేకు కర్రతో చేయబడిన ఓడలు సుమారేబది వత్సరముల

---

1. హిందువుల ఆధిక్యత ౪౯౧ పే.

వరకు ఉపయోగించుననను విషయము జగద్విదితము. బొంబాయిలో నిర్మింపబడిన ఓడలు పదునాలుగు పదునేను వత్సరములు వాడుకొనిన పిమ్మట ఆంగ్లేయ నావికాదళములోనికి తీసుకొని రాబడినను, నవీనము లట్లు గన్పట్టెను. సర్ ఎడ్వర్డు హ్యూసు అను పేరుగల ఓడ మన నౌకాదళములోనికి రాకపూర్వము ఎనిమిది పర్యాయములు ప్రయాణ మొనరించి యుండునని నేను నమ్మెదను. ఐరోపాలో నిర్మింపబడిన ఏ యోడయు ఇండియాకు ఆరు పర్యాయములకంటె నెక్కువసార్లు క్షేమముగా ప్రయాణము చేయజాలదు అని లెప్టినెంటు కర్నలు వాకరుగారు ౧౮౧౧ సం॥ న వ్రాసిరి. అన్యదేశీయ నౌకలకంటె మన్నికయందు శ్రేష్ఠమగుటేగాక నిర్మాణ సామగ్రీసౌలభ్యముచే బొంబాయి ఓడలు ఆంగ్లయోడలకంటె నాలుగురెట్లు తక్కువ ధరలకు దొరకుచుండెను. 1.

మహారాష్ట్ర సామ్రాజ్యస్థాపకుడగు శివాజీ చక్రవర్తి నౌకా నిర్మాణమును సముద్రవ్యాపారమును మిగుల ప్రోత్సహించెను. నౌకా దళనిర్మాణము వలన మహారాష్ట్రబలము పెంపువహించెను. విజయదు, కొలాబ, సింధు, వర్గ, రత్నగిరి, అంజన్వేళ మొదలగు రేవుస్థలములందు యుద్ధ నౌకలు నిర్మాణమగుచుండెను. 2.

... ...ఈస్టిండియా కంపెనీవారిచే వృద్ధిచేయబడిన భారత నౌకాదళము ప్రథమ ద్వితీయ బర్మాయుద్ధములందును చీనాయుద్ధమందును వారికి చాల నుపయోగించెను. హిందూ

1. మన కీ దారిద్ర్య మేల

మహాసముద్రముననే గాక పర్షియన్ గల్ఫ్, ఎర్రసముద్రమును తూర్పు ఆఫ్రికాతీరములందుకూడ గొప్ప సేవ నొనర్చెను. 1.

ఈ పరిశ్రమయొక్క క్షీణదశను గూర్చి వ్రాయుటకు పూర్వము భారతీయులకు నౌకా నిర్మాణ కళయందు గల ప్రజ్ఞా విశేషములగూర్చి యఫ్. బాల్టజమ్సోలో విన్సు అను ఫ్రెంచి మహానీయుడు తన గ్రంథములో ఏమి వ్రాసెనో గమనింతము. "నౌకానిర్మాణకళయందు ప్రాచీన భారతీయులు ఐరోపా దేశముస కాదర్శప్రాయులై యుండగలరు. నౌకా నిర్మాణకళయందు అభినివేశముగల ఆంగ్లేయులు హైందవుల వలస పెక్కు విషయములు నేర్చుకొనిఉత్తీర్ణులైయుందురు... ......భారత యోడలు బహువిధోపయోగములై సుందరమై మన్నికయందును పనివాని తనమందును గూడ ఆదర్శప్రాయముగ నున్నవి." 2.

ఇట్టి భారత నౌకా పరిశ్రమవల్ల ఆ నాడెన్నికోట్ల కార్మికులు, కలాసులు మొదలగువారు సుఖజీవనము చేయుచుండిరో గదా! అట్టి నౌకా పరిశ్రమ నశించుటచేత కోట్ల ప్రజల జీవనము పూర్తిగ నసించియుండెను. నర్సాపురములో ఓడలు నడపునట్టి మాలెం (కెప్టెన్) వీధియొక్క పరిస్థితులనుబట్టి చూచిన యెడల వేలకొలది యోడలతో నీసేవ విరాజిల్లి యుండినదని తేట పడుచున్నది. లక్షలకొలది కలాసుల జీవనముగూడ నసించినదని దెలుపవచ్చును.

---

1. 2. మన కీ దారిద్ర్యమేల.

# ౧౭. చర్మపరిశ్రమ.

చర్మములను తొలుత మానవుడు చలిని భరింపలేక వాడుకొనుట కారంభించెను. తదుపరి మానరక్షణకు గూడ నుపయోగించుకొనియుండెను. విచక్షణ లేక ప్రతి మానవుడు తనకు గావలసిన చర్మములను తానే తెచ్చుకొని శుభ్రపరచుకొను చుండెడివారు. "భారతదేశమునం దాదిమనివాసులు చర్మములతోను ఆకులతోను శరీరము కప్పుకొను చుండెడివార"1.ని వివేకానందుడు వెలుపుచున్నాడు. చర్మములను సంపాదించుటలో కొందరు ఋషిసత్తములు తమ ఆశ్రమములందును నడవులందును మరణించిన మృగముల చర్మములే వాడుకొను నియమము గలిగియుండిరి. "పడకకు పచ్చడముగను, కప్పుకొనుటకు దుప్పటిగను, స్త్రీలు కట్టుకొనుటకు చీరగను, పురుషులకు కౌపీనాంగ వస్త్రములుగను నేర్పడి చర్మములు కర్మభూమియందు మానవుల రక్షణకుపయోగకరమయి యుండెను. ఆబాలవృద్ధులకును ఆకాలమునగల అలంకారములకొఱకు వ్యాఘ్రచర్మములు, కృష్ణాజినములు—ఈ నాటి చిత్రములగు మాంజిష్ఠ వస్త్రములకన్న నెక్కుడు ప్రీతిని గూర్చుచుండెను. 2.

1. ప్రాక్పశ్చిమము. 2. నేతపరిశ్రమ ౨౯ పే.

"ఉత్తరీయ్యాం సమాఖ్యాతంవాసః కృష్ణాజినం శుభం"
(ఔశ. శ. స్మృ. ప్ర. ౩)

మంగళకరమయిన కృష్ణాజినము నుత్తరీయముగా ధరింపవలెనని ఔశన ఋషిచంద్రుడు తెలుపుచున్నాడు.

సింహవ్యాఘ్ర తనుత్రాణై ర్వారాంతకాంచన రాజితైః॥
ఘోషవద్భిర్విచిత్రైశ్చ సదాపి చరితం రథైః ॥
రామా. సుం. స ౬. ౬.

లంకయందు బంగారుతోను దంతములతోను, నిర్మింపబడిన రథములయందు సింహ వ్యాఘ్ర చర్మములు పరువబడి యున్నవి.

చర్మము పదునుటలో మృదువుగను కఠినముగనుండు సంచుల తయారు చేయబడుచుండెను. పెద్ద పెద్ద చర్మములను పొలములకు నీరు త్రోలుటకునుగాను పెద్దతిత్తులు కొలకు ఉపయోగింపబడు చుండెను. ఖడ్గమృగముయొక్క చర్మముతో డాలు కవచాదులు తయారు చేయుచుండిరి. ఊనిన తరువాత ఈ చర్మముయొక్క పై భాగమున ఇనుమువలెగట్టిగ యుండుటచేత కత్తి వేట్లును, తుపాకీగుండ్లు కదిలింపజాలకున్నవి. దాదాపు రెండంగుళముల మందముగూడ ఈ చర్మముగలిగి యుండుట కలదు. ఈ చర్మము నెక్కువగా యుద్ధ పనికరముల కుపయోగించుచుండిరి. "వేదకాలమునందు తోళ్లు మున్నగు వానితో కత్తి పనులు స్త్రీలు చేయు వృత్తులలో నొకటిగ నుండెను." 1.

---

1. వేదకాలపుస్త్రీలు ౭. ౭. ౯౮ పే.

"నిర్ ఋత్యైకోశకార్ం" (తై. బ్రా. 3. ౪. ౧౦.) పాపదేవతకు కత్తివరలుచేయు దానిని బలియీయవలెను 1.

మిక్కిలి మృదువుగ నూనిన చర్మములను ఆసనములుగను కప్పుకొనుట కుపయోగించుచుండెడినారు. "రోమము లూడని చర్మాసనములు నుపయోగించువారికి అశనిపాత సమయమున బ్రతిఘాతభయము లేదు. వారికి, భూమిలో సంసర్గము లేకుండ నడుమను అవిద్యుద్వాహకమున్నది.

బొమ్మలాట.

మిక్కిలి చక్కగ నూనిన చర్మములపై అందమైన పక్కారంగుల నెక్కించుచుందురు. ఈ చిత్ర లేఖన మతి చాతుర్యముగానుండును. ప్రజలకు నీతిని విజ్ఞానమును పెంపొందించుట కేర్పరుపబడిన తోలు బొమ్మలాట లతి ప్రాచీన కాలమునుండి యున్నవి.

చీట్లాట.

ప్రాచీన భారతీయులు వినోదార్థమయి చర్మములపై పలువిధములైన అలంకారపు గుర్తులుండు చీట్లాటలాడునాచుక గలదు.

౧. బూజు, ౨. రంగుబూజు, 3. అమరంగు, ౪. దశావతారము, ౫. అపినారాయణ.

మొదలగు యాటలుగలవు. వీనిలో కొన్ని ౧౨౦ చీట్లతో యాడబడుచున్నవి. మిక్కిలి మృదువైన చర్మము మీద చాల పక్కా రంగుతో ఈ చీట్ల గుర్తుల చిత్రములు

1. వేదకాలపుస్త్రీలు అ. ఆ. ౯౭ పే.

చిత్రింపబడుచుండెను. చెన్నపురి చిత్రవస్తు దర్శనశాలయందు దశావతారమను చర్మపు చీట్లను చూడవచ్చును.

## పా ద ర క్ష లు.

పాదరక్షలు, మెట్లు, కాలిజోళ్లు, కిఱ్ఱుచెప్పులు, ముచ్చెలు, మొదలగు పేర్లతో పిలువబడుచున్నవి.

సీ॥ ... ... ... ... ...

తే॥ పాదముల గిఱ్ఱుగిఱ్ఱని పలుకుమెట్లు॥ (హంస. తృ. ౯౦

"పదాబ్జయుగంబున ముచ్చలొప్పగా॥ (హంస. తృ. ౯3

నాలుగణాలు మొదలారు రూపాయలవరకు చెప్పుల జోళ్లుకుట్టి విక్రయింపబడుచున్నవి. కృష్ణాజిల్లా పెదమద్దాల గ్రామమున శ్రేష్ఠమయిన చెప్పులజత రు ౫-౦-౦ల వెల గలిగి నవిగూడ కుట్టుచున్నారు.

ముచ్చెలయందు వెండి బంగారు పూలు జరీ ముత్య ములు - రత్నములు కూర్చి వందలు వేలు రూపాయల ఖరీదు గలవి గూడ తయారగుచుండెడివి.

## మా న వ చ ర్మ ము.

చర్మము లూనుటలో మృగముల చర్మములే గాక మానవ చర్మములుగూడ ఊనుట ప్రాచీన భారతీయులకు దెలిసి యున్నది. శాక్తేయులు బ్రతికియున్న యువకుని తమ దేవత కర్పించిన (బలియిచ్చిన) తరువాత నతని చర్మమువలచి చక్కగ నూనించి యా దేవత భేరీకి కట్టించుచుందురు.

## ర వి దా స  సం ఘ ము.

పంజాబురాజధాని ప్రధానమంత్రిగారయిన డాక్టరు గోకుల్చందుగారు "షహామొహల్లా" యను యరుంధతీయగ్రహారమున గల "యుపాసహా" నిర్మాతల (చెప్పులు కుట్టువారు) యాహ్వానముపై రవిదాస సంఘమునకధ్యక్షులుగా వచ్చినపుడొసంగిన యుపన్యాసములో ఈ క్రింది విషయములుకూడ కలవు.

"అరుంధతేయుల మేనత్తకు బుట్టినవారు తండ్రి నామముచే బిలిపించుకొనజాలరు. సృష్ట్యాదిని తొల్లి సూర్యుడు చెప్పులుగుట్టి భృగుమహర్షి కోపశమనం గాంచి యుండెను. అందుచేత వీరికీ నామము గలిగినది." పై కారణముచేత ఉత్తర హిందూదేశమునందుగల ఆర్యజనులలో చర్మపరిశ్రమ చేయువారు రవిదాస సంఘజులనిన్ని, అరుంధతేయులనిన్ని పిలువబడుచున్నారు.

## మాతంగులు.

దక్షిణ హిందూదేశమున మాతంగ మహర్షి నెలకొలిపిన మాతంగమతమునకు చేరిన వారికానాటి ప్రజలు సహాకారమొసంగమిచేత నాప్రజలందరు చర్మపరిశ్రమను బూని యున్నారు. ఇందువలన దక్షిణదేశమున గల చర్మపరిశ్రమ వారందరును మాతంగమతము వారైయున్నారు.

## కన్నడ దేశము.

ముచ్చెలు, చడావాలు మాత్రము కుట్టుచుండు సంఘమొకటి కన్నడదేశమున గలదు. వీరు శైవమతాచారపరులై

యున్నారు. ఈ తెగవారు కన్నడదేశమునందే గాక ఆంధ్ర నిజాము రాష్ట్రములందును ఇతర రాష్ట్రములందును విరివిగా కానవచ్చుచున్నారు.

## ౧౫. రాగి పరిశ్రమ.

రాగి గనులు భారతదేశమున చాల గలవు. లోహములలో రాగి మిగుల శ్రేష్ఠతరమైనది. దీనియందు విద్యుచ్ఛక్తి విస్తారముగా గలదని ఆర్యులతి ప్రాచీనకాలమందె తెలుసుకొని యున్నారు. అందుచేత రాగి తాయత్తులు ధరించుట, రాగి రేకుపై బీజాక్షరములు వ్రాసి వెండి బంగారు తాయత్తులందుంచి ధరింపజేయుట, రాగిబిళ్లపై హనుమంతుని చెక్కి పిల్లల మెడయందుంచుట, రాగిరేకులపై చక్రములు బీజాక్షరములు చెక్కి ఇండ్లయందు పాతుట, పూజాస్థలములందుంచుట, మరియు దేవాలయపు గోపురములపై రాగికడ్డీలుంచుట, దేవాలయములకు తొడుపులు తొడుగుట గృహములందు పాత్రసామానులుగా వాడుట, అన్నము రాగిపాత్రలయందు వండుట, స్నానమునకు నీరు ముఖ్యముగా రాగిపాత్రలయందు కాచుట మొదలగు కార్యములన్నియు రాగిలోగల విద్యుచ్ఛక్తి ఆరోగ్యసిద్ధాంతప్రకారము భారతీయులతి ప్రాచీన కాలము నందేర్పరచి యున్నారు.

"జబ్బులు కుదుర్చుటకీకాలమున విద్యుచ్చికిత్సకులుపయోగించుచున్న వైద్యుతకటిబంధాది సాధనములు (మెఱుపు

పటకాలు మొదలగునవి) ఏ పని చేయునో తామ్రయొత్తులు నదే పని చేయును. కాశీవిశ్వనాథుని సువర్ణదేవాలయము నిశ్చయముగ పిడుగు సోకజాలని రక్షణస్థానము. తుపాకిమందు గొట్టమునకు పిడుగుపాటు భయము లేక కుండుటకై రాగితొడుగు నుపయో గించుట మంచిదని మాత్సుముల్లరు పండితుడు సూచించు చున్నాడు." 1.

ఆయుర్వేదమునందు రాగిభస్మమునకు "గురు" భస్మ మని నామముగలదు. శ్రేష్టతమమైన గురుభస్మమునకు భారత దేశమంతట నద్వితీయ గౌరవముగలదు. రాగితో మూలికల పసరుచేర్చి కరగిన బంగారు వన్నెచూపునుగాని బంగారు కానేరదు. రాగిని బంగారుగా చేయగలమనిచెప్పి ప్రజలవల్ల ధనమార్జించు మోసకులకీ సాధన చాల యనుకూలించు చుండును.

ఇంతటి ప్రాగల్భ్యంబుగలిగిన రాగిపరిశ్రమ ప్రతిపట్టణము నందును పల్లెయందును విరివిగాయుండుటనుబట్టి భారతదేశము లోహ విమర్శనశక్తి అతిప్రాచీనకాలమునందే యుగ్గుబాలతో త్రాగినదని తేటపడుచున్నది.

1. హిందువుల ఆధిక్యత. ౫౩. పే.

# ౧౯. ఇత్తడి.

---

రాగి ఇత్తడిగా తయారగుచున్నది. ఇత్తడితో విశేషముగ పాత్రసామానులు తయారు చేయుచుందురు. దక్షిణ హిందూదేశమునకెల్ల నాజూకయిన ఇత్తడి పాత్ర సామానులు కుంభకోణమునందుత్పత్తి చేయుచున్నారు.

సీ॥ ఘర్జరకలును బింగాండ్లు తాబాణాలు
గిన్నెలు తబుకులు గిండ్లు స్నపన
పాత్రలు చట్లును బానపాత్రలు మేలు
చట్టువంబులు మంచి మట్టుగిండ్లు
సంపుటంబులు గొప్ప స్థాలీలు తబుకులు
కంచము లట్లు గంగాళములును
చెంబులు గడిగముల్ చిప్పలు హస్తావ
ఘులు కంకణములు ఘంటలును గజ్జె
తే॥ లాదిగాగల్గు దీవులయందు వెలయు
కంచరపుజాతి వగవగల్మించ జేసి
నట్టి సామగ్రి బహువెలల్వట్టికొనియె
గొంత భూకాంతమణులకు గాన్క జేయ॥

"ఒకానొక భారతీయ మహీపతి తన సేనాముఖమున నిత్తడిఫిరంగుల బెక్కింటిని నిలుపుచువచ్చుచుండినట్లు బొకలెను పండితుడు "డాస్. అల్ట్ ఇండియన్ వా ౧౧ పే ౯౩ లో యున్నదని వ్రాయుచున్నాడు 1.

1. హిందువుల ఆధిక్యత ౪౯౦

వెండి బంగారు నగలవలె ఇత్తడి నగలుకూడ ఓఢ్ర దేశమునం ఎక్కువగా వాడుచుందురు. ప్రాచీనకాలమునుండి భారతదేశమునుండి ఇత్తడి నగలు విరివిగా పరదేశముల కెగుమతి చేయబడుచుండెడివి.

## ౨౦. కంచు

రాగినే కంచుగా మార్చుచుందురు. శ్రేష్ఠమైన కంచు నందు చిలుము చేరనేరదు. అందుచేత కంచుతో చేయబడిన పాత్రసామానుల కెక్కువ విలువ, గౌరవముగలవు. శ్రేష్ఠమైన కంచు సామానులు అన్నిప్రాంతములందును తయారు కానేరవు. కొన్నిప్రాంతములందు తయారగుచున్న కంచు పాత్రలు మాత్రమే చాల నమ్మికగానున్నవి.

మంచి కంచునందు సహజమగు నునుపుదనముచు త్వరగ నరగనట్టి కఠినమును గలిగియున్నది. అందుచేత కంచుతో పోతసామానులెక్కువగా తయారుచేయుచుందురు.

కంచురథములు పూర్వకాలమునందు విరివిగా యుండెడివి. పాంచాలికాయంత్ర నిర్మితంబగు కీలుగుర్రములుగూడ తయారగుచుండెను. కంచు, ఘంటలకు చాల ప్రసిద్ధిగాంచి యున్నది. ఎత్తు ప్రదేశములందుగల పెద్దకంచుగంట శబ్దము కొన్ని మైళ్లదూరము వరకు వినిపించుచుండును. "కంచు మ్రోగినట్లు కనకంబు మ్రోగునా" అని యార్యోక్తి కలదు.

రాగి, ఇత్తడి, కంచు లోహములతో అలంకారపు వస్తువులు, ఆటబొమ్మలు, శృంగారపు కొలముట్లు విశేషముగ దేశమునందన్ని భాగములయందు తయారగుచున్నవి.

---

## ౨౧ ఉన్ని పరిశ్రమ.

---

తొలుదొల్త ఉన్ని తంతువునకు గంజిపూసి గట్టిపరచి ఆ నూలును పడుగుగా నమర్చి వస్త్రముగా నేసియున్నారు.

మం॥ సీసేనతంత్రం మనసామనీషణః
ఊర్ణా, సూత్రేణాకవయో౽వయన్తి ॥
యజు. అ ౧౯. మం. ౮౦.

మనోవిజ్ఞానముగల ఋషిపుంగవులు ఉన్నితంతువును గట్టిపరచుట కారంభించి ఆ తంతువునే నేయుచున్నారు.

మం॥ సరీః స్తంత్రంతన్వతే ॥
(ఋ. ఆ. ౮. అ. 3. వ. ౧. మం. ౧౦. సూ. ౭౧. మం ౯.)

తంతువునకు గంజిపూసి గట్టిపరచుచున్నారు.

మం॥ చకృతసరాణ్యోతవే ॥
(ఋ. ఆ ౮. అ ౭. వ. ౧౬ మం ౧౦. సూ ౧3౦. మం౨.)

చక్రమను రాటముతో పేకకు నూలు చుట్టబడుచున్నది.

“ ఊర్ణో—మృదా ॥ (ఋ. మం. ౫. సూ ౫. మం. ౪. ఉన్ని మృదువుగా నున్నది.)

మం॥ శ్రీయేపరుష్ణీముషమాణఊర్ణామ్॥
(ఋ. ఆ 3. అ ౬. వ ౭. మం ౪. సూ ౨౨. మం ౨.)
సంపదగలవారు శోభకొఱకు సుముహూర్తమున ఉన్ని బట్టను ధరించుచున్నారు.

మం॥ వాసోవాయోఽవీనామావాసాంసిమర్మృజత్॥
(ఋ. అధ్యా ౭. అ ౭. వ ౧౪. మం ౧౦. సూ ౨౬. మం ౬)
వస్త్రనిర్మాతలు గొఱ్ఱెమేకలయొక్క ఉన్నితో మిగుల సుందరము లయిన వస్త్రములను నేయుచున్నారు.

... వేదకాలమునందు సుదాసచక్రవర్తి కాలమున ఉన్ని పరిశ్రమ విస్తారముగా వ్యాపింపచేయబడి యుండెను.

మం॥ శతమూర్ణావతీనాంశతం దాసా అతిస్రజ॥
(ఋ. అ ౬. అ ౪. వ ౨౧. మం ౮. సూ ౯౬. మం 3)
... ఒక్కొక్క కుటుంబమునకు నూరేసి గొఱ్ఱెలను సుదాసచక్రవర్తి దానమొసంగి యుండెను.

మం॥ ఇనుమూర్ణాయుం......మాహింసీః॥
(యజు. అ ౧3. మం ౧౯౦.)
ఉన్నినిచ్చు గొఱ్ఱెలను హింసింపరాదు.

"బిభ్రద్రాపిం హిరణ్యాం వరుణోవస్త్రనిర్ణిజం॥"
(ఋ. అ ౧. అ ౨. వ ౧౭. మం ౧. సూ ౨౫. మం ౧3)
బంగారు జరీతాపిన సుందరమగు వస్త్రములను వరుణుడు ధరించి యుండెను.

"కంబళానాంచముఖ్యానాం......కోట్యంబరాణిచ" 1

1. రామాయణము.

జనకరాజు సీతాకళ్యాణమునందు కంబళులు మొదలగు వస్త్రముల నొక కోటి నొసంగియుండెను.

ధర్మరాజు రాజసూయయాగము చేయునపుడు వచ్చిన కానుకలలో "హిరణ్య రత్న రజత కంకబళాంబరాదులు" 2. వచ్చియుండెను.

తే॥ యజ్ఞదీక్షితుడయిన ధర్మాత్మజునకు
గౌడ కాంభోజపతులనేక ప్రకార
వర్ణకంబళులు ... ... ... .
... ... ... ...

భార. సభా. ద్వి. ౧౦౯ ప.

అతి ప్రాచీనకాలమునుండి భారతదేశమునందు విరాజిల్లు చుండిన ఉన్ని పరిశ్రమ మిక్కిలి విఖ్యాతంబయి దినదినాభివృద్ధి పొంది యద్వితీయమయిన కీర్తి గడించియుండెను. ఇంతటి కీర్తినిపొందుటకు కారణము ఈ యున్ని వస్త్రములలో మిక్కిలి మార్దవము ఎక్కువ నున్నదనమేగాక పట్టునూలా ములవలె మెరయుచు పక్కారంగులతోగూడి చూచువారలకు మనోహరముగా కనులకింపుగూర్చుచుండెను. ఈ సొగసునకు తోడు వెండి బంగారు జరీలతోను ఇతరరంగుల నూలుతోను కుట్టుపని చేయుచుండెడివారు. కుట్టుపని చేయుటలో అంచులు కమ్మలేగాక మధ్యలోగూడ పూలు, కాయలు, ఆకులు, గుత్తులు అందమైన అనేకాకారములుగా కుట్టుచుండిరి. మిక్కిలి సంపన్నులకు గావలసిన శాలువలు వెండి బంగారు జరీలతో

2. భారతము. సభా. ద్వి. ఆ.

పాటు రత్నములు ముత్యములుగూడ జేర్చి కుట్టుచుండిరి. ఇట్టి నిండు కళాపరిజ్ఞానముగల శాలువలలో ఒక్కొక్కటి వేలరూపాయల ఖరీదున కమ్ముడు వోవుచుండెను.

ఇవ్విధముగా తయారగుచున్న సన్నని యున్నివస్త్రములలో కాశ్మీరదేశపు వస్త్రములుచాల ప్రఖ్యాతిగలిగియుండెను. "కాశ్మీరమునందు విచిత్రమైనవియు, ఆ దేశములోముఖ్యముగా తయారుచేయబడినవియు ఆ దేశపు వర్తకపు సరకు అగుటచే దేశధనమును వృద్ధి పొందించు నవియు నైనవి, అచట తయారుచేయబడు అసంఖ్యాకములగునవి శాలువలు. ఇవి చిన్న పిల్లలకుగూడ వృత్తినికల్పించును. వీని రెండు చివరలకు ఒక అడుగు వెడల్పు సుందరమైన అల్లికపనిచేయబడును. వీటిని మొగలాయిస్త్రీలు హైందవస్త్రీలునుగూడ చలికాలములలో ధరించెదరు. ...... ఇందు రెండురకములు కలవు. ఒకరకము స్పెయినుదేశమందలి ఉన్నికంటె సన్నమును మృదువును అయిన ఈ దేశమందలి ఉన్నితోచేయబడును. రెండవరకము టిబెట్టులో నివశించు ఒకవిధమైన మేకయొక్క రొమ్ముమీది రోమములతో నేయబడును. "టుజ్జు" అని పిలువబడు యీ మృగరోమములతో నేయబడు శాలువలు ఉన్నిశాలువలకంటె మిక్కిలి విలువగలవని "బెర్నియరు సంచారము"లను గ్రంథమున వ్రాసియున్నాడు. 1.

సుందరమగు కాశ్మీరపు శాలువులు రోముచక్రవర్తుల భవనములం దలంకరింపబడు చుండెనని "హెరొడోటస్" 2.

1. భారతవస్త్ర పరిశ్రమల చరిత్రము. 2. హిందువుల ఆధిక్యత.

అను చరిత్రకారుడు వ్రాయుచున్నాడు. "కాశ్మీర శాలువులు నేటికిని నిరుపమానములుగ నున్నవ" ని మానింగుసతి వాక్రుచ్చెను. 1. కాశ్మీరశాలువలను గూర్చి మన్రోగారు యిట్లు ప్రశంసించిరి. "హిందూదేశపు శాలువను ఎనిమిది సంవత్సరము లుపయోగించితిని; ఇప్పటికిని క్రొత్తదివలెనే యున్నది. నాకు బహుమతిగా నివ్వబడినను దీనితో సమమైన ఐరోపా శాలువను చూడజాలను." 2. బొంబాయి మ్యూజియములో మూనోయాంతస్తునందు కాశ్మీరశాలువలు ప్రదర్శింపబడి యున్నవి. ఇవి చూచుట కెంతో మనోహరముగ నున్నవి. వీనియందుగల రంగులుగాని, మెరుగుగాని కాంతిగాని, కుట్టుపనిలోని చక్కదనముగాని కొదువలేని యందముతో గూడియున్నవి. ఇచ్చోటనున్న శాలువలు పలురీతుల కుట్టుపని చేయబడి యున్నవి. పడకమీదపరచునవి, కప్పుకొనునవి, పరిష్యను పద్ధతితో కుట్టినవి, మరియు అనేకరీతులు నిండుగకుట్టినవిగూడ కలవు. ఇవి చాల సన్నదనముగను, మిక్కిలి మృదుత్వముగను విరాజిల్లుచున్నవి. కాశ్మీరుశాలువలకు భారతదేశమునందేగాక నాగరికతకగ్రస్థానము వహించిన పరదేశము లన్నింటియందును గల నాగరిక ప్రజలచేత మిక్కిలి గౌరవముతో వాడబడు చున్నవి.

కన్నములలోనుండు ఒకవిధమైన జంతువుల రోమములతో తయారు చేయబడిన మిక్కిలి విలువైన వస్త్రములు గూడ నేయబడు చుండెను. 1.

---

1. భారతవస్త్రపరిశ్రమల చరిత్రము. 2. హిందువుల ఆధిక్యత.

ఆంగ్లేయచరిత్రకారుడగు మెకాలేపండితుడు వ్రాయుచు ఇంగ్లాండుదేశమున గల యార్క్షైరు, లిల్లుషైరు, నార్విచ్, స్పిటఫీల్డు జిల్లాలలో తయారగు యున్నిబట్టలను—ఎలిజబెత్తు కాలమునుండి రాజభవనములు నిండుగ విరాజిల్లు చుండిన ఆరాస్ శాలువలను మూర్షదాబాదు యున్నివస్త్రములు మరపునకు తెచ్చియున్నవని తేటపరచుచున్నాడు: "ఎలిజబెత్తు రాణీ కాలమునాటి రాజభవనముల కలంకారభూతము లయిన ఆరాస్ శాలువ లిప్పుడేమయినవి? ఇంగ్లీషుచేతులు చేసిన వస్త్రములనే ధరించుచు విదేశవస్త్రముల ముట్టియెరుంగని శ్రీమంతుల సంతానమయ్యును మూర్షదాబాదునుంచి వచ్చు విదేశవస్త్రములను, స్టాకింగులను ధరించి పోతక్కులాడుట సిగ్గుచేటుగాదా 1. ?" అని చక్కగా ముఖప్రీతిలేక మూర్షదాబాదు ఉన్నివస్త్రములలో గల గొప్ప తనమును, అలంకారమును, సరసమగు ధరలును, కళానైపుణ్యమును వేరు సాక్ష్యములేకనే తేటపరచినాడు.

తివాసీలు.

మం॥ వాసోఅగ్నే విశ్వరూపం సంవ్యయస్వ విభావసో ॥

(యజు. అధ్యా. ౧౧. మం. ౪౦.)

చిత్రవిచిత్రములుగల వస్త్రములను వస్త్రనిర్మాతలు వైభవముగనుండు సటుల తయారు చేయుచున్నారు.

"మహాత్వాకుథయాస్తీర్ణాం సరాష్ట్ర గృహమాలినీమ్॥"

(రామా. సుంద. సర్గ. ౨౩)

---

1. భారతవస్త్రపరిశ్రమల చరిత్రము. ౨. పే.

రావణుని గృహమునం దొకచోట సముద్ర నదీ పర్వత వనాదులతోఁగూడిన పృధివిలక్షణములు విరాజిల్లుచుండిన చిత్ర కంబళంబు పరువబడి యుండగా హనుమంతుడు గాంచి యుండెను.

"చేంబర్సు ఎన్సైక్లోపీడియా (౫౮3 పేజి)లో ప్రశస్త మయిన రంగుల మేళనముగలిగి యద్భుతముగొలుపు రత్న కంబళములు హిందువు లద్భుతముగా తయారు చేయుచున్నారని" వ్రాయబడియున్నది. 1. ఆర్. పాలిత్ గారి ఆర్థికవ్యాసములలో సుందరమైన తివాసులు ఉన్ని పట్టుతో చేయబడినవి మూర్షిదాబాద్, మిర్జాపురము, గరక్‌పూరు, బెంగుళూరు, ఏలూరు, తంజావూరు, కైరాపూరు, హైదరాబాదులలోను తయారగుచుండెనని వ్రాసియుండెను. 2. క్రీ. శ. ౧౬౭౯ సం॥ వరకు హిందూదేశమున సంచారముచేసిన "తామస్ బాకీ" గారు మచిలీబందరునందు ప్రసిద్ధిగల తివాసీలు తయారగుచున్నటుల తెలిపియున్నాడు. 3. హిందువుల యతులిత రసజ్ఞత మచిలీ బందరులో నేయు తివాసులలో గనబడునని యొక విమర్శకుడన మానింగుసతి యిట్లందుకొనెను. "తరువాత ప్రభుత్వ కారాగృహములందు బ్రిటీషువారి పరిశీలనముతో తివాసులు నేయుచు వచ్చిరిగాని వానిని గాంచిన యెడల, మనము భారతవర్షమునకు గళాధ్యాపకత్వముకై యత్నింపరాదని స్పష్టముగ దెలియగలదు.

1. హిందువుల ఆధిక్యత. ౫౭౯ పే. 2. భారత వస్త్రపరిశ్రమల చరిత్రము ౯ పే. 3. ప్రాచీనాంధ్ర నౌకా జీవనచరిత్రము.

... "హిందూదేశమున తయారగుచున్న ఉన్నికంబళులలో రత్నకంబళులు లోక విఖ్యాతిగాంచియుండెను. ఒక గజము చతురము గలిగిన వెయ్యిరూపాయల వరకు ధర కలిగియుండెను. ఇవి ౪౦౦ సం॥ వరకు మనుచుండును. ఈతివాసీలును, కాశ్మీరశాలువలును, ప్రాచీనకాలమునుండి పారశీక బాబిలోనులకును, గ్రీకురోములకును, ఇంగ్లాండు, ఫ్రాన్సులకును, నేడమెరికాకును వరుసగా నమితమైన వాణిజ్యముజరిగియుండెను. గొప్పవిలువగల రత్నకంబళులు ఆగ్రాప్రాంతమున నేటికినితయారగుచున్నవి. హిందూదేశమున ఉన్నిపరిశ్రమ హిమాచలము మొదలు కన్యాకుమారి వరకుమిక్కిలి ప్రశస్తముగా యుత్పత్తి యగుచున్నది.

మంచుదేశమునగల గొర్రెలయున్ని చాలశ్రేష్ఠతమమగుచున్నది. ఆరుమాసములు నిండని పిల్లలయొక్క ఉన్ని మిక్కిలి మృదువుగను, మెరుగుగను, అందముగను నుండును. పిల్లలపై కత్తిరించిన ఉన్నితో నేసిన కంబళులు చాల వెలగలిగియుండును. వీనికన్న హిమవత్పర్వతముమీద నుండు గొర్రెలయున్ని చాలశ్రేష్ఠముగా నుండును. అన్నిటికన్న శ్రేష్ఠమయిన యున్ని హిమవత్పర్వతముమీదను ఎక్కువగా టిబెట్టుప్రాంతమునందుండునట్టి లామాగొర్రెలనుండి వచ్చుచున్నది. ఈ యున్ని అరడుగు వరకు పొడుగు పెరుగుచుండును. లామా ఉన్ని పట్టువలె మెత్తగా నుండుటయేగాక పక్కారంగులెక్కటలోను, ఎక్కువకాలము మన్నుటలోను ప్రసిద్ధి. వాడుకొలది మెరుగుపెరిగి క్రొత్తకంబళికన్న పాతకంబళి పరిపూర్ణకళలతో వన్నెగలిగి ఒప్పారుచుండును.

# ౨౨. పట్టుపరిశ్రమ.

"తార్ప్యంవాస" (అధ. కాం ౧౮. అను ౪. సూ ౪. మం 3౦(1) పట్టువస్త్రము)

"తార్ప్యం వాసభవతి" (శత. బ్రా. ౫. 3. ౫. ౨౦(౭) పట్టువస్త్రము తయారుకాబడెను.

"పీతాంబరః" శ్రీమహావిష్ణునకు పీతాంరుడని పేరుండుటనుబట్టి అతి ప్రాచీనకాలమునందే ప్రశస్తమయిన పీతాంబరములు తయారగుచున్నవని తెలియుచున్నది.

సీ॥ చీనికలంకారి చీటికుచ్చలి॥

(హంసవింశతి. పం. ఆ ౨౯౪ ప)

పట్టుబట్టపై కలంకారీలద్దిన చీటీపావడ

" చిగిరించిపూచిన చిన్నారి లతరీతి
చిత్రపట్టాంబర గాత్రమమర ॥ (హంసవింశతి. సం. అ. 3ప)

మనోహరముగా వికసించియున్న లేత తీగలయందుండు కాయలు, పిందెలు, ఆకులు, పూలు, గుత్తులు మొదలగు రీతుల యందముతో పట్టుబట్టలపై యద్దిన అలంకారము లలరారుచుండెను.

" ఢిల్లీలో సిద్ధముచేయబడిన వెండి బంగారు సరిగె పూలు నేసిన పట్టుపుట్టములతో రోముసామ్రాజ్యపు కొలువుకూటములు ధగధగ మెరయుచుండెడివి......విలువగల సరిగె పూలంచులు జలతారల్లిన పట్టుబట్టలు" మొదలగునవి తయారు

జేయుటలో “ మిక్కిలి పురాతనకాలమునుండి హిందువులు యత్యద్భుతమయిన పరిపూర్ణత వడసిరి.” (అని చేంబరున్ విజ్ఞానసారస్వము ౫౪౩ పేజీలో వ్రాయబడి యున్నది. ) రోమీయస్త్రీలు పట్టునకెత్తుకెత్తు బంగారమిచ్చి కొనుచుండిరనియు వారికి దానిపై నంతటి మోహము ( అని బ్రిటానికా విజ్ఞానసారస్వము, వా. ౧౧. పేజీ ౭౫౯ లో గలదు.) “ భరత ఖండపు యెగుమతులలోనెల్ల మిక్కిలిమూల్యముగల ద్రవ్యము పట్టు, పారసీకసామ్రాజ్యములో దీని కెత్తుకెత్తు బంగారమిచ్చి కొనుచుండిరని ఇండియన్ మేగెజిన్. ౮౩ పేజీలోయున్నది. 1

ప్రపంచచరిత్రలో ఇంత దనుక బంగారమునకు ఎత్తుకెత్తు పట్టు బట్టలమ్మినవారు భారత శిల్పులు, భారత వాణిజ్య కర్తలుగాక మరెవ్వరునులేరు. ఇంత ప్రజ్ఞకు కారణము భారతదేశ హస్త కళలేగదా! బంగారా నాడు తులము ౧ కీ. ౧౩-౮-౧ లమ్ముచుండెను. అనగా ౯౬ గురిగింజ లెత్తు పట్టు బట్ట రు ౧౩-౮-౦ లు ఖరీదు గలిగి యున్నవి. ఇందు చేతనే ప్రపంచమునగల గ్రంథకర్తలందరు భారతదేశమునగల పారిశ్రామికుల కళానైపుణ్యము, వారి లలిత శిల్పములలోని యలంకారములు మరపురానంత గౌరవ మర్యాదలతో పొగడి యున్నారు. ౧౬ శ॥ ఇండియాకువచ్చి యుండిన “పైరార్డు” గారు వ్రాయుచు “ఇండియా నుండివచ్చు పట్టు ఖద్దరు వస్త్ర ములనే ఆఫ్రికాలోని గుడ్‌హోపు అగ్రము మొదలు చీనా వరకును జనులు ఆపాదమస్తకము ధరించుచుండిరనియు

1. హిందువుల ఆధిక్యత- ( ౫౭౬-౫౯౮ )

ఇయ్యవిమంచువలె తెల్లనై మృదువుగ నుండెననియు" దెలిపి యుండెను. 1.

క్రీ. శ. ౧౮౪౦ సం॥లో సైమూరు ప్రభువుగారి యధ్యక్షతక్రింద సమావేశమయిన కమిటీలో "లార్పెంటరు" గారి సాక్ష్యమునందు; హిందూదేశమునుండి వందనాలు మొదలగు కళాకౌశలము గల ప్రశస్తమయిన పట్టుదు కూలాంబరములు ఫ్రాన్సుదేశమునం దెక్కువ వాడబడుచున్నటుల తెలుపబడియుండెను. 2.

క్రీ. శ. ౧౮౩౯ సం॥లో ఫ్రాన్సుపట్టణమునందు ఇండియా ఇంగ్లాండు దేశముల పట్టుబట్టల విక్రయమునందు పోటీ జరిగియుండెను.

| | |
|---|---|
| భారతదేశమున చేతితో నేసిన పట్టువస్త్రములు. | పౌ ౧౬౮౫౦౦ |
| ఇంగ్లాండు దేశమున మిల్లుతో నేయబడినవి | పౌ ౫౫౦౦ |
| భారతదేశపు పట్టుబట్టల హెచ్చుఅమ్మకము | ౧౬౩౦౦౦ |

ఇంతులకు కారణము శ్రేష్ఠతరముగానుండుట, ధరసరసముగా నుండుట, చూచుటకు మిక్కిలియందముగానుండుట, వాడుకలో ఎక్కువకాలము మనుట మొదలగు కారణములని తెలియనగును.

౧౮౬౧ సం॥ డిశంబరు నెల కలత్తా రెవ్యూలో ఇట్లు వ్రాయబడియున్నది. "హిందువుల నేతపనులు లోకమంతట ప్రసిద్ధికాంచెను. హిందువులు పట్టు నేత ఎంతకాలమునుండి యెరుగుదురో పరిగణించుట అశక్యము. హిందూజాతితో

---

1. రాటము మగ్గము. ౨౭ పే. 2. భారత వస్త్రపరిశ్రమల చరిత్రము ౩౬ పే.

సమానమయిన బుద్ధిశాలురజాతి యింకొక్కటి లేదని యవన గ్రంథకర్తలు దెలుపుచున్నారు. 1.

మన మీనాడు బొంబైమీాజయములో మూడోయం తస్తునందు ప్రశస్తమయిన ప్రాచీన పట్టుబట్టలను గాంచగలము. అందు శివాజిధరించిన అంగీ (పేరువాణి) నానాఫరన్ వసు నాటి పట్టుతివాసీలు, పట్టులో జరీచేర్చిన తివాసీలు, పట్టుపరుపులు, దిండ్లు, సాతారారాజులు రాణులు ధరించిన పట్టువస్త్ర రాజములుగలవు. మరియు ఎందరో రాజుల వస్త్రములను గూడ గాంచనగును. మదరాసు చిత్రవస్తు దర్శనశాల యందొక పట్టుతివాసీ విరాజిల్లుచున్నది. వీనిని ప్రత్యక్షమునగాంచినపుడు ప్రాచీన భారతదేశమునందుగల పట్టు పరిశ్రమయొక్క కళాకౌశలమెంతో నానందముగా కనుల పండువగు చున్నది. క్రీ. శ. ౧౬౧౫ సం॥ లో సర్ థామస్ దొరగారు జహంగీరు దర్బారును దర్శించియుండెను. అప్పు డీ దర్బారు రెండెకరముల విస్తీర్ణముగలిగి పట్టుతివాసీలచేత కప్పబడియుండెను. ముఖ్యమయిన ఆసనములకు ముత్యములు రత్నములు కూర్చిన పట్టుపరుపు లమర్పబడియుండె న”ని తెలిపియున్నాడు. 2.

ఇమ్మడిదేవరాయల సింహాసనముమీాద మూడువరుసల ముత్తెపుసరులు అంచుగా కుట్టబడినట్టి పసుపుపచ్చని చీనా పట్టుతో చేయబడిన తల్పముగలదు. ఆ ముత్యములసొరును కాంతియు నద్భుతముగనుండెను. అట్టివాటిని నేనెచ్చటను జూచియుండలేదు......... రాయలు దసరాయుత్సవములకు

1. హిందువుల ఆధిక్యత 2. మహమ్మదీయ మహాయుగము

యమర్పబడిన బంగారు మందిరమునందుగల సింహాసనము మీాదనున్న బంగరు జరీనగిషీ, అంచులు, లతలు, పుష్పములు అల్లిన నాల్గుముఖమలు పట్టుసోఫాలు గలవు. 1. అని అబ్దుల్ రజాకు దెలిపియుండెను. ధర్మరాజు రాజసూయయాగమునకు వచ్చియుండిన కానుకలలో "సౌవర్ణకీటజపట్టజాండశయ్యలు" 2. చీనాంబర హంసతూలికా తల్పములుగూడ కలవు?

పట్టుతివాసీలు, పట్టుపరుపులు, హంసయీాకలచే కుట్టిన హంసతూలికా తల్పములు, బంగారు వెండిజరీలతోను ముత్య ములతోను రత్నములతోను లలితకళాకౌశలముల తీర్చి యుట్టి పడునట్టుల కుట్టుట భారతకళా సాంప్రదాయములందు ప్రాచీన కాలమునుండియు గలదు. వీనికొఱకు లక్షలరూపాయలు ఖర్చు పెట్టి తయారుచేయించుకొని తమయౌన్నత్యమునకు తగురీతి యుండునట్టుల వాడుకొను, సంపన్నులు, సార్వభౌములానాడు మిక్కిలిగా యుండిరి.

## ౨3. ప్రత్తిపరిశ్రమ.

ప్రత్తిపరిశ్రమ తొలుదొల్త భారతదేశమునందు ప్రారంభమై యుండెను. ప్రపంచమందుగల దేశములన్నియు ప్రత్తి వస్త్రములకొఱకు భారతదేశమును నెదురుచూచుచున్న కాలము

1. విదేశయాత్రికులు, ప్రాచీనాంధ్రదేశము.
2. భారతము సభాపర్వము ద్వి. ఆ. ౧౧3

గూడ ఒకప్పుడుండియుండెను. భారతనారీమణులు చేతితో తీయబడినంత సూక్ష్మతంతువును మిల్లులమీదగాని, పరదేశ వాసులుగాని ఇంతదనుక తీసియుండలేదు. మరియు ఇంకెన్నటికిని తీయజాలరనిగూడ దెలుపవచ్చును.

"కార్పాసము పవీతార్థం నిర్మితం బ్రహ్మణాపురా"1.
(ఔశవస్మృతి. ప్ర. అ. ౨౨పే)

పూర్వకాలమునందు పవీతముకొఱకు బ్రహ్మ ప్రత్తిని పుట్టించెను.

"కార్పాసకైః పటైః"(రామా. సుం. స. ౫3. ౬
ప్రత్తితో నేయబడిన వస్త్రములు.)

భారతమున సభాపర్వములో యుధిష్ఠర చక్రవర్తికి వచ్చినకానుకలలో కర్ణాటచోళ పాండ్యరాజులు ప్రత్తివస్త్రములకు అపరంజి జరీలునింపి తెచ్చియుండిరి. 2.

ప్రాచీనకాలమునుండి యున్న భారతదేశగ్రామ జీవనము పరిశీలించితిమేని వడకుట నేయుట ప్రతి గృహమునందును నవలంభింప బడుచుండినట్టుల దృష్టాంతములు చాల కనుగొనగలము.

కృషీవలులు తీరికెదినములందు తమకు గావలసిన నూలు వడికి వస్త్రముగా నేసుకొనుట కలవాటుపడి యుండిరి. ౧౬ శ॥ వరకు భారతదేశమున నాగలి, కవ్వము, రాటము లేని కుటుంబము లానాడు కాన రాకుండెను. మగ్గము ప్రధాన వృత్తిగాయున్న వస్త్ర నిర్మాత లధికముగా గలరు.

1. నేతపరిశ్రమ. ౯౬ పే. 2. రాటము మగ్గము. ౮ పే.

మిక్కిలి సన్నని నూలు దీసి దుకూలాంబరములునేయు వస్త్ర నిర్మాతల సంఖ్య గూడ చాల ఎక్కువగా యుండెను. సన్నని నూలుదీయు హరిజనులసంఖ్య మిక్కిలిగానే కానవచ్చుచున్నది. సంహితలును, బ్రాహ్మణములును వెలువడిన కాలమునందే వస్త్ర నిర్మాతలు శ్రేణు లేర్పరచుకొనియున్నట్లు గన్పట్టుచున్నది. శ్రేణుల నాయకులు రాజులకు మిత్రులుగను, ఆలోచన సభ్యులుగ నుండెడివారు. ప్రత్యేక వాణిజ్య సంఘములవల్ల వీరి వ్యాపారము జరుగుచున్నట్టుల కేంబ్రిడ్జిలో ప్రకటించిన హిందూదేశ చరిత్ర వలన తెలియుచున్నది. "దక్షిణ హిందూదేశములోగల వస్త్ర నిర్మాతలు గొప్ప మోతుబరీ తనము; పరపతియును గలిగి బ్యాంకులు పరిగణింపబడి వానిలో జనులు తమ ధనమును నమ్మకముతో దాచుకొనుచుండిరి. కొన్ని బౌద్ధశాసనములబట్టి రాజులు సహితము తమ ధనమును నేతకాండ్ర శ్రేణులలో నిలువ జేయుచుండినట్లు తెలియుచున్నది. బౌద్ధజాతక కథలలో అకాలమున వస్త్రనిర్మాతల సంఘములున్నట్లును వారిలోని యుద్యోగులు, ప్రముఖుడు, జ్యేష్ఠుడు, శ్రేష్ఠి, భాండాగారికుడు నని పిలువబడు చుండెను." 1. ఇవ్విధముగా భారతదేశమునందంతటను పాకుకొని యున్న రాటము మగ్గము దేశమునకు పునాదియై సకలసంపద లొనగూర్చుచు ప్రత్యక్షపు కామధేనువు, కల్పవృక్షము చందమున విరాజిల్లుచుండెను. అందుచేతనే ప్రజలు మగ్గమును, రాట్నమును,

---

1. రాటము—మగ్గము. గా. పే.

కవ్వమును లక్ష్మీదేవతవలె ప్రేమించి పూజించు చున్నారు. నిజముగా రాటము, మగ్గము, కవ్వము ప్రాచీనకాలమునుండి భారతదేశమున కొనగూర్చిన సంపదనుగూర్చి నేటికిని దానిపై యాధారపడియున్న నిరుపేదలకే గాక పరులకు తెలియరాదు! గనుకనే వారంతటి ప్రేమతో పూజించి యానందింతురు.

"త్వం సోమపణిభ్యః వసుగవ్యాని ధారయః" 1.

(ఋ. అ ౬. అ ౮. వ ౧౪. మం ౯. సూ ౨౨. మం ౭.)

ఓ సోముడా! ఋణదాతయొద్ద ధనమును గోవులను ఆధారముగా తీసుకొంటివిగదా! ఎట్లు తీర్పగలవు.

"తతంతంతు మచిక్రదః" 2.

(ఋ. అ ౬. అ ౮. వ ౧౪. మం ౯. సూ ౨౨. మం ౭.)

గానముచేయు సాధనచేత నూలును వ్యాపింపజేసి తీర్చెదను.

"తంతునారాయస్పోషేణ" 3.

"రాయస్పోషంజన్య" (యజు. అ ౧౫. మం ౭)

సంపత్తిని వృద్ధిచేయు నూలుపనిచేయుడు. తంతువృత్తి ధనవంతుని గూడ చేయగలదు.

నిరుపేదలపాలిటి కల్పతరువువంటి రాట్నముయొక్క మహిమ వేదములందుగూడ వినబడుచున్నందున వేదకాలము నాటి యార్యులు మొదలు ౧౮౯౦ సం॥ నాటివరకు భారత దేశమునందు రాటముయొక్క గానము, రాటముయొక్క యాదాయము ననుభవించుచునేయున్నారు. ౧౯౨౦ సం॥లో

1. 2. 3. వైదికసభ్యత.

భారతదేశమునగల ఆర్థికదుస్థితిని సహింపలేక ఖద్దరును పున
రుద్ధరించి దేశ దారిద్ర్యమునుబాప ప్రయత్నముసాగియుండెను.
పునరుద్ధరించునాటికి కింకను భారతదేశమునం దంతటను వేల
రాట్నము లమలులో యుండియున్నవి. రాట్నపునూలుతో
నేసిన బట్టలలోని మృదుత్వము, మన్నిక, కాలానుగుణముగా
సమత్వతజూపు విధానముల నెరిగినవారుమాత్రము వీడలేక
మరువజాలక ప్రియమని తలంపక వాడుచునేయున్నారు. ఇవ్వి
ధముగా మారుకోసీమలందును, కొండపల్లెలందును సామావ
సిష్టమై చావలేకయున్న ఖద్దరు పరిశ్రమ ౧౯౨౦ సం॥ నుండి
క్రమాభివృద్ధి పొందెను.

విశాఖపట్టణంజిల్లా కైలాసపట్టణమువద్ద రాట్నాలపల్లె
యను పేరుతో నొక పల్లె ప్రాచీనకాలమునుండి విరాజిల్లు
చుండెను. ఈ పల్లెయందు రాట్నము వడకని స్త్రీ కానరాదు.
గంజాముజిల్లా యందుగల పట్టుశాలీయుల స్త్రీలు, ఆడుబిడ్డలు
౧౫౦ నెంబరు వరకు శ్రేష్ఠతరమగు సన్ననినూలు తీయు
చున్నారు. ఈ సంఘమునందు రాట్నమువడకని స్త్రీ కాన
రాకున్నది. పసిపిల్లలు సహితము మిక్కిలి చక్కగ తీయు
చున్నారు. ఈ నూలును వీరి మగవారే రవసెల్లాలు నేయు
చున్నారు. అతి ప్రాచీనకాలము నుండియు ఈ సంఘమున
సున్నితమగు నూలుదీయు వాడుక గలిగియున్నది. ఆంధ్రదేశ
మున పయిడిప్రత్తివారు, పింజలవారు, ఏకులవారును ఇంటి
పేర్లున్నవారెందరోగలరు. గ్రామములలో ప్రత్తిపాడు, దూదే
కులపల్లె, చీరాల (చీర=వస్త్రము — ఆల=గ్రామము) సేలము

(సేల=వస్త్రము) ఇట్టి వస్త్రసాంప్రదాయములుగల పేర్లెన్నియో గలవు.

భారతదేశమునగల రాట్నముయొక్క శక్తి మగ్గపు మహిమ వర్ణింపవలెనన్న వెయ్యిశిరముల యాదిశేషునకైనా యలవిగాదని తలంపవలెను. విదేశీవస్త్రములను స్వదేశీ మిల్లులను ౧౦౦ సం॥ల నుండి ఎదుర్కొనుచు ఉన్నంతవరకు సురక్షితముగనే కానవచ్చుచున్నది. సంపూర్ణనాశనము చేయుట కెవరికిని యలవికాలేదు. పునరుద్ధరించునాటికి ఖద్దరుతోగూడిన విషయములన్నియు మచ్చునకు గానవచ్చియే యుండెను. ౧౯౨౩సం॥ డిశంబరునెలలో జరిగిన కలకత్తా స్వదేశీ ప్రదర్శనశాలకు ఢక్కానుండి కె. కె. జి. బెసాల్ బ్రదర్సు వారంపిన మజ్లీను ౧౦ గ. పొడవు తూకము ౫ తు. ఖరీదు ౧౨౦౦ రు. గలిగియుండెను. బాబు గోపినాథ నాగదాసు ఢక్కావారంపిన మజ్లీను ౧౦ గ. పొ. తూకము ౬-౮-౦ తు. ఖరీదు ౯౭౦-౦-౦ రు. గలిగియుండెను. ఆర ణిలో ౪౦౦ నెం. వరకు రాటపు మూలనూలుగలదు. బొంబాయి మీజయమునందు మరాటారాజులనాటి ప్రశస్తములయిన రవశెల్లాలు గలవు. వాటియందనేక రీతుల జరీపని చేసిన మేలి ముసుగులను జూడగలము. కడపజిల్లాలో ౨౪౦ తు. తూగు ౨౪ మూరల చీరెలను గాంచగలము. ఒక గజము గుడ్డ ౧౦ తులములు మొదలు; ౮ అణాల ఎత్తు తూగు వస్త్రరాజముల నిదర్శనములున్న భారతదేశమునందు

శుద్ధఖద్దరు నసింపలేదనియు, నసింపదనియు ఘంటాపదముగ తెలుప వచ్చును.

"బట్టల యంత్రాలయ పరిశ్రమ నూరేండ్లనుండియును క్రమాభివృద్ధిని బొందుచున్నను రాటపు పరిశ్రమను సంపూర్ణముగ నాశనము చేయజాలక పోయినది. పొందూరు, బొంతల కోడూరు, మెలియాపట్టి, పల్నాడు, తుని, కైలాసపట్టణము, ఆత్మకూరు మొదలగు స్థలములందు శతాబ్దములనుండియును సజీవమైయున్న రాట్నము మగ్గముల పరిశ్రమ దాని ప్రయోజనమును చెప్పక చెప్పుచున్నది. అక్కడి స్త్రీలు ౮౦—౧౨౦ నంబరు నూలును నత్యద్భుతమైన నైపుణ్యముతో వడకుచున్నారు. ఆనూలు సాపునకును పురికి నంబరునకును అనేక ప్రదర్శనములందు బంగారు పతకములను బడసినది. ఆ నూలుతో నేసిన సన్న బట్టలు నాలుగైదేండ్లు మనుచున్నవి. ఖద్దరు ఉద్యమమారంభమైన తరువాతను నాలుగైదేండ్లలోన యుద్యమమభివృద్ధిని బొందిన విధము సంశయాత్ములకును సంశయ విచ్ఛేదమును కలుగచేయుచున్నది. అని దే. కా. నాగేశ్వరరావుపంతులుగారు దెలుపుచున్నారు). 1.

---

1. సమదర్శినీ సంచిక ౧౯-౨౮-౨౯. సం॥ ఖద్దరు ఉద్యమము అను వ్యాసమునుండి.

# ౨౪. రంగుల పరిశ్రమ.

"తంతుతన్వన్ రజశోభానుమన్విహి". 1.
(ఋ. అ౮. అ౧. వర్గ౧౬. మండ౧౦. సూ౫౩. మం౬.)
నూలు వడకిదానిమీాద రంగునెక్కించుడు.
"పిశంగద్రాపిం ప్రతిముంచతేకవిః". 2.
(ఋ. అధ్యా౩. అష్ట౮. వర్గ౬. మండ౪. సూక్త౫౩. మం౨)

కపిలరంగుగల శాలువను కవి విడచుచున్నాడు. పీత వన్నె, (పీతాంబరము) కపిలవన్నె, గోరోచనపువన్నె, కావి వన్నె, చంద్రికపూవువన్నె, కుసుమపూవువన్నె మొదలగు పేర్లన్నియు పీతవన్నెకు పిలువబడుచుండును.

ప్రకాశవంతమగు రంగులు సూర్యకిరణములందుగలవు. ఈ కిరణములకు సప్తాశ్వః, సప్తగవాం, సప్తమయూంఖాయని వేదములందు పిలువబడియుండెను. నీలి, వూదా, లేతవూదా, (మబ్బుచాయ) ఆకుపచ్చ, ఎరుపు, పసుపు, పింగళివర్ణముగలసి ఏడురంగులు సూర్యకిరణములందుగలవు. ఇందు ఒక్కొక్క రంగులో ఏడు ఉపరంగులుండుటచేత ౪౯ ఉపరంగులతోకలసి ౫౬ రంగులు ప్రాచీనకాలమునందు వాడుకలోయుండెను.

తొగరుచాయ.

క॥ అచ్చట నచ్చట నిడుపుగ
విచ్చిన గుసుమాస్త్ర శాస్త్ర వేదుల మనముల్

---

1. 2. వైదిక సభ్యత.

మెచ్చించు దెరలమంజిడి
పచ్చడములు చతురశీతి బంధంబులతోఁ॥
(శృం. నై, వి. సౌ. ౧౫౫ ప)

ఈ పద్యమునగల చిత్రితవస్త్రమును మంజిడియని పిలువబడినది.

మంజిడి = మాంజిష్టతత్సమము.
మాంజిష్ట = చిరివేరు, మదారుచెక్క.

చిరివేరు మదారుచెక్కలతో తొగరు (ఎరుపు) మామిడిచిగురు తొగరు, రోజాచాయలు వేయవచ్చును. ప్రత్తికట్టె బూడిదెగాని, ఆముదపుపొట్టు బూడిదెగాని నీటి యందు మూడుదినములు మురిగించి అందు ఆముదము గొఱ్ఱె పెంట కలిపి నూలుగాని, వస్త్రముగాని మూడుదినములు నాన నిచ్చి ఎండవేసి శుభ్రముగా నీళ్ళలోజాడించినకారము తీర్చినట్లగును. అంతట చిరివేరుపొడి నీటిలోకలిపి పబ్బాకు పొడిగాని అల్లాకుపొడిగాని దానితోచేర్చి కారముతీర్చినవానిని చక్కగా తడిపి చింతాకు తుమ్మాకునువేసి ఉడకనిచ్చిన చక్కని పక్కా తొగరురంగు వచ్చును.

అలెగ్జాండరు పారసీకదేశమును జయించి రాజభవనమును జూడబోయెను. ఆ మందిరమునందు ౧౨౦ సం॥ క్రింద హిందూదేశమునుండి వచ్చియున్న నల్లవాగుడు తొగరువలువలను గాంచి ఆశ్చర్యము జెందెను.

జర్మనీదేశమునందు తయారగుచున్న "అలిజరీను" అను పీపారంగు లేక తొగరుచాయ వేయు ద్రావకము

మదారుచెక్కతో తయారు చేయబడుచున్నది. ఈరంగు భారత దేశమునం దడుగిడిన తరువాత భారతదేశమునందు గల చిరి వేరు యుత్పత్తి క్రమక్రమముగా క్షీణించిపోయెను. ౧౯౧౪ సం॥ ఐరోపా సంగ్రామము ప్రారంభముకాగా జర్మనీనుండి అలి జరీను దిగుమతి పూర్తిగ నసించెను. ఆ కారణముచేత భారత దేశమునందు రు ౬౦/లు. విక్రయింప బడుచున్న అలిజరీను పీపా రు ౧౬౦౦/లు. విక్రయింపబడెను. ఆ కాలమున గల భారతదేశములోని ఈ రంగువ్యాపారులలో సామాన్యులు లక్షాధికారులుగను, లక్షాధికారులు కోటీశ్వరులుగను మారి యున్నారు. ఒకప్పుడు ప్రపంచమంతటికిని రంగు లెగుమతి చేయుచుండిన భారతదేశము, దేశమునిండా మదారుచెక్క పంటగల భారతదేశము ఎలిజరీను రంగును గ్రహింపలేక పోవుట ఆశ్చర్యకరమగు చున్నది.

## నీ లి చా య

బాణుడు కాదంబరి విరహాజ్వర మనుభవించునపుడు "ప్రచ్ఛద నీలాంసుకము" పడకపై పరచినట్లు వర్ణించియుండెను. ఈ రంగు నీలిరంగుతో నద్దుచుందురు. చవిటిమట్టి, తంటెపవిత్తులు సున్నము, నీలిరంగులతో ఈ చాయ నద్దుచున్నారు. నీలి రంగువల్ల—నీలి, ఉదా, లేతవూదా, ఆకుపచ్చచాయ లద్ద వచ్చును.

## నీ లి ఆ కు

నీలాకు పండ్లతీపులకు తోముచుందురు. నీలిచెట్లవేళ్లు కషాయముకాచి ఉడుకువ్యాధులకు వాడుచుందురు. నీలిమందు

మూత్రబంధనవేళ చాది బొడ్డువద్ద పట్టువేసిన యెడల ధారాళ ముగా మూత్రవిసర్జనయగును. నీలిరంగద్దిన గుడ్డ కంటిజబ్బులకు కట్టుదురు. పుష్పజాతిలో నూతనవిధానముగా పెంచునపుడెండకు మొక్కలు వాడకుండుటకుగాను నీలిగుడ్డలను కట్టుచుందురు. ఇవ్విధముగా నీలిరంగద్దిన గుడ్డలు, నీలిరంగు, నీలిచెట్టు ఆరోగ్యవిధానముగా లోకమునకు సహాకారమగుచున్నది.

ఈజిప్టుదేశమునగల పెరిమరీలను ప్రాచీనకాలమునాటి గోరీలకు పూతపూయుటకుగాను నీలిరంగు చింతచెక్క వేల సంవత్సరములక్రిందనె భారతదేశమునుండి ఎగుమతి యగుచుండెను. పాలస్తీనురాజులు సాలమనుకుపూర్వమె నీలి వూదా రంగులద్దిన భారతదేశపు దుకూలాంబరములను ప్రేమతో ధరించుచుండెడివారు. పాండ్యదేశములో ప్రశస్తమయిన ఇంద్ర నీలమణివలె నున్ననై సొఫైన నల్లని దుకూలము ఉత్పత్తి యగుచుండెనని కౌటిల్యు డర్థశాస్త్రమున వ్రాసియుండెను. నీలిమందు భరతఖండమునుండి రోముదేశమున కేగుచుండెడి దనియు దాని యుపయోగముగూడ రోమీయులు భారతీయులవద్ద నేర్చిరని "చేంబర్సు విజ్ఞానసార స్వము ౫ వాల్యూం ౫౫౭ పేజీలోకలదు. ఇండియాదేశమునుండి నీలిమందు కొని పోయి పరదేశవాసుల కమ్ముటచేత పోర్తుగీసువారు ఐరోపా ఖండములోకెల్ల సంపదకలిగి పేరుప్రతిష్టలు గలిగియుండిరి. ఈ నీలిమందు వ్యాపారము డచ్చివారి స్వాధీనముకాగానే పోర్తుగీసువారిప్రభ అడుగంటిపోయెను.

క్రీ. శ. ౧౮౫౭ సం॥లో ౮౦ తులముల నీలిమందు రు ౨౭-౦-౦ లు ఖరీదునకు విక్రయింపబడియుండెను. ఇంతటి విలువతో కోట్లకొలది రూపాయల నీలిమందు పరదేశముల కెగుమతి యగుచుండెను. భారతదేశమున కడపటికాలపు నీలిమందుపంట

| | | | |
|---|---|---|---|
| ౧౮౯౭ సం॥ | ఎకరముల పంట | | ౧౦౦౦౦౦౦ |
| ౧౯౦౧—౨ సం॥ | | పంట | ౭౯౧౦౦౦ |
| ౧౯౧౧—౧౨ సం॥ | | పంట | ౨౭౧౦౦౦ |

ఐరోపా యుద్ధకాలమునందును దదనంతరము గల ధరలు.

౧౯౧౬ సం॥ మ ౧ కి. రు ౧౩౫ మొదలు ౧౫౦ రు వరకు
౧౯౧౭ సం॥ మ ౧ కి. రు ౩౫ వరకు తగ్గినది.
౧౯౩౫ సం॥ మ ౧ కి. రు ౨౫ ధరమాత్రము గలదు.

లక్షలకొలది ఎకరములమీద పండించిన కోట్లకొలది రూపాయల నీలిమందు హిందూదేశమునందును పరదేశములందును వాడబడుచుండెను. అట్టి నీలిమందు వ్యాపారము ౨౦ సం॥ల లోపల పూర్తిగ నీరసించినది. గాని నేటికిని నీలిపంటవేసి మందు తయారుచేసి కొద్దికొద్దిగా పరదేశముల కెగుమతి చేయబడుచున్నది. నీలిమందు తయారుచేయు తొట్లు భారతదేశ మంతటను చెక్కుచెదరక కానవచ్చుచునే యున్నవి.

## ఇతర రంగులు.

పున్నాగకాయల చుట్టునుండు పొడివల్ల కపిలరంగు, కుసుంబగింజలచేత రోజారంగు, నల్లమద్దితాట, పచ్చపువ్వుల గోరింతాకుతో పసుపురంగు, ఒంద్రుచుట్టినిమురిగించి నల్లరంగు,

ఎఱ్ఱమట్టితో కాయరంగు మొదలగు వాటితో మిక్కిలి పక్కా రంగులుగూడ ప్రకాశమానముగనుండునట్లు లద్దుచుండెడివారు. ఇంతేగాక ఎన్నోవిధములయిన ఆకులరసములు, పళ్లరసములు గూడ రంగులద్దుట కుపయోగపడుచుండెడివి.

## అద్దకములు.

౧ చిల్లు లద్దకము = కలంకారీలు

౨ కిష్‌కలంకారి = రెండుప్రక్కల రెండు రంగుల లత లద్దకము

3 దిమ్మలద్దకము = కాలికోలు, చీటీలు

౪ కట్లద్దకము = చుక్కచీరెలు

౫ తళుకద్దకము = వెండి, బంగారు, అబ్బరకము మొదలగు చూర్ణములతోను, రేకులతోను యద్దునవి.

సుఫీరంజీలు, సాసరిగన్లు, పాలంపూరులు, చూనారీలు, కోటాసంస్థానపుచూనారీలు, కాలికోలు, ముద్రణసరకు, చీటీగుడ్డలు, వందినాలు, బందనాలు మొదలగు నామములతో పిలువబడు చుండును.

## పాలంపూరులు.

పాలంగ్=మంచము, ఉర్దూ

పోష్=దుప్పటి, పారశీకము

పాలంగ్ పోష్=పాలంపోష్

పాలంపోష్=పాలంపూరు

పాలంపూరు=పల్యంకపోషణము

పల్యంకపోషణము=పల్లకి మేనాపైపరచు అలంకార వస్త్రము

౧౮౮౬ సం॥ లండను ప్రదర్శనమున ప్రదర్శింపబడి విక్రయింపబడిన భారతదేశపు పాలంపూరులు.

బందరుపాలంపూరు.

౬ గజముల చతురముగల బందరుపాలంపూరు ౬౦రూపాయలకు విక్రయింపబడెను. 1.

కాళహస్త్రిపాలంపూరు,

౨ గజముల చతురముగల కాళహస్త్రిపాలంపూరు 3½ రూ/లకు విక్రయింపబడెను. 2.

పాలకొల్లు బంగారు పాలంపూరు.

బంగారు టద్దములుగల పాలకొల్లు పాలంపూరు ౨గజములు చతురముగలది రు 300 లకు విక్రయింపబడెను. మరొకటి ౨ గజముల చతురముగలది. రు ౧౮3 లకు విక్రయింపబడెను. 3.

మద్రాసు చిత్ర వస్తు దర్శనశాల.

మద్రాసు చిత్ర వస్తు దర్శనశాలయందు బంగారు టద్దకములుగల పాలకొల్లు పాలంపూరు గలదు. ఇంతేగాక నాగపట్టణం, జమ్ములమడుగు, కాళహస్త్రి, పొన్నేరి, గొల్లపాలెము లందద్దిన పాలంపూరులుగూడ యున్నవి. భారతీయకలంకారీ శిల్పుల లలితకళాకౌశలమును వెదజల్లుచు వస్తుదర్శనశాలకీ పాలంపూరు లెంతో శోభ గూర్చుచున్నవి.

---

1. 2. 3. ఆంధ్రవిజ్ఞానసారస్వము. అద్దకము.

## పాలకొల్లు.

పాలకొల్లు నగరము వలందావారు వాణిజ్యము సాగించిన ప్రదేశము. అందుచేత వారికి గావలసిన కలంకారీ లక్కడనే తయారు చేయించుచుండెడివారు. బంగారు టద్దకము లద్దువారిలో కడపటి శిల్పియగు "విన్నకోట రంగనాయకులు, ఆదినారాయణ" గార్లు నగర వాసులయియున్నారు. ౧౮౮౬ సం॥లో లండను ప్రదర్శనమున విక్రయింపబడిన బంగారు టద్దకములుగల రెండు పాలంపూరులు, మద్రాసు వస్తు దర్శనశాలయందున్న బంగారద్దకపు పాలంపూరున్న ఈమహా శిల్పు లద్దియున్నారు. వీరి కళాకౌశలమునగల మన్నికచూడ ఆశ్చర్యమును గొలుపుచున్నది. వీరద్దిన బంగారు రేకులు చలువ చేయు కొలది కళాయి పూసినట్టు లతికి యుండును. పాలకొల్లు నందుగల కలంకారీ పరిశ్రమను "కారీఖానా" అని పిలచు వాడుక గలదు.

కారీఖానా = వ్రాతగది

కారీఖానా = కార్ఖాన

అని పరభాషాపదములు వాడుకయందుండెను. దేశమునందు నేటికిని కార్ఖానాపదము వాడబడుచున్నది.

## చిత్రావుగట్టు.

కలముతో చిత్రితపని చేయు కార్ఖానాల వారి కొఱకు పాలకొల్లునగర సమీపమున ౨౦౦ సం॥ క్రింద డచ్చివారిచేత చిత్రావుగట్టుయను నీటినిలయ మొకటి ఒసంగబడెను. ఈ నిలయము ౧౨ డెకరముల విస్తీర్ణము గలిగియున్నది. నేటికిని

వాడుకయందు వీరికి సర్వభుక్తములు గలిగియున్నది. ఇచ్చోట జరిగిన ప్రశస్థమగు కలంకారీపాలంపూరుల చిత్రితపనియొక్క కళాప్రాగల్భ్య నిదర్శనమై యలరారుచున్నది.

## మచిలీబందరు.

ప్రపంచ విఖ్యాతిగాంచిన మచిలీబందరు కలంకారీలను గూర్చి వ్రాసిన నిదర్శనము లెన్నియో విరాజిల్లుచున్నవి. సమస్తనాగరిక పరదేశములందును బందరు కలంకారీ లెరుగని సంపన్నుల కుటుంబములుగాని, గౌరవ మర్యాదలుగల గృహస్థులుగాని యుండుటరుదు. సొగసుగోరు ప్రతిమానవజీవియు బందరు కలంకారీలు కోరి ధరించుచుండును.

క్రీ. శ. ౧౬౭౯ సం॥ మొదలు ౭౯ వరకు హిందూదేశమున సంచారముచేసియుండిన "తామస్ బౌరీ"గారీ క్రింది విషయములకు మచిలీ బందరునుగూర్చి వ్రాసియుండెను. ఇచ్చోట చీటీగుడ్డలు సున్నితములైన అద్దకపుగుడ్డలు చాల ప్రసిద్ధిగా తయారగుచుండెను. విశేషముగా చీనామొదలుకొని ఇంగ్లాండువరకుగల దేశముల కెగుమతి చేయబడుచుండెను. ఇచ్చటఅద్దకపుగుడ్డలు కలంకారీగుడ్డలులురంగుతగ్గిపోక,యుతికిన కొలది మఱింత యందముగ నుండుటచేత వీనికి బర్మాయందును, ప్రాగ్ద్వీపములందును, పారశిక సింధుశాఖ ప్రాంతములందును విశేష మమ్మకముండెను. 1. "ఇచ్చట పిల్లలు సహితము చక్కగయద్దకపుపనులు చేయగలరని "డాక్టరు ఫయరు" శ్లాఘించుచున్నాడు."

1. ప్రాచీనాంధ్ర నౌకా జీవనచరిత్రము.

## రంగులకు ఓషధులు.

మోదుగపువ్వు పతంగిచెక్క, రేవలచిన్ని, దానిమ్మ తోళకలు, మదారచెక్క, చిరివేరు, తామ్రవల్లివేరు, వేపలచెక్క, తాండ్రకాయలు, కరక్కాయలు, బాదముచెక్క, నిమరిచెక్క, పిస్తాపూలు, నందివర్ధనాలు, మోదుగ పువ్వులు, పారిజాతపూవుల తొడిమెలు, తంటుపిత్తులు జాబురాయి, జెముడుకాడలు, ముండ్లగజ్జెరు, ఉత్తరేణి, తుమ్మచెక్క, తుమ్మాకు, చింతాకు, పబ్బాకు, అల్లాకు, చింతపండు మంచినూనె, ఆముదము, ఇనుము, మొదలగువాటిచేత రంగులద్దు చుందురు.

"ఓషధులలోనుండి రంగులకుపయోగించు పదార్థముల దీసి వానిని ప్రాణవాయువుతో సమ్మేళనము చేసి వానితో జేరియుండు నితరపదార్థములనుండి యవి విడి యడుగుకు దిగునట్లుజేయు సాధనములను ఎన్నోవేల యేండ్ల క్రితమే కనిపెట్టినవారని భరతఖండవాసులను శాక్రాప్టు పొగడుచున్నాడు. మిల్లుసహా తనయొక్క ఇండియా యను చరిత్ర (వాల్యూం ౧౧, పే ౨౧.) లో ఇట్లనక తప్పదయ్యె. "హిందువులకళాకౌశలములలో రంగులద్దకమును, బొమ్మలద్దకమును ప్రసిద్ధిపడసినవి. వారద్దెడి రంగులయందము, దీప్తి, మన్నిక ముఖ్యముగస్తుత్యార్హములు." "భారతీయుల రంగులు ప్రపంచములోనున్న యన్నిటికంటె నెక్కువ కాంతిగలవని విద్వాంసుడగు కెన్నిటను అంగీకరించెను. ఓషధులనుండిరంగుల తీయు విద్యను బ్రప్రథమున గనిపెట్టినది హిందూజాతి. ఇతర

దేశములలో కొన్ని మొక్కలకు వచ్చిన పేళ్లిందు సాక్ష్యము నీలిమందుకు; ఇండి'యా దేశభవమగుటచే ఇండిగోయను పేరు వచ్చినది. " ప్లైనీ " ఇండికోయని వ్రాసెడివాడు. 1.

## చలువచేయుట.

వస్త్రమునకు రంగులద్దుటలోనేగాక తెల్లగ చలువ చేయుటలోగూడ భారతీయులు చాల ప్రసిద్ధిగలిగియుండిరి. పరదేశములందు ప్రత్తిపరిశ్రమ లేనందున చలువచేయుట ౨౦౦ సం॥ క్రిందవరకు తెలియకలేకుండెను. చలువచేయుటకు గేదె పేడను నీటియందు కలపి వస్త్రమును కొద్దికాల మూర నిచ్చి నీటియందు పరచుదురు. అందుచేత తెల్లగచలువయగును. నీటియందు నాచుయుండిన చాలశ్రేష్ఠముగా నుండును. నీరు లేనిచోట భూమిపైపరచి ఎండకు వస్త్రముపై జలమూరకుండు నటుల నీరును చల్లుచుండుట వల్ల చలువ యగుచుండును.

మం॥ విశ్వంప్రతీచీ సప్రదాఉదస్థాద్రుశద్వాసోబిభ్రతీ
శుక్రమశ్వైత్ హిరణ్యవర్ణాసుదృశీకసన్దృగ్గవాం
మాతానేత్రాహ్నామరోచి ॥

(ఋ. అ ౫. వ ౨౬. మ ౧౭. సూ ౭౭. మం ౨.)

కిరణములతల్లియగు సూర్యుడు బంగారువంటి బింబము వలె కానవచ్చి తెల్లనివస్త్రమును. ధరించినవాడై విశ్వమంతా అన్నివైపుల ప్రకాశించుచున్నాడు.

---

1. హిందువుల ఆధిక్యత. ౫౭౪, ౫౭౫ పే.

" కలమాన్నరుచితోడ కలహించు జాడదు
వ్వలువపింజలు ఫెళఫెళమనంగ ॥
(పారుజాతాపహరణము)

సీ॥ ……………………………
తే॥ గళుకు పని చిల్కవగలేత తళుకు లోలుకు
జాళుకొకమ్మిసరిగంచు చలువవలువ॥
(హంసవింశతి)

మం॥ గ్రావాకుంభాతిమలగఇవవస్త్రా ॥
(అధ. కాం ౧౨. అ 3. మం ౨౧.)

చాకలి సుభ్రపరచిన వస్త్రమును ఈ రాయిగూడ ప్రకాశము గలుగునట్లుల నునుపుచేయుచున్నది. ఈ నాడు వేడిచేసిన ఇత్తడి, ఇనుము పెట్టెలతో "ఇస్త్రీ" నునుపుచేయు నట్లుల ప్రాచీనకాలమునందు నున్నరాతితో వస్త్రమునకు నునుపువచ్చు లాగున చేయబడు చుండెను.

## నర్సాపురము

గోదావరిజిల్లాలోని నరసాపురము పేరెన్నికగల రేవు పట్టణము. ఇచ్చట డచ్చివారి వ్యాపారవస్త్రములను చక్కగ చలువజేయబడుచుండెను. దక్షిణహిందూదేశములో నర్సాపురము చలువజేయుటకు చాల ప్రసిద్ధిగలిగి యుండెను. ఇక్కడ వెన్నతో వస్త్రమునకు నునుపుచేయుదురు. అందుచేత వీరి చలువలోని తెలుపు నిగనిగలాడుచు ప్రకాశవంతముగా నుండును. ఈ నగరమున డచ్చివారిచేత చాకలివారికొసంగబడిన 'చలువగట్టు' యను చెరువొకటిగలదు. డచ్చి

వారున్న వీధియందే చలువ జేయు చాకలివారుగూడ నివసించి యుండిరి. వీరి గృహములు చాల పెద్దవిగానున్నవి. ఇందులకు రెండు కారణములు గలవు. ఒకటి బేళ్లకొలదిగ చలువ జేయు నపుడు జాగ్రత్తగా బట్టలను దాచుటకును, వేరొకటి వీరి యాదాయమును బట్టి ఎక్కువ ధనము వెచ్చించి ఇంతపెద్ద గృహములు కట్టించియున్నారు.

వీరి గృహనిర్మాణమును బట్టి జూడగా వీరి జీవితము చాల గౌరవముగను సంపదతోను విరాజిల్లు చుండెనని తెలుప వచ్చును.

## ౩౯. స్త్రీల పరిశ్రమ.

"వ్యక్తిస్వాతంత్ర్య ప్రబోధకులలో నగ్రగణ్యుడైన హెర్బర్టు స్పెన్సరు స్త్రీల స్థితినిబట్టి ఏ సంఘముయొక్కగాని సభ్యత నవలీలగ గనిపెట్టవచ్చుననుచున్నాడు." 1.

"ఒకానొకజాతి యెంతవరకు నాగరికత చెందినదో తెలియవలెనన్న, వారిస్త్రీలెట్టి దశలోనున్నారో గమనించిన యెడల తెలియగలదని యెల్లవారు నంగీకరించిన విషయమే" నని కర్నల్ టాడ్ బలుకుచున్నాడు. 2.

ప్రాచీనకాలమున స్త్రీలయెడ హిందువులు చూపినంత గౌరవాదరములు ఏ యితరరాష్ట్రములును జూపలేదని నిస్సం

1. 2. 3. 4. హిందివుల ఆధిక్యత. (స్త్రీలస్థితి)

శయముగ దృఢముగబలుకవచ్చు"నని హెచ్. హెచ్. విల్సన్ పండితుడు వ్రాసెను. 1.

"యత్రనార్యాస్తు పూజ్యన్తే రమన్తే తత్రదేవతాః।
యత్రైతాస్తునపూజ్యన్తేసర్వాస్తత్రాఫలాః క్రియాః॥"
(మనుస్మృతి 3. ౫౬)

ఎక్కడ స్త్రీలు గౌరవింపబడుచున్నారో అక్కడ దేవతలు ప్రసన్నులగుచున్నారు. ఎక్కడ నగౌరవము పొందుచున్నారో అక్కడ చేయు కర్మలన్నియు నిష్ఫలము లగుచున్నవి. 2.

ఆరమ్‌గా రిట్లువ్రాసిరి. "భారతవర్షములో వంటపని చేయు పేదసంప్రదాయపు స్త్రీయొక్క చేయి ఐరోపీయ సౌందర్యవతి చేతికంటెను సుకుమారముగనుండును. మూటలు మోయువాని యొడలును ముఖవైఖరియు మాయంతటి యందగత్తెలు లేరని విఱ్ఱవీగు పిన్నబాలికల యొడలికంటెను మోముకంటెను మృదువుగనుండును. ఆడువారు పట్టుపురుగు కాయలనుండి పోగును చకచక విప్పితీయుదురు. ఒక్కొక్కకాయలోని పోగులు సన్నదనమునుబట్టి యిరువదితరములుగ విభజింపబడును. సన్నమో ముదుగో కంటికిగన్పించనంత త్వరితముగ పోగు వ్రేళ్ళసందున పరుగిడుచుండ నొక తరమునుండి యింకొకతరమునకు, ఒకటినుండి యిరువదికో, పందొమ్మిదినుండి

1. 2. హిందువుల ఆధిక్యత (స్త్రీలస్థితి)

రెండుకో పోగు ముదుగుతనము మారుచున్నట్లు వ్రేళ్ళకుదట్టిన తక్షణమే అక్కడకక్కడ త్రెంపివేయుదురు." 1.

బాధ్యతగల చరిత్రకారుల వ్రాతలలో విశాలభావము లుండకపోవు! పరదేశముల జన్మించిన స్త్రీలకన్న భారతదేశ జనితలగు స్త్రీలకు ప్రత్యేకగౌరవాదులు కొన్ని గలిగియున్నవి. గాని గౌరవ మర్యాద హక్కులన్నియు భోగములకొఱకేయని తలంచువారు నిష్పాక్షికసిద్ధాంతమును చేయలేక పూర్తిగ పొరపాటు పడుచున్నారని గట్టిగ దెలుపవచ్చును.

భారతదేశపుస్త్రీలు గృహపరిశ్రమలకు పెట్టినపేరు. నిరుపేద కుటుంబములకు గలుగుచున్న ఆర్థికలోటును దీర్చుటకు కుడిభుజమువంటివారు. లలితకళలలో పేరెన్నికగని యున్నారు. పారిశ్రామికకళలు వారికి పుట్టినిల్లువంటివి. లోకములం దేదేశమునందును, ఏకాలమునందును, ఈనాటికినెవ్వరు గాని తీయలేని సూక్ష్మతంతు నిర్మాణమేసాక్షి. ఈ తంతు నిర్మాణము పరిపూర్ణ కళాకౌశలముతోను, పరిపూర్ణ సూక్ష్మ జ్ఞానముతోను, జ్ఞానేంద్రియమును వెలిగించి తీసియున్నారు. అందుచేత సహస్రభానుకోటి ప్రకాశమువలె జగమంతట కీర్తిని గనియున్నారు. నీతి, నియమములతోను, దయ, ప్రేమాదులతోను వన్నెగలిగి పరిపూర్ణపతిభక్తి, కొదువలేని అతిథిపూజ, విసుగులేనిసేవ, వీడని దైవభక్తితో విరాజిల్లుచున్న మానవతీమతల్లులతో హిందూదేశ మంతయు నిండియున్నది. గనుకనే స్వదేశపరదేశ చరిత్రకారులెల్లరు భారతదేశమున

---

1. హిందువుల ఆధిక్యత ౫౬౮ పే.

జన్మించిన నారీమణులను పలువిధముల కొనియాడి, పూజించి, అనందించి, ధన్యతచెందియున్నారు.

"పేశసాతతంతంతుంసంవయన్తి" (ఋగ్వే)

స్త్రీలు సన్ననిమృదువైన వస్త్రములు నేయుచున్నారు.

"యజ్ఞస్యపేశః సమీచీసంవయన్తి"

(ఋ. అ౨. అ౫. వ౨౩. మం౨. సూ౩. మం౬)

స్త్రీలు యజ్ఞముకొఱకు వస్త్రములు నేయుచున్నారు.

మం॥ వితన్వతేధియో అస్మాఅపాంసి।
వస్త్రాపుత్రాయ మాతరోవయన్తి॥

తల్లులు బిడ్డలకు బుద్ధులు (విద్యలు) తెలియజేయుచు వస్త్రములను నేసి యిచ్చుచున్నారు.

సీ॥

క॥

ఉర్విమెరయించు కార్పాసపర్వతంబు
నేకు మర్దించె నొక్కపింజారి తరుణి ॥

(శ్రీనాథుని వీధినాటకము)

"భోజనావిశిష్టాద్గోరసాద్ఘృతకరణంతథా తైలగుడయోః
కార్పాసస్యచ సూత్రకర్తానం సూత్రస్యచవానం।
వైవసికాయవ్యయ పిండీకరణమితివిద్యాత్ ॥

(వాత్స్యాయన కామసూత్రములు)

భోజనమునందుపయోగించగా మిగిలిన గోరసమునుండి వెన్న, వెన్ననుండి నేతిని చేయుట., నూనె బెల్లమును తయారు చేయుట ప్రత్తినుండి దారమును వడకుట ఆ దారముతో

వస్త్రము నేయుట దినచర్యయందు ఆదాయ వ్యయములను చేర్చుట వీటిని గృహిణి నేర్చియుండవలెను.

బౌద్ధగ్రంథములందు వ్రాయబడిన యీ క్రింది కథను చదివినచో బౌద్ధయుగమున వస్త్రపరిశ్రమ ఎంత గౌరవమను వృత్తిగ పరిగణింపబడుచుండెనో స్పష్టమగును. బుద్ధుడు భర్గ దేశమునందలి 'శిశుమారగిరి' యందు నివసించుచున్నప్పుడు, ఆ గ్రామమున "నకులపిత" యను నాతడు వ్యాధిగ్రస్తుడై మరణశయ్యయందుండి, తన భావికుటుంబ స్థితినిగూర్చి విచారించుచుండగా, అతని భార్యయగు (నకుల మాత) యిట్లు చెప్పెను. "ఈ ప్రాపంచిక విషయములయెడ కాంక్షగలిగి మరణించుటవలన ముక్తి గలుగనేరదు. నకులమాత బిడ్డల నెట్లు పోషించుకొనగలదు. కుటుంబము నెట్లు భరించునని విచారము మీరు నొందకుడు. నూలు వడకుటయు, ఉన్ని దారము తీయుటయు, నాకు తెలియును. వీనివలన ధనమార్జించి బిడ్డలను పోషింపగలను. 1. (యంగు యిండియ)

క్రీ. శ. ౧౭౯౩ సం॥ లో పర్మినెంటు సెటిల్ మెంటు ముగియగనె పరిపాలనా విషయములందు గొప్ప యనుభవము గల "లేబ్రూక్" గారు "భారతదేశ రైతునకు నూలువడకుట ఒక్కటియె పరిశ్రమ" అను శీర్షికక్రింద వ్రాయుచు "కష్టసమయములందు తమ పురుషులకు సహాయము జేయుటకు రాటముపై నూలువడకుట స్త్రీలకొక వృత్తియైయున్నది. 2.

1. మన కీ దారిద్ర్య మేల ౮౭ పే.

2. ఆంధ్ర దినపత్రిక. (౨౬-౭-౩౨) ౯ పే.

బుకానను హామిల్టనుగారొక పుస్తకము వ్రాయుచు ఇట్లు వాకొని యున్నారు. వ్యవసాయము వెనుక రాటముపై నూలు వడకుట మగ్గముపై గుడ్డ నేయుట రెండవజాతీయ పరిశ్రమగ నున్నది.

వేదకాలమునందు స్త్రీలు వస్త్రములు నేయుటలో చాల ప్రసిద్ధి గలిగియున్నారు. తమ కుటుంబములకు కావలసిన వస్త్రము లన్నిటిని తామే నేయుచుండెడివారు. తరువాత కాలములో గూడ వడకుటగాక నేయుటయు స్త్రీలలో యుండియున్నది. ఈనాడు కూడా వస్త్ర నిర్మాతల కుటుంబములలో కొందరు స్త్రీలు మిక్కిలి శ్రేష్ఠతరమైన వస్త్రములను చక్కగ నేయుచున్నారు. పశ్చిమ హిందూదేశమునందు స్త్రీలు మాత్రము నూలున (పడుగుల) కు గంజి పెట్టి సరిచేయుచుందురు. ఈ కార్యము వలన వీరు ఒక దినమునకు రు ౧—౪—౦ మొదలు రు ౦—౮—౦ ల వరకు సంపాదించుచున్నారు. గంజాముజిల్లాలోని పట్టు శాలీలునేయు రవసెల్లాలకు గావలసిన నూలు వారి స్త్రీలు తీయుచున్నారు. ఈ స్త్రీలు తమ కాలమంతయు సూక్ష్మ తంతు నిర్మాణమున కుపయోగించి దేశమునకు గొప్ప సేవచేయుచున్నారు. వీరీవృత్తి వలన కొద్ది ఆదాయమునే పొందుచున్నారు. సగటున మాసమునకు ౩—౦—౦ రూపాయల కెక్కువ సంపాదింప లేకున్నారు. వీరి కష్టమున కెక్కువ కూలి గిట్టుటవసరము.

స్త్రీలకు నూలు వడకుటతోపాటు నేయుటగూడ నేర్పుట చాల యవసరమయియున్నది. ఇందువలన చేతిమగ్గ

ముల పరిశ్రమ చాల వృద్ధిపొందగలదు. నూలు వడికి తమకు గావలసిన వస్త్రములు తామే నిర్మించుకొనుటవలన కుటుంబ ములకు చాల లాభకరముగా నుండుటయేగాక దేశమునందు గృహపరిశ్రమల యభివృద్ధికి మార్గదర్శిగా నుండును. పదివత్స రములపాటు ఈ కార్యమును ప్రచారమునం దుంచిన చాలును. ఇందువలన ఖద్దరుపరిశ్రమ ఎక్కువగా యభివృద్ధి చెందగలదు. ఖద్దరు వ్యాపారులు వస్త్రముల నెక్కుడుగా స్త్రీలచేతనే నేయించుటకు ప్రయత్నింపవలెను. ఇందువలన స్త్రీలకుగావలసిన వస్త్రములు ఎక్కువగా ఖద్దరే వాడుకకు రాగలదు. స్త్రీలు వడికి నేసి స్త్రీలకు వారే విక్రయించుట గూడా ముఖ్యమైనవిషయము. స్త్రీలకు స్త్రీలే ఖద్దరు వస్త్ర ములు విక్రయించిననాడు స్త్రీలు ఎక్కువగ ధరింప ప్రయత్నిం తురు. ఖద్దరు వస్త్రధారణ స్త్రీలలో పెంపొందింపవలెనన్న స్త్రీలు నేయుట స్త్రీలు విక్రయించుటదప్ప వేరు మార్గము లేదు.

"వాసఃపల్పూలీ" (జై. బ్రా)

బట్టలను శుభ్రపరచుస్త్రీ 1.

"రజయిత్రీ (యజు. అధ్యా౩౦. మం ౧౨)

రంగులద్దుస్త్రీ 2.

"ప్రకామాయరజయిం త్రీం॥ (తై 1. బ్రా. 3. ४. 2

కామాభిమాని దేవతకొఱకు వస్త్రములకు రంగువేయు స్త్రీని నాలభింపవలెను. 3.

1. 3 వేదకాలపుస్త్రీలు. అ. ఆ. ౯౮ పే. ౨. వైదిక సభ్యత. ౨౭.

కడపజిల్లాలో నేడింకను స్త్రీలు తమకుగావలసిన నూలు వడకుకొని అంచులకు కమ్ములకు గావలసిననూలును స్వయముగా చాయలద్దుకొని వస్త్రములు నేయించుకొనుచునే యున్నారు. ఈ పరిశ్రమ పట్టణములకన్న పల్లెలయందు గాంచవచ్చును 4.

"యథానడం స్త్రియోభిన్దన్త్యశ్మనా"

(అ. సం. ౬-౧౩౮-౫)

స్త్రీలు నడమను పేరుగల తృణమును బద్దలు కొట్టి అల్లిక పనులు చేయుచున్నారు.

రాజోలు తాలూకా పొన్నమండ గ్రామమున ఒక బ్రాహ్మణునింట యువతీమణి తాటియాకుల చాప మిక్కిలి చక్కగ నల్లుచుండగా చూచితిని. ఈ ప్రాంతమున తాటి యాకుల చాపలు బుట్టలు సాధారణముగా నెవరికి కావలసినవి వారే యల్లుకొనుచుందురని వినుట కెంతో సంతోషము కలుగుచున్నది.

బొంబాయినగరమునందుగల "సర్, రటన్, టాటా ఇండస్ట్రియల్ హోం" చాల ఉత్సాహమును గొల్పుచున్నది. ఇందు ౨౫౦మంది బాలికలున్నారు. నేత, కుట్టు, వంటపనులు నేర్పబడుచున్నవి. ఈ పరిశ్రమలవల్ల జీవించుట కనుకూలించు నట్లుల చక్కగా నేర్పుచున్నారు. నేతలో పారశీకుల చీరెల కంచులకు కుట్టువన్నెల లేసులు ౬౦ కద్రల పేట్ల వరకు నేయబడుచున్నవి. ఈ పేట్లు కాలితో తొక్కుపద్ధతితో

---

4. నేతపరిశ్ర. ౧౬౭ పేజి. చూడుము.

యున్నవి. ఈపద్ధతి దక్షిణహిందూదేశమునం దెక్కడను కాన రాలేదు. తివాసీలు నేయుపద్ధతిగూడ నేర్పుచున్నారు. కుట్టు పనిలో సింగరు, ఎంబ్రాయిడరు, చేతికుట్టులలో ప్రసిద్ధిగల పనులు నేర్పబడుచున్నవి. వంటకములో పిండివిసరుట మొదలు సమస్త వంటకములను నేర్పుచున్నారు.

హైద్రాబాదునందు "నైజాం కాలేజి ఇండస్ట్రియల్ ఇన్‌స్టిట్యూటు"లో షుమారు ౫౫సం॥ వయస్సుగల స్త్రీ సంపన్నులు ధరించు జరీబెల్టు లేక పట్కా నేయుచున్నది. ఈమె కీపరిశ్రమయం దెక్కువకాలము వాడుకగలిగి యున్నందున చాల త్వరితముగ లలితకళావిజ్ఞానమును జూపుచు నేయు చున్నది.

సింగరుమిషనుతో కుట్టుపని స్త్రీలు నేర్చుకొనుట చాల సులభము. స్త్రీలలో అచ్చటచ్చట సింగరుమిషనుతో కుటుంబ జీవనము చేయువారు కనుపించు చున్నారు. స్త్రీలకు బిడ్డలకు కావలసినవి కుట్టి చక్కగ జీవింపవచ్చును. ఏలూరు నందొక కుటుంబమున ఒక యువతి భర్తకు పిల్లలకు గావలసిన కుటుంబ సేవచేయుచు నెలకు రు ౮-౦-౦ లు మొదలు రు ౧౦-౦-౦ ల వరకు సంపాదింపగలుగుచున్నది. బొంబాయి వంటి మహానగరమునందొక కుట్టుషాపులో సింగరు మిషనుపై ఒక యువతి శ్రేష్ఠమగు అంగీలను కుట్టుచున్నది.

గోదావరిజిల్లాలో స్త్రీలు సన్నటేపు, నవారు మొదలగునవి ప్రసిద్ధిగ నేయుచున్నారు. పాలకొల్లు సంతవద్ద ఒక యువతి డబ్బారేకుతో దీపపుబుడ్లు మొదలగునవి తయారు

చేయుచున్నది. కమసాలిపనిలో సున్నితమయిన నగలు చేయు స్త్రీ లాంధ్రదేశమునగలరు. బొంబాయిరాజధానిలో స్త్రీలు బీడీలు చుట్టి రు ౦-౮-౦ మొదలు రు ౧-౦-౦ వరకు ప్రతి దినము సంపాదించుచున్నారు. ఒక్క బొంబాయినగరమునందు ౫౦౦౦ మంది స్త్రీలు బీడీలు చుట్టుచున్నారు.

ప్రాచీనకాలమునుండి భారతదేశమున స్త్రీలు పరిశ్రమలందెక్కువ పాల్గొని ఆర్థికదుస్థితిని పారదోలుచున్నారు. గనుక స్త్రీలలో ఎక్కువగ పరిశ్రమలను పెంపొందించుటచేత దేశాభ్యుదయమునకు చాల మేలొనకూడును.

# దేశీయ పరిశ్రమలు

## ప్రస్తుతకాలము.

అతి ప్రాచీనకాలమునుండి భారతవర్షమునందు గృహ పరిశ్రమలలో తయారగుచున్న సమస్త వస్తువులు క్రీ. శ. ౧౬౭౭ సం॥ వరకు భారతదేశమునందేగాక ప్రపంచమునం దన్ని దేశములందును విపరీతముగా వాడబడు చుండెను. హైందవ హస్తకళానిర్మిత వస్తు కౌశలముతో సమానమగు పనితనముగలవస్తువస్త్రములను నిర్మించువారుగాని, వెలయందు సరసముగా వీటని పోటీచేయగలిగిన పారిశ్రామికులు లానా డెచ్చటను గానరాకుండిరి. పయిగా ఆనాడు వాడుకయం దున్న వస్తుజాలములో నూరింట దొంబది పాళ్లు వస్తు వస్త్ర ములు భారతశిల్పులు దప్ప పరదేశవాసులు నిర్మింపజాల కుండిరి. అందుచేత భరతఖండమునగల పట్టణములందును, పల్లెలందును, కడకు మారుమూలలందున్న కొండలప్రక్కను, అడవులందు నిర్మించిన నాలుగుకొంపల ప్రదేశములయందును, పేరు ప్రతిష్ఠలు గల వస్తువులు కళాకౌశలముతో తయా రగు చుండెను. ఆనాడు దేశాభిమానము కళాభిమానము భారతీయులయందు మెండుగ గానవచ్చు చుండెను. అందు చేత వారు స్వదేశ వస్తు వస్త్రములను శక్తికొలది కొని పరి శ్రమలను ప్రేమించి ప్రక్క గృహము నందున్న లలిత శిల్పుల పోషణ బాధ్యతను గమనించు చుండెడి వారు. అంతేగాక రాజుల కొలువు నదరాణాలకును, రాజులు పరి

వారమును బహూకరించుటకును, దేశీయులు శుభకార్యము లందు బంధుకోటికిని, అల్లుండ్రకును, ఆడబిడ్డలకును, మిత్రుల కును, శృంగారమయిన స్వదేశీ వస్తు వస్త్ర రాజములలో విలువల వాటిని వెలను లెక్కింపక శక్త్యానుసారముగ కొని యుపయోగించుచుండెడివారు. ఇక సామాన్య వస్తు కోటిని కొనుగోలువేయువారు ప్రియమా, సరసమా, సన్నమా, ముదుగా, అందమా, మోటా యను విచక్షత నెక్కువగా పాటింపక తమ దేశ, తమ ప్రాంతపారిశ్రామిక. శిల్పుల యందుగల పరిపూర్ణ ప్రేమాభిమానతరంగము లానందముతో వెదజల్లుచు సంతలందును, తిరునాళ్ళయందును, జాతరలయం దును గల విక్రయ శాలలయందు ప్రేమ పూర్వకముగా కొని వాడు కొను చుండెడివారు. ఇవ్విధముగా పరదేశపు తెగు మతు లుండుటచేతను, స్వదేశ ప్రజల యభిమానముచేతను ప్రాచీన భారతదేశ పారిశ్రామికులు పరిపూర్ణ సౌభాగ్యము లతో జీవించుటయేగాక దేశ సౌభాగ్యమును పెంపొందించి యుండిరి. అందుచేత ఆర్థిక దుస్థితిని మెరుంగక లక్షల కొలది వత్సరములు అవిచ్ఛిన్నముగా భారతాంబ తరుగులేని కీర్తిని గడించి యలరారి యుండెను.

ఇవ్విధముగా ప్రాచీన కాలమునుండి భారత దేశము నందు గల ప్రజలకు పరిశ్రమలయందున్న యభిమానము నేడు పదింట నొక్కపాలుగూడ కానవచ్చుటలేదు. గ్రామజీవిత మునగల పరిశ్రమలు పారిశ్రామికులు సుభిక్షముగ నుండవలె నని కోరుచుండురాజులు, జమీందారులు, ధనవంతులు, అభి

మానులు, పెత్తనపుదారులలో నేడీ యభిమానము చాల కొద్దిగ కానవచ్చుచున్నది. ఇందుచేత ప్రత్యక్షమున గానవచ్చు చున్న విశాల కళాకౌశలముగల పరిశ్రమలు, పారిశ్రామికులు, పారిశ్రామిక శిల్పులు, తీరనికష్ట పరంపరల మునిగియున్నారు. ఇట్టి కష్టపరంపరల జిక్కుటయేగాక గౌరవ మర్యాదలు తరగి పోగా కడకు తినతిండిలేక మలమలమాడుచుండిరి. ఎంత దారిద్ర్యమాపాదించినను తమపరిశ్రమలను వీడక దాచియుంచిన భారత హస్తకళాపారిశ్రామిక శిల్పులే దేశాభిమానులు, దేశ గౌరవ రక్షకులు, దేశీయులచే పూజార్హులు.

పరదేశవస్తువులను, పరదేశనాగరికతను వ్యాపింప జేయుచు పరదేశ యలంకారముల కలవాటుపడి విరాజిల్లు చున్న బొంబాయివంటి నగరమునగూడ పల్లెటూరు పరిశ్రమలు గానవచ్చుచునేయున్నవి. నగరమునిండుగగల షాపులందు యంత్రనిర్మితంబగు మంగలికత్తులు, కత్తెరలు విక్రయించు చుండగా రాజవీధులందు పల్లెటూరు వాసులు నాటున తయారు చేయబడిన కత్తులు, కత్తెరలు విక్రయించుచునే యున్నారు. టర్కీ జర్మనీలనుండియును మంగలికత్తులు నూరు లోకప్రసిద్ధిగలరాళ్లు రేవులయందు విరివిగా దిగుమతి యగు చున్నను వీధిలోని పల్లెటూరు వ్యాపారునివద్ద నాటుసల్లరాళ్లు విక్రయింపబడుచునే యున్నవి. పరదేశ నాగరికావేశమయిన కుర్చీలు బల్లలు మేజాబల్లలు ఎక్కువగా నగరమంతట నిండి యున్నను ప్రాచీనదేశీయాచారమగు పరుపులు దిండ్లు తివాసీల యందములోని షోకు తగ్గలేదు. బొంబాయి రాజధానిలోగల

మితిలేని చలిని బాపుకొనుటకుగాను మిల్లులో నేయబడిన శాలువలు, రగ్గులు, టజ్జులు మొదలగునవి ఎంతోషోకుగా ప్రతియూరియందుగల విక్రయశాలలందు గానవచ్చుచున్నను గొఱ్ఱె, మేకల బొచ్చుతో నాటున వడకి చేతిమగ్గములందు నేయబడిన గొంగళ్ళకు సంతలందు గిరాకీ గలిగియే యున్నది. వన్నెల చిన్నెలతో నేయబడు అలంకారపు సన్నని మైసూరు గొంగళ్ళపై వ్యామోహము తగ్గక పోవుటయేగాక చలికి కుట్టించు అంగీలుగూడ ఈ గొంగళ్లతో విరివిగా కుట్టింపబడుచు నేయున్నవి. నిజాము రాజధానిలో నాటుకాగితములకు పెట్టినపేరు, కంచు సిరాబుడ్లు నాటుసిరా వాడని యంగడి కాన వచ్చుటలేదు. కాకెదురు వ్రాతకలముల షోకు తగ్గలేదు, కంబళ్లుగాని కలంకారి దుప్పట్లుగాని లేని గృహము కానరాదు. భారతదేశమునందుగల నగరము లందును పల్లెలయందును పరదేశపు గ్లాసుసామానులు జపాను చైనా పింగాణిగిన్నెలు విక్రయమునకు సిద్ధముగానున్నను రాగి,ఇత్తడి,కంచు, మట్టిపాత్ర సామానులు మొదలగునవి ప్రతి యింటను వాడబడుచునేయున్నవి. పట్టలునేయు యంత్రము లెన్నియున్నను పల్లెలందు నేయబడిన నారపట్టలను పరదాల కును, కుర్చీలకును, మడతమంచములకును, నేలపరచుటకును వాడుచునేయున్నారు. మితిలేని సబ్బులరకములు షాపులం దుండి మిక్కిలి సరసముగా రు 0-0-3 లకుగూడ విక్రయింప బడుచున్నను, చక్కపొడి, పరుపొడి, చున్నబిండి, చీకాయ పొడి, కుంకుడుకాయలు వాడబడుచునేయున్నవి, పేరెన్నిక

గల పరదేశద్రావకములు, ఇంజక్షన్లు డాక్టర్లచే వాడబడుచున్నను దేశీయ ఓషధ కషాయములందున్న గౌరవమేమాత్రము తగ్గలేదు. పట్టణముననిండుగ వస్త్రయంత్రములు, పిండిమరలు నుండినప్పటికిని పల్లెలయందు నూరింట తొంబదిపాళ్ళు దంపుడు బియ్యము తిరుగలితో విసరిన పిండినిమాత్రము వాడుచున్నారు. నూనె ఆముదములయంత్రములు దేశమంతట లెక్కకు మిక్కుటముగానున్నను వంటఆముదమునకు గౌరవముగాని, గానుగాడిన ఘప్పునూనెకు మర్యాదగాని రవ్వంతయు తగ్గలేదు. ఇంగ్లీషు రంగులచర్మములు క్రోము చర్మములు బస్తీల నిండుగ యున్నను గట్టి చర్మముతో కుట్టిన మేలు రకపు నాటుచెప్పుల వ్యామోహమునకేమి కొఱతలేదు. అతి ప్రాచీన కాలము నుండి భారతదేశమునందు విరాజిల్లు చుండిన కలంకారీ చొప్పా యద్దకములను పోటీ చేయుటకుగాను "ఆరోగ్రాఫ్" యను యంత్రపు టద్దకములను తెచ్చి పదివత్సరములుగా పోటీ చేయుచుండినప్పటికిని భారతదేశ నారీమణులలో నూటికొక్కరయిన వాడుట కిష్టపడుటలేదు.

ఇవ్విధముగా దేశమంతటను హస్తకళలు నిండి నిబిడీకృతమయి యున్నను వ్యాపారులు మాత్రము పట్టణముల యందును, పల్లెలయందును, సంతలయందును, తిరునాళ్ళయందును, జాతరలయందును, రైల్వే స్టేషనులయందును, రైళ్ళయందును, కడకు పదుగురు చేరుప్రతి ప్రదేశమందును యంత్ర నిర్మిత వస్తువులనే యమ్ముచున్నారు. విక్రయశాలలందు విక్రయించు మిఠాయీలకు యంత్ర నిర్మితమగు పిండి, చక్కెర,

నూనె మొదలగునవి యుపయోగింపబడుచున్నవి. అన్న విక్రయ శాలలయందు మరబియ్యమే వాడుచున్నారు. నాటున దంచిన బియ్యము, తిరుగలితో విసరిన పిండి, గాను గాడిననూనె, రైతువండిన బెల్లము, రాటముతో వడకి చేతిమగ్గములతో నేయబడిన ప్రత్తి, పట్టు, ఉన్ని, నార బట్టలు, ఇనుము, ఉక్కు, ఇత్తడి, రాగి, కంచు మొదలగు వాటితో హస్తకళా నిర్మితంబైనవాడుక వస్తువులు వేడుక సామానులు, బచ్చెన సామానులు, నాటుచర్మపు వస్తువులు మొదలగునవి విరివిగా సరసముగా ప్రతిచోటు దొరకునట్టుల దేశమునిండుగ నింపి వేయవలెను. ప్రజ లభిమానముతో హస్తకళా నిర్మిత పదార్థములే విధిగా కొనుట కలవాటు పడవలసియున్నది. అప్పుడు భారతదేశమునందున్న ఆర్థికదుస్థితి పూర్తిగా తొలగిపోగలదు.

## ముడిపదార్థముల సంపద

ఖనిజములలో ప్రస్తుతమెన్నోగలవు. రాతిసి బొగ్గు చాల ప్రధానమయినది. వంగదేశమునందును నైజామురాష్ట్రములోను మధ్యపరగణాలయందు నీ గనులు గలవు. మైసూరు రాజధానిలోని కోలారుగనులందేగాక, నిజామురాష్ట్రము లోని హుత్తిప్రాంతమునందును, అనంతపురం జిల్లాలోను బంగారు గనులుగలవు. శాతవాహనుడు పల్నాటిసీమయందు గల శ్రీపర్వతమునొద్ద త్రవ్వించిన బంగారుగనుల జాడ మాత్రము తెలియుటలేదు. బర్మాదేశమునందును, అస్సాము దేశమునందును కిరసనాయిల్ నూతులు గలవు. ప్రపంచ

మున నుత్పత్తియగు అభ్రకములో నెల్లూరు, హజారిబాగ్, గయా, మాంఘిర్ ప్రాంతములే సగభాగము కంటె నెక్కువ భాగము సమకూర్చు చున్నవి. విశాఖపట్టణము, బళ్లారి జిల్లాలలోను మధ్యపరగణాలలోను మాంగనీసు విశేషముగ దొరకు చున్నది. చోటానాగపురమునందలి హజారిబాగ్ నందును బర్మాయందును తగరముత్పత్తి యగుచున్నది. సురేకారము వంగదేశమున విశేషముగ నున్నది. నెల్లూరు జిల్లా గరిమొనపంటవద్ద ౧౦౦ కి ౫౫ పాళ్లు దొరకు రాగి గనులు గలవు. దక్షిణహిందూస్తానమునందును రాజపుత్ర స్థానమునందును రాగి, వెండి దొరకుచున్నది. ఇనుమునకు తాతా కంపెని గాక పలుప్రాంతముల గృహపరిశ్రమలుగా తయారుచేయుట కవకాశముగలదు. నెల్లూరుజిల్లా ఉదయగిరి తాలూకాలోని వేంకటాద్రిపాలెము నొద్దనున్న ఇనుపకొండ యందు ౫౦ సం॥ ల క్రింద దనుక ఇనుము చేయుచుండిరి. ఆనాటిగనులు ఇనుము కరగిస ప్రదేశములు నేటికిని చెక్కుచెదరక కానవచ్చు చున్నవి. కర్నూలుజిల్లాయందు దినుము నిన్న మొన్నటివరకు కొద్దిగనో గొప్పగనో తయారగుచునేయున్నది. నెల్లూరు, చిత్తూరు, కర్నూలు జిల్లాలయందు గాజుపరిశ్రమ సజీవముగ కాన్పించుచున్నది. రత్నములు, వైక్రాంతములు, స్ఫటికము లెన్నో ప్రాంతముల యందు దొరకు చున్నవి. నూరు వత్సరముల క్రిందదనుక ఉక్కుచేయు పల్లెలు, ఉక్కు కొలిముల్లు ఉక్కు వస్తుసామాగ్రిచేయు చోటులెన్నో దేశము నిండుగ గలిగియుండెను. నేడొక్క జయపూరు మన్యములందు

మాత్రము నామావశిష్టమైయున్నది. చంద్రకాంతరాళ్ళుగల గనులు కొండలు ఉదయగిరి తాలూకా వర్రవాడయందును మరియు దేశమంతటను విస్తారముగా గలవు.

ప్రపంచమునగల ప్రజలలో సగభాగము జనులకు గావలసిన వస్త్రములను సమకూర్పగల ప్రత్తిపండుచున్నది. పట్టునకు కొఱతలేదు. ప్రపంచమునగల పట్టుజాతులన్నిటిలో మైసూరు రాజధానిలోని పట్టు గట్టితనమునందును, మృదుత్వమునందును, ఎక్కువకాలము మన్నుటయందును, పక్కాచాయలెక్కుటయందును, వాడుకలో పీచురేగకుండ నునుపై సాపై మెరయుచుండును. అందుచేత ఈ మైసూరు పట్టునకు జగమునందేపట్టుగాని సాటిరాకున్నది. జనుము, గోగునారలకు లోకప్రసిద్ధి గాంచియుండెను. జనపనార చందనపునూనె, ధృతిగలగడ్డి, ప్రపంచమంతటికిని హిందూదేశమే ఎగుమతి చేయుచున్నది. ఉన్నిబట్టలకు గొప్ప పలుకుబడిగలదు, చాపలల్లుటకును, వానికిగావలసినంత తుంగపంటకును కొదువలేదు. ఎదురు పంటలోను ఎమరల్లికలలోను చాల గొప్పతనము గలదు. వైద్యమునకు గావలసిన ఓషధులపంటగలదు. నల్లమందు, పొగాకు, కాఫీ, టీ, పంటలు గలవు. లోకప్రసిద్ధిగలదేశీయ పక్కారంగులు పది వత్సరముల క్రింద దనుకవాడుక యందుండెను. ఖనిజములతోను, ఓషధులతోను, కాయలతోను, పండ్లరసములతోను, ఒండ్రుమట్టితోను, పక్కారంగులు వేయుచుండిరి. రంగులేగాక బంగారుతోను, వెండితోను పలురీతుల పాలంపూరు లద్దుచుండెడివారు.

# ౧. ఖద్దరు పరిశ్రమ.

ప్రాచీనకాలపు భారతదేశప్రాగల్భ్యసంపదకు మూలంబును హస్తకళలమాతయునగు ఖద్దరునుగూర్చి నే డెక్కువగా వ్రాయ నగత్యము లేదు. ఆర్థికముగా దేశమునకు మేలు చేయు సాధనలన్నిటిలో ఖద్దరు ప్రధానస్థాన మలంకరించి యున్నది. దారిద్ర్య వినాశక దేవత యగు శుద్ధఖద్దరు నెన్ని రీతుల పెంపొందించిన అన్నిరీతులదేశమునకు మేలొనగూడు చుండును.

"ప్రత్తిని ప్రతిగ్రామములో పండించుటకు పూనుకొనవలెను. ప్రత్తినిపండించువిషయములో కావలసిన వ్యవసాయ విషయములను గూడ వెంటనే తెలిసికొనవలెను. ప్రత్తిని విదేశములకు విరివిగా రవాణా చేయుటయే మన యుద్దేశమైనప్పుడు ఏప్రాంతములో భూసారము ప్రత్తిని పండించుట కనుకూలముగా నుండునాయని యలోచింపవలసియుండును. కాని మన ప్రస్తుతోద్దేశమదికాదు. గ్రామములకు కావలసిన వస్త్రములను గ్రామములో తయారు చేయించుటయే మన యుద్దేశ్యము కనుక ప్రతి రైతున్ను తన పొలములో ఏదైనా నొక మూల కొంత ప్రత్తిని పండించుట యవసరము, లేదా గ్రామస్తులందరును సమష్టి సహకార పద్ధతి ననుసరించి ఉమ్మడిగా కొంత భూమిలో ప్రత్తిని పండింపవచ్చును. ఈ రీతిగా చేసే యెడల గ్రామములో తయారయ్యే వస్త్రముల సరకున

కున్నూ చౌకగా ఏ విదేశవస్త్రములున్ను పోటీగా అమ్మబడ జాలవు. ఈ విధముగా వస్త్రోత్పత్తి చేయుటకు మన శక్తి సామర్థ్యములన్నింటిని వినియోగింపవలసి యున్నది. ఈ రీతిగా స్వగ్రామములోనే ప్రత్తి గింజలను తీసి ప్రత్తిని బాగుచేసి ఏకులు తయారు చేయుట తరువాత నూలు తీయుట సులభ సాధ్యమై మనోరంజకమైన కాలక్షేపముగా నుండగలదు. 1.

(మో. క. గాంధి)

కందుకూరు, కనిగిరి, ఉదయగిరి తాలూకాలలో రైతులు ప్రత్తిని పొలములందు కాయధాన్యములతోపాటు పండించుకొని నూలుగావడికి వస్త్రనిర్మాతలచేత నేయించుకొందురు. నేసినందులకు మూర ౧కి రు ౦-౦-౬ మాత్రము కూలినిచ్చుచున్నారు. అందుచేత ౧౬ మూరల చీరె ౦-౮-౦ లకుమాత్రము గిట్టుచున్నది.

## రాట్నపు ప్రయోజనము పంజాబు దొరతనమువా రంగీకరించుట.

౧౯౩౨-౩౩ సం॥ పంజాబు రాజధానియందు సంప్రాప్తమయిన కాటకసందర్భమున పంజాబు దొరతనమువారు హిస్సారు, హిస్సీ, పతేబాదు జిల్లాలయందు ౧౬ ప్రదేశముల నూలువడకు కేంద్రస్థానము లేర్పరచిరి. నూలు వడకువారికి

1. "మైసూరురాష్ట్రములో ఖద్దరుత్పత్తి ప్రోత్సాహము" అను శీర్షిక క్రింద గాంధీగారు ౨౦-౪-౧౯౩౫ తేది హరిజన పత్రికయందు వ్రాసి యున్నారు. ఆంధ్రపత్రిక ౨౪-౪-౧౯౩౫ తేది ౯ పేజి.

రాట్నములును ప్రత్తియు నివ్వబడెను. వారు వడికిన నూలునకు కూలియివ్వబడెను. ౬౭౯౧గిమంది స్త్రీలునూలువడికియున్నారు.

వాణిజ్యపుఖద్దరు.

ఖద్దరువస్త్రములు సరసముగా గిట్టి వాణిజ్యము పెంపొందవలెనన్న వడ్డిలేని పెట్టుబడిగల ధనము గావలసియున్నది. అథవావడ్డీయున్న రు ౧౦౦ లకు సం॥ ౧కి రు ౩-౦-౦ ల కెక్కువయుండరాదు. ప్రత్తిని పంటకాలమునందు కొని సంవత్సరమంతయు వాడుకొనుచుండవలెను. ప్రత్తిలో శ్రేష్ఠతరమైన దానిని పండించి వడకుట కుపయోగించినట్టులయిన వస్త్రము లెక్కువకాలము మనుచుండును. పిప్పిపింజలులేక మంచి ప్రత్తి పండుటకు కావలసిన పద్ధతులన్నియు పొలములం దాచరించుట చాల యవసరము. పొలముదున్ని ఎరువుపెట్టుట మొదలు ప్రత్తికాయలు కోయుటయేగాక ఏకుటవరకు ప్రతిచిన్నవిషయమునుగూడ శ్రద్ధగగమనించి పాటుపడినగాని ఎక్కువ దినములు మనునట్టి పింజలుగల ప్రత్తి దొరకనేరదు. లాభమేప్రధానముగ చూడక దేశాభ్యుదయము ప్రధానముగ జూచువారే ఖద్దరు పరిశ్రమను పెంపొందింపగలరు.

మిక్కిలి సన్నముగా యున్నపట్టుశాలి వెలమనూలుతో నేయుటకుగాను "ఫ్లైషట్లి" మగ్గములును, పేట్లకు "డాబీల పద్ధతియు పెట్టినగాని పరిశ్రమాభివృద్ధి పొంది సరసముగా గిట్ట జాలదు. ఈసన్నఖద్దరులోయున్న "అంచతార" పద్ధతివెంటనే నసింపచేయవలసియున్నది. వస్త్రమునకు ప్రక్కలయందు సన్న నూలును మధ్యభాగమున ముతకనూలునుపెట్టి నేయువస్త్ర

ములు పూర్వకాలమునందు ఎక్కువగాధనమార్జించుట కేర్పడి యున్నది. అంచులకు కమ్ములకు నుపయోగించు రంగునూలు గట్టిచాయగలిగి యుండుటవలన వస్త్రమునందు వ్యామోహము పెరుగుచుండును. అంచులు కమ్ములు అప్పుడప్పుడు నూతన విధానములతో నలరారు చుండవలెను. పట్టునుచేర్చు వస్త్రములుచాల ధరకలిగియుండుట వలన పక్కాచాయ కలిగినపట్టుండిననేగాని అంచులకు కమ్ములకు నుపయోగింప రాదు. లేనిచో ఈ విలువగల వస్త్రములకు అంచులు కమ్ముల యందుగల రంగులంటుటచేత వస్త్రముయొక్క విలువ తరిగి పోగలదు. జరీగూడ శ్రేష్ఠతరమగు వెండిజరీని యుపయోగింప వలసియున్నది. మాయజరీ వాడుటచేత జరీబట్టల వ్యాపారమునకు భంగము వాటిల్లుచుండును.

## ఉత్తరీయములు

తెలుగు దేశమునందుగల కర్షకులకును, కర్షకకార్మికులకును, పారిశ్రామికులకును, పారిశ్రామిక కార్మికులకును ముతక యుత్తరీయములు దస్తీరుమాళ్లు ప్రతిసంవత్సరము లక్షల కొలది ఖర్చగుచున్నవి. అట్టివారలకు గావలసిన ముతకయుత్తరీయములు పక్కారంగులద్దిన నూలుతో అంచులు కమ్ములు వన్నెల నమర్చి తయారుచేయించి ఖర్చులెక్కువగా చేరనీక సరసమయిన వెలలకు ప్రతిపట్టణమునందును ప్రతిపల్లె యందును పండుగ దినములలో విక్రయించినట్లులయిన విరివిగా విడుదల కాగలవు. ఈ వ్యాపారము క్రమక్రమముగా

అభివృద్ధి చెందించేయెడల కొన్ని సంవత్సరములలో మిక్కిలి గొప్పగా అభివృద్ధి పొందగలదు.

## కుట్టిన అంగీలు.

తెలుగుదేశమునందు ప్రతివత్సరము చలికాలమారంభములో యంత్రనిర్మిత వస్త్రములతో గుట్టిన యంగీలు లక్షల రూపాయలకు విక్రయింపబడుచున్నవి. ఈ విధమైన వ్యాపారము కొరకు సరసమగు ముతక తెల్లఖద్దరు పక్కారంగుల వన్నెలుగల ముతకఖద్దరుతో బనీనులు, అంగీలు, పిల్లలకంగీలు లాగులు, పావడాలు మొదలగునవి కుట్టించి పండుగదినములందు విక్రయించునట్లులయిన లక్షల రూపాయల వాణిజ్యము జరుగగలదు. ఒకప్పుడు చీరాలగ్రామమునందు ౨౦౦ కుట్టు యంత్రములతో ఆరుమాసములు రాత్రింబవళ్లు కుట్టిన యాంత్ర నిర్మిత వస్త్రముల యంగీల వ్యాపారము సాగుచుండెను. నేడుకుట్టిన యంగీలు విక్రయించి జీవించువారు తెలుగుజిల్లాలలో వేలకుటుంబములు గలవు.

## వివిధనిర్మితములు.

ముతకఖద్దరునూలుతో వలసంచులు. వలవుయ్యాలలు, బాడ్మెంటువలలు, టెన్నీసువలలు, నవారు, నాడ, లాంపువత్తులు, ఆఫీసుటేపు మొదలగునవి తయారుకావలసియున్నవి.

**పేపరుటాక్సు:**—ప్రతి ఆఫీసునకును కాగితములను కూర్చికట్టు దారము లవసరమయియున్నవి. వీటిని యిరువది నంబరునకు సరియగు శుద్ధ ఖద్దరునూలు ఆరుపోగు

లతో పేని అట్టిధారమును మూడేసిపేటలుగా కలిపి నట్టులయిన పేపరుటూకున్ననకు పనికివచ్చుచుండును.

దారపుండలు:—కుట్టుయంత్రములకును చేతితో కుట్టుటకును కావలసిన దారమును ఖద్దరునూలులో మిక్కిలి సాఫయినదానిని మూడుపోగులతో పేనిన తయారగును. ౨౪ నంబరుగల నూలుతో తయారుచేసిన ముదుగు దారమగును. ౨౮ నంబరు నూలుతో తయారుచేసిన ఎక్కువగా ఖర్చగుచుండును. 3౨ నెం. నూలుతో తయారు చేసిన మిక్కిలి సన్నవస్త్రములు కుట్టుట కుపయోగింపబడు చుండును.

ఖద్దరు గుండీలు:—ఖద్దరు గుండీలు తెలుగు దేశమునందు దొరకుటలేదు. దొరకిన అంత మంచివిగా చిక్కుటలేదు. వీటిని తయారు చేయుటవలన చాల కుటుంబములు జీవింపవచ్చును. తయారుచేయుట చాల సులభమయిన పని తన మగుచున్నది. విశాఖపట్టణమునందు చాల శ్రేష్ఠమయిన గుండీలు తయారగుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| ౧౨ గుండీలకు నూలు | ... | ... | ౦—౦—3 |
| కూలి | ... | ... | ౦—౦—౬ |
| విక్రయించువారికి లాభము | | ... | ౦—౦—3 |
| ౧౨ గుండీల వెల | ... | ... | ౦—౧—౦ |

కుర్చీలకు పట్టులు, మడత మంచములకు పట్టులు, సంచులు, సరసమయిన వెలలకు పరుపులు, దిండ్లు, మొదలగునవి పలు రీతుల సామాగ్రిని ఖద్దరునం దుత్పత్తి చేయుచు ప్రతి

చోటను విక్రయమునకు దొరకునట్లు లేర్పాటు చేయవలసి యున్నది.

దో మ తె ర లు.

పంజాబు దేశమునందు మిల్లునూలుతో దోమతెరలు నేయు మగ్గములు ౨౦౦౦గలవు. సాలునకు ౨౦ వేల తెర లెగుమతి యగుచున్నవి,నిర్మితవస్తువులను నూతనపద్ధతితో అభివృద్ధిచేసే యెడల పెంపొందుటకిది యొకనిదర్శనము. శుద్ధఖద్దరుతో దోమ తెరలు తయారుచేసి విక్రయించుటవలన చాలా వ్యాపారము జరుగగలదు.

---

# ౨. ఉన్ని పరిశ్రమ.

---

భారతదేశమునందు గల ఉన్ని పరిశ్రమలో కొన్ని మార్పులు చెందవలసియున్నది. చేతిమగ్గములమీద ఉన్నితో నేయబడు కంబళ్ళు మొదలగునవి రెండనులతో నేయబడు చున్నవి. రెండనులకు బదులు నాలుగనులతో నేసి నట్టుల లయిన కంబళ్ళు మిక్కిలి తరచుగను యందముగను యుండును. వాటియందుండు వన్నెలుగూడ మిక్కిలి యలం కారముగలిగి విక్రయమునకు వ్యామోహముతోగూడి యుండును. పడుగునందు ఖద్దరునూలు పేకకు సన్నగ వడకిన ఉన్నిదారమును పెట్టి షట్టింగు, కోటింగు, తానులు నేయ వచ్చును. కంబళ్ళుగ నేయువాటియందు అంచులకును కమ్మి

లకును పేట్లుపెట్టుటయు మధ్యచారలతో రంగులవన్నెలు చేర్చిన యెడల ఎక్కువ కూలిగిట్టుచుండును. ఉన్నితో తక్కువ ఖరీదుగల చిన్న తివాసీలు తయారుచేసి సరసముగా విక్రయించినట్టులయిన ఎక్కువగా ఖర్చగుచుండును.

నిజామురాష్ట్రములో షైరాలయను గ్రామమునందు పడుగునకు ప్రత్తినూలుపెట్టి పేకకు ఉన్నిదారమును నేసిన కంబళ్ళకు పక్కారంగుల చార లమర్చబడినవి చూచితిని. ఇవి నాలుగనులతో నేయబడియున్నవి. మిక్కిలి యందముతో లలిత కళాకౌశలమును గూడియున్నవి. ఈ శాలువ లీ గ్రామమునందు ౧౯౨౧ సం॥ము నుండి నేయబడుచున్నవి. ఒకప్పుడు చాల మగ్గములపై నేసి బొంబాయియందు విక్రయింపబడుచుండెను. ఇప్పటికిని ఈ ప్రాంతమునగల నాగరీకులందరు వాడుకొనుచున్నారు. అందమయిన కంబళ్లు, నాణ్యమైన గొంగళ్లు, శ్రేష్ఠతరమయిన రగ్గులు పట్టణములందును, పల్లెలందును సంతలందును విరివిగా విక్రయమగుచున్నవి.

౧౯౩౮ సం॥ మే నెల ౧౩ తేది కామన్సు సభలో "వార్డామిలీ"గారు భరతదేశపు తివాసీల దిగుమతివలన దేశీయ పరిశ్రమకు అపాయము వాటిల్లుచున్నదని ప్రశ్నించియున్నారు.

మేరి రాణిగారు ఇండియా తివాసీని కొనుట.

౧౯౩౭ సం॥ ఫిబ్రవరి "బ్రిటిషు పారిశ్రామిక ప్రదర్శనమున నేతపరిశ్రమశాఖను రెండుఘంటలసేపు చక్రవర్తిని (మేరిరాణి)గారు సందర్శించి '౧౧౦ గిన్నీలకు(రు ౨౧౦౦లకు) అమృతసరులోతయారయినఎరుపునీలపురంగుగలతివాసీనిబకింగ

హాం మందిరము కొఱకు ఇండియా ప్రభుత్వశాలయందు ఆమె కొనెను." 1. ఈ వార్తలనుబట్టి భారతదేశపు నివాసుల కిప్పటికిని పరదేశములం దభిమానము గలదని తేలుచున్నది.

పేరెన్నికగల ఉన్నికంబళ్లు, గొంగళ్లు, జోరాలు, ఈదుమూడి, ఆదోని, బళ్ళారి, కర్నూలు, మైసూరులందును నిజాము రాష్ట్రములోను విరివిగా తయారగుచున్నవి. వనపర్తి స్టేటులో శ్రీరంగపురం గద్వాల, కుతునర్తి మొదలగు జాతరలలో నాటు ఉన్నిసరకు లక్షలకొలది విక్రయమునకు వచ్చుచున్నవి. వాడుకకు కొనువారలేగాక పెట్టుబడి వ్యాపారులును నగరవాసములందు ఉన్నిసరకు విక్రయించు పెద్దపెద్ద వ్యాపారుల ఏజంట్లును గుమాస్తాలును ఎక్కువగా కొనుగోలు చేయుచుందురు. ఇట్టి పెద్దవ్యాపారములు పలుచోట్ల యున్నట్లుల తెలియుచున్నది.

గుంటూరుజిల్లా బాపట్లతాలూకా ఈపుమూడి గ్రామమునందును పరిసరగ్రామములందును గొంగళ్లు జోరాలు వందల మగ్గములందు తయారగుచున్నవి. ఈ సరకు ఎక్కువగా సేలంజిల్లా, తిరువాన్కూరుస్టేటుల కెగుమతి యగుచున్నది. ఈ సరకునకు ఆ ప్రాంతములందు చాల విలువగలదు.

1. ఆంధ్రపత్రిక ౨౨ ఫిబ్రవరి ౧౯౩౫ సం॥ ౪ పే

# ౩. నారపరిశ్రమ.

నారను సన్నగవడకి పలురీతుల రంగులద్ది నాలుగనుల నేతతో నేసినయెడల నెన్నియో విధముల రంగుల పట్టలుపయోగపడగలవు.

౧ మొడతమంచములకు

౨ కుర్చీలకు

౩ మంచములపై పరచుటకు

౪ నేలపయి పరచుటకు

౫ అందమయిన సంచులు కుట్టుటకు

శ్రేష్టతరమగు పట్టలకు రంగులతో నద్దకము లద్దినట్టులయిన చాల యలంకారముతో విరాజిల్లుచుండును. లావుగా వడకినదారముతో నేసిన పట్టలతో ధాన్యాదులుంచు గోనెలు మొదలగువవి తయారుచేయింపవలెను.

పూర్వకాలమునందు విశాఖపట్టణంజిల్లాలో వేల మగ్గములపయి నార గోనె పట్టలు నేయబడి పరదేశముల కెగుమతి చేయబడుచుండెను.

చాల ముదుగు పట్టలపయి అందమయిన రంగు లద్ది పరదాల కుపయోగింపవచ్చును.

గోనె సంచులు కుట్టుటకును, మూటలు కట్టుటకును, పందిళ్ళు శాలలు తాత్కాలికముగా నిర్మించుటకును, తోరణములు కట్టుటకును యంత్ర నిర్మితమగు నారధారము వాడబడుచున్నది. ఇట్టి వాటి కంతకును హస్త నిర్మితమగు నారను

వాడుకొనుట కారంభించిన కర్షకులకు తీరిక దినములందెక్కువ పని చేకూరగలదు. మంచములకు నులకత్రాడు పేను చందమున ఈ దారముగూడ విరివిగా తయారు కాగలదు. తెలుగు దేశమునం దన్ని ప్రాంతములందును ఈ పరిశ్రమకు చాల యవకాశముగలదు.

ప్రపంచమున కంతటికిని గోగు, జనపనార భారత దేశమునుం డెగుమతి యగుచున్నవి. ముడినార పంపుటకు బదులు , కొంత వస్తురూపముగా తయారుచేసి పంపుట మన దేశమునకు పారిశ్రామికాభివృద్ధియు నిరుద్యోగ సమస్య వినాశమును ఆర్థిక లాభమును చేకూరగలదు.

## ౮. పట్టు పరిశ్రమ.

భారతదేశమున జరుగుచున్న పట్టు వ్యాపారములో ౧౦౦ కి ౯౦ పాళ్లు రాటములమీదను చేతిమగ్గములమీదను నాధారపడి యున్నది. పట్టునడకుటలో ౧౦౦ కి ౭౫ పాళ్లు వస్త్ర నిర్మాతల గృహములలోను కర్షకుల గృహములందును వడకుచున్నారు. ఇవ్విధముగా దేశమున కెంతో మేలు చేకూర్పవలసిన పట్టు పరిశ్రమలో గొప్ప లోటొకటి గూడి యుండుట చాల విచారకరమయిన విషయము. ప్రపంచమున కంతటికిని భారతదేశమున పండుచున్న పట్టు మిక్కిలి శ్రేష్ట తరముగనున్నది. భారతదేశ పట్టు బట్టల వ్యాపారులు తమ స్వలాభమునకుగాను చైనాపట్టును, ఇటలీ జపానుదేశముల

కృత్రిమపు పట్టును తెప్పించి దేశాదాయమునకు కొఱత చేకూర్చుచున్నారు. పరదేశములందు నివసించు భారతీయు లీనాటికిని దేశాభిమానమును విడక స్వదేశీ పట్టు బట్టలను విరివిగా తెప్పించుకొనుచునే యున్నారు. వారి దేశాభిమాన మునకు సరియగు పట్టు బట్టలను పంపుటకు బదులు పరదేశపు పట్టుతో నిర్మించినపట్టు బట్టలు చేరుచున్నవి.

బనారసు, పునా, నైజాము రాజధానిలోని సిద్దిపేట బళ్ళారిజిల్లాలోని రాయదుర్గము మైసూరు రాజధానిలోని మలకాలమర్రు మొదలగు ప్రాంతములలో ప్రశస్తములయిన జరీబుతాల చీరెలు చాల విలువగల జరీ పట్టుతాప్తాలు నేయ బడుచున్నవి. బెంగుళూరు, కంచి, సేలము మొదలగు ప్రాం తములందు పెద్దపెద్ద అంచులు గల రంగుల పట్టు చీరెలు విశేష ముగా తయారగుచున్నవి. పట్టు వ్యాపారులలో ఎచ్చటను సమష్టి సంఘములుగాని, ఐకమత్యతగాని, వస్త్ర నిర్మాతల కష్టములు విచారించు సంఘములుగాని లేనందున వ్యాపారము చాల దుస్థితి పాలగుచున్నది. ౨౫౦ రూ. విలువగల జరీ బుతాల బనారసు చీరె ౧౦౦ రూ ల వరకు తగ్గిపోయినది. ౬౦ రూ. విలువగల బెంగుళూరు చీరె ౨౦ రూ. వరకు తగ్గి యుండెను. ధరలు తగ్గు కొలది మైసూరు పట్టునకు బదులు చైనా జపాను పట్టును నాణ్యమయిన ౭౫౦ గ. మొదలు ౧౦౦౦ గ. వరకు యుండవలసిన జరీకి బదులు ౨౦౦౦ గ. పొడవు గల మిక్కిలి సన్నని జరీ వాడబడు చుండుటచేత వస్త్ర ములో గొప్ప తనము నశించి విక్రయము నీరసించుచున్నది.

ధరలు తగ్గినను షాహుకారి ౧౦౦ కి ౨౦ రూ. లాభమునకు బదులు ౧౦ రూ. లయినను సంపాదింపగలుచున్నాడు. వస్త్ర నిర్మాత కట్టులగాక నె ౧ కి రు ౩౦ లు సంపాదింపవలసినవాడు షాహుకారిచేత దినదినము కూలీలుతగ్గింపబడుచు సగటున నెల ౧కి ౧౦ రు. గిట్టునట్టి దుస్థితి పాలగుచున్నాడు. జగత్కీర్తి గాంచిన జరీ బుతాల, భారతదేశ పట్టునేత వస్త్రముల శిల్పి ౧౦ రు లతో మాసజీవనము గడపవలెనన్న పరిపూర్ణార్థిక దుస్థితి పాలయినాడని వేరుగ చెలుపనక్కర లేదు.

భారతదేశమునందుగల పట్టు పరిశ్రమను పునరుద్ధరించి మంచి జరీయును; దేశీయపట్టును, పక్కా రంగులు గల పట్టు బట్టల వ్యాపారముతో నొకరినొకరు పోటీ చేయకుండులాగున ఒక గూడుకట్టు ఏర్పడవలెను. అట్టు ఏర్పరచిన యెడల దేశమునకు గొప్ప లాభము చేకూరగలదు. పట్టు పండించు రయితు, పట్టు వడకువారు, పట్టు వస్త్రములు నేయువారు, సుభిక్షముగ జీవింప గలరు. ఇందుచేత పట్టు పంట స్వదేశమున మిక్కిలిగా పెరుగుచుండును. పట్టు పరిశ్రమవలన వృద్ధి పొందిన ధనముగూడ దేశమును వీడజాలదు. పట్టు వస్త్ర పరిశ్రమవలన నేడు భారతదేశమునందు పురుగులను పెంచి పట్టు పండించుట మొదలు వస్త్రము విక్రయించు షాహుకారితో సహా లక్షల కొలది జనులు జీవించుచున్నారు. పునరుద్ధారణ జరిగినట్లు లయిన కోట్లకొలది జనులకు పని గలుగును. గనుక పట్టు పరిశ్రమ నూతన వికాసము పొందుట చాల నవసరమయి యున్నది.

## ౫. కొబ్బరినార.

ఇండియాదేశపు కల్పవృక్షమైన కొబ్బరిచెట్టు (కొకొస్ న్యుసిఫెరా) 'తూర్పు దేశముల పెన్నిధి.' యని న్యాయముగా పిలువబడుచున్నది. ఆహారము, భోగము, దుస్తులు, గృహములు, పాత్రలు, పనిముట్లు విషయమునను ఈ జాతి యందలి ఏదైన ఇతర వృక్షముకంటె ఎక్కువ ఉపయోగమువలన మనిషికి బహు విలువయగు వృక్షమగుచున్నది. మనిషికి పంచదారను, పిండిపదార్థమును, నూనెను, మైనమును, దారమును, సజ్జాకరము (రెసిక్) వగరు పదార్థమును, తినుటకు పండ్లను యిచ్చును.

ఇండియా దేశీయులు కాయలను కోయుచురు, దుస్తులు, కంచము, పానీయము, చిప్ప, పడవ మోకు, ఎరువు, సూది ఇవి యన్నియు ఆ ఒక దానినుండియే లభించగలవు.

(జి. హెర్బర్టు)

"కొబ్బరిచెట్టుయొక్క ప్రతి భాగమును ఉపయోగపడునదై యున్నవి. "ఆకులు (ఇండ్ల) పై కప్పులకును, లేత పొగాకు తోటలకును, తోట్లతో పెంచబడు పైరులకును నీడ నిచ్చుటకు పనికి వచ్చును, దేశీయుల పుణ్యము వలన కొబ్బరి పెంకులు, పళ్లెములు, దొన్నెలు, తెప్పలు, గిన్నెలు అగుచున్నవి. ఆకుల యీనెలు బుట్టలును, చీపుళ్ళును అగుచున్నవి ప్రమానులు నీటి గొట్టములుగాను, కట్టడములకు కలపగాను

అమరును. కాయలు, భోజనము, పానీయమును, నూనెయు నిచ్చుచున్నవి".

(కా. శేషాచలంచౌదరి)

ముదురయిన నల్లని కొబ్బరికాయను తెచ్చి రంధ్రము వేసి నీరు చేర్చినట్టులయిన కొబ్బరి కొన్నిదినములకు ముదిగి వీడి పోవును. అట్టి కాయయొక్క పైభాగము నునుపుచేసి కాయ కంతటను శిల్పమును చెక్కెదరు. ఈ శిల్పములో భూలోకసుం దరంబగు రమణీయంబైన ప్రకృతియు, వ్యక్తుల స్వరూపములు, దేవతా శిల్పములు మొదలగునవి చిత్రింపబడుచుండును. పరి పూర్ణ లలితకళావికాశ ముట్టిపడునట్టి శిల్పమును ఒకే చిన్న యలుగుతో ఎంగ్రేవింగు చెక్కిన రీతి శిల్పి చిత్రించుచున్నాడు. ఇట్టి ప్రాశస్త్య శిల్పకళాధురీణత్వము పాండ్య దేశమునందు కనుల పండువుగ గాంచగలము. మళయాళదేశీయులు కొబ్బరికాయల

మదరాసు పారిశ్రామిక శాఖవారు. కా. శేషాచలం చౌదరి, ఎం. ఏ. (మదరాసు) ఎం. యస్., సి. (లీడ్సు) ఏ.ఐ.సి. లెదర్ రీసర్చి కెమిస్టు, గారిచేత తంజావూరు జిల్లాలో పరిశోధన జరిగించినట్టి "నారను తయారు చేయుట కొబ్బరి పీచును ఊర వేసి దానినుండి మెత్తని పదార్థమును తొలగించుట" యను ౩౦ నెం. కరపత్రమును గాంచితిని. పరిశ్రమకు గావలసిన సమస్త విషయములు సమగ్రముగాను, ప్రతి వారికిని సులభ ముగా యర్థమగు లాగునను వ్రాయబడియున్నది. దీనిని ప్రతి వారు చూచుట చాల యవసరము.

మీద శిల్పము చెక్కుటలోను, కొబ్బరి పీచుతో చాప లల్లుట లోను చాల ప్రసిద్ధి గలిగి యున్నారు.

చెన్నరాజధానిలో ౧౦ లక్షల ఎకరముల కొబ్బరితోటలు గలిగియున్నవి. తూర్పుగోదావరి జిల్లాలలోమాత్రము ౫౨౫౮ ఎకరముల కొబ్బరి తోటలు గలవు. చెన్నరాజధానిలో ౧౦౦ కి ౧౦ వ వంతు గూడ కొబ్బరినార పరిశ్రమ గాన్పించుటలేదు. కొబ్బరిపీచు తూర్పుతీరమున వంటచెరకుగా వాడుచుండుట చాల విచారకరముగ నున్నది. కొబ్బరినారను మెత్తపరచి త్రాళ్లు, చాపలు, సంచులు, పాదములు తుడుచుకొను తివాసీలు, మొదలగునవి అల్లుట ప్రారంభింపవలెను. తూర్పు తీరమున ఈ పరిశ్రమను ఎంత వృద్ధి పొందించిన అంత మేలొన గూడ గలదు. కొబ్బరి చిప్పలతో సుందరములగు దొన్నెలు, గిన్నెలు, తెడ్లు గాక ప్రశస్తములయిన కప్పు గుండీలు, కోటు గుండీలు, తయారుచేసి వాటిపయి లలితశిల్పమును చిత్రించిన మిక్కిలి యందముగా నుండును.

కొబ్బరి పీచుతో బంగారుగొలుసులవలె నందములగు అల్లికలనల్లు చుందురు. వీటిని గడియారములకును, పిల్లల మెడలయందును ధరించు చుందురు. ధరించినప్పుడు చాల యందముగ గాన్పించు చుండును.

౪ తక్కువ వెలగల పెట్టెలను ఏనుగుదంతమునకు బదులు ఖణితి మృగముయొక్క కొమ్మును మంచిగంధపు చక్కకుబదులు కదంబలేక కంబచక్కతోను కొమ్ముతోను నిర్మింపబడుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| పెట్టెలు రు ౫/ మొదలు | ... | ... | రు ౧౦౦౦ |
| గోపికా వస్త్రాపహరణము | ... | ... | రు ౫౫౦ |
| ఫొటో ఫ్రేము ౧౦ మొ | ... | ... | ౫౦౦ |
| పచ్చిసుబల్ల | ... | ... | ౬౫ |
| చేతికర్ర | ... | ... | ౬౦ |
| వ్రాతకలం పుల్ల | ... | ... | ౫ |

దువ్వెనలు, అలంకారపుపిన్నులు, దండచేతికడియములు, గాజులు, మొదలగు యాభరణములుగూడ తయారగుచున్నవి. ఒక స్త్రీ ధరించు దంతపు నగలన్నియు కలసి ౧౦౦౦రు/ వరకు ఖరీదగు చుండును.

---

## ౨. తిరువాన్కూరు దంతపుపరిశ్రమ.

పాండ్యదేశమునందు గల తిరువాన్కూరునందు గూడ దంతపు పరిశ్రమ చాలప్రసిద్ధి గలిగి యున్నది. ఒక గురిగింజలో అవయవములు పూర్తిగాగల యేనుగలను నాలుగింటిని ఇముడ్చుచున్నారు. ఈ శిల్పముచాల సున్నితమయినది. ఇంత సున్నితముగ దంతపు కోతపని ఎచ్చటను గానవచ్చుటలేదు.

మరియు ఏనుగుల సమూహముల నిర్మాణము, విగ్రహ పరిశ్రమ వీరియందతి రమణీయముగ తయారగుచున్నది విగ్రహములను దంతములో చెక్కుటయందు పాండ్యదేశమునకు సమానమగు శిల్పులు ప్రపంచమునందెచ్చటను లేరని ఘంటాపదముగ దెలుపవచ్చును. వీరి దంతపువిగ్రహ శిల్పమున సజీవరూపము ప్రకాశమానముగను స్ఫుటముగను కానవచ్చుచుండును.

## ౬. చందనపు పరిశ్రమ.

ప్రపంచమునం దంతటికిని చందనపుకొయ్య, చందనపు నూనె, చందనశిల్పపు వస్తువులు మైసూరు రాజధానినుంచి ఎక్కువగా ఎగుమతి యగుచుండును. చేతికర్రలు, కలంపుల్లలు, గుండీలు, ప్రతిమలు, పెట్టెలు, భరిణెలు, దువ్వెనలు, ఫొటోగ్రేఫులు, స్పూనులు మొదలగునవన్నియు మైసూరు రాజధానియందు మైసూరు యడవులలో దొరకు చందనపు కొయ్యతో తయారు చేయబడుచున్నవి.

బొంబై మ్యూజియం రెండోయంతస్థులో ౫ నెంబరు రూమునందు మైసూరు శాండిల్ ఉడ్ వర్క్సువారు పంపిన చందనపుపెట్టె యుంచబడియున్నది. ఎత్తు ౨ అ; పొడవు ౨అ. వెడల్పు ౧౪ అడుగులు గలిగి చుట్టు ప్రకృతివైభవమునుజూపబడియున్నది. ఇవ్విధముగా నిండుజీవ ముట్టిపడునట్టి ప్రకృతిశిల్ప

నైపుణ్యమును చందనపు పరిశ్రమయందు జూపినవారిని నేను చూచియుండలేదు. దినములకొలది చూచినను అందుగల మహాశిల్పవైభవము తనివి తీర నేరదు.

---

## ౧౦. కొమ్ముపరిశ్రమ.

### పర్లాకిమిడీ కొంగలు.

కొమ్ముసామానులు చేయుటయందు భారతదేశమున చాల నిపుణత్వముగలదు. పర్లాకిమిడియందు సుప్రసిద్ధముగల కొమ్ముతో కొంగలు తయారుచేయుబడుచున్నవి. ఈ కొంగల యందుగల భావప్రదర్శనము, ఉనికి, చూపు, నిశ్చలత్వము, ఆకారము నిజమయిన కొంగలను మరపునకు తెచ్చుచున్నవి. హిందూదేశమునగల యన్నిప్రాంతములకేగాక సమస్త పరదేశములకును విరివిగా యెగుమతి చేయుబడుచున్నవి.

### దువ్వెన.

భారతీయులు కొమ్ముతో దువ్వెనలు తయారుచేయుటలోగూడ చాల నిపుణతగలిగియున్నారు. దువ్వెనలయొక్కయాకారమునందు, సింహములు, పులులు, నక్కలు, జింకలు, గోవులు, ఏనుగలు, గుర్రములు, పక్షులు మొదలగు విధములుగా చూపు వాడుకగూడకలదు. ఒక్కొక్క దువ్వెన రు ౦—౦—౩ లు మొదలు రు ౦—౮—౦ ల వరకు ఖరీదునకు విక్రయింప బడుచున్నది. వీటియొక్క పనితన

ములో ముఖ్యముగా నునుపుదనము మెరుగు సమకూర్చిన యెడల వ్యాపారమునకు మిక్కిలి వ్యామోహితమగుచున్నవి. కొమ్మునకు మెరుగు కొన్నివిధములగు చెట్లయాకులతో పెట్టు చుందురు. బరహాం పురమునందొక సంతలో విచిత్రయాకారములు గల దువ్వెనలను గాంచితిని. చూచుటకెంతో మనోహరముగ యుండియున్నది.

విశాఖపట్టణమునందు కొమ్ముతో, చేతికర్రలు, కలము పుల్లలు, గుండీలు, విగ్రహములు మొదలగునవి మిక్కిలి సుందరముగా తయారగుచున్నవి.

బొంబాయి రాజధానిలో చాలప్రసిద్ధిగల కొమ్ము పరిశ్రమగలదు. రత్నగిరిలో తయారగు కొమ్మువస్తువులకు పరదేశములందు గూడ ప్రసిద్ధిగలిగియున్నవి.

బొంబాయి మ్యూజియమునందు కొమ్ముతో తయారు చేసిన పూలచెట్టుచూచితిని. శిల్పి పరిపూర్ణకళాకౌశలమెంతో సౌందర్యముగ జూపియున్నాడు. అరంగుళములుగల' పళ్లెరము (ప్లేటు) ఒకటి ఈ పూలచెట్టు ప్రక్కనగలదు. ఇంతపెద్దకొమ్ము సేకరించుటలో చాల యాశ్చర్యము గలుగుచున్నది.

## ౧౧. ఉదయగిరి కొయ్యసామానులు.

నెల్లూరునకు ౬౦ మైళ్లదూరమునందున్న ఉదయగిరి యందు ప్రాచీనకాలమునుండి పేరెన్నికగల వడ్రంగపు శిల్పు

లున్నారు. ఇక్కడగల కొండయందు నాటురకముల కలప కావలసినంత దొరుకుచుండుటచేతను, దగ్గరలోనున్న వెలి గొండలయందు నాటుకలప విశేషముగా యుత్పత్తి యగుట చేతను, ఇక్కడగల శిల్పులు నాటుకొయ్యతో ప్రావీణ్య మయిన కొయ్యసామానులు చేయగలుగుచున్నారు.

పాలబరిశె, గుగ్గిలం, కొండరేగి, పొలికి, కశే, చీకిరేణి, పెద్దబిక్కి, నల్లవారుడు, మొదలగు నాటుకలపను వాడుదురు.

ఎరుపు, మామిడిచిగురు, రోజా, తెలుపు మొదలగు మనోహరమయిన రంగులుగల కలేకొయ్యతో మహాశిల్పంబగు అంతరాళపుపనులు చేయుచుందురు. తెల్లనిదగు పాలబరిసె, నల్లనిదగు నల్లవారుడుకొయ్యలతో గూడ చాల విలువగల సామానులు తయారగుచున్నవి. వ్యాపారులు ఇతర వస్త్రం గులు లక్ష్యపెట్టని కలే, పాలబరిసె, నల్లవారుడు కొయ్యలే ఉదయగిరి మహాశిల్పులయొక్క గొప్పతనమునకు గల శిల్ప మునకు ఆధారభూతమగుచున్నవి.

సుందరములగు మిల్లిగరిటెలు, పెద్దగరిటెలు, పాదు కలు, మోటుగరిటెలు, అబకలు, కుర్చీలు, పడకకుర్చీలు, బల్లలు, తరివెన మంచములు, మోటు మంచములు, పళ్లెర ములు, టీ కప్పులు కాటా(రొట్టెభుజించునది) బతయ (కాగి తములు కోయుకత్తి) నమ్మక్‌దాన్ (ఉప్పుతొట్టి) మొదలగు నవెన్నియో తయారగుచున్నవి.

పరస్థలముల కోత లలిత శిల్పము గల స్పూనులు, కాటాలు, బత్తయిలు, నమ్మక్‌దానులు మొదలగునవి ఇంగ్లాం

డమెరికా మొదలగు పరదేశముల కెన్ని వేల వస్తువు లేగెనో తెలుపుట కసాధ్యముగా నున్నది.

ప్రదర్శనములందును, సంతలందును, విక్రయశాలలందును ఈ శిల్పవస్తువుల కవకాశమిచ్చినట్టులయిన ఈ పరిశ్రమ పదిరెట్లు పెంపొందగలదు.

భారతదేశమునందన్ని ప్రాంతములందును పై విధములగు కొయ్యసామానులను ప్రీతితో వాడుచున్నారు. ఈ పరిశ్రమను యువకులు చక్కగ నేర్చుకొని ప్రతి పట్టణమునందును ప్రతిపల్లెయందును తయారు చేసేయెడల మంచి ఆదాయము చేకూరగలదు.

---

## ౧౨. కొయ్యబొమ్మలు పాత్ర సామానులు.

---

వాడుక కుపయోగించు కొయ్యపాత్ర సామానులు మన ప్రాంతమునకు తిరుపతియందును ద్రావిడదేశమున పలు ప్రదేశములందును విక్రయింపబడుచున్నవి. ఈ పరిశ్రమలో నూతనవిధానము కానరానందున చాల నీరసముగానున్నది. ఇందలంకారములగు పళ్లెరములు చిత్రములగు పాత్రసామానులు కాలానుగుణముగా మార్పుచెందవలెను. ఆకారములు మోటుగా గాక నాజూకుగా కనుపింపవలెను. వీరు తయారు చేయు కొయ్యబొమ్మలలోగూడ సన్నని శిల్పము వ్యామోహితముగా నలరారునట్టుల చిత్రింపవలసియున్నది. అట్టిసామానులకు తప్పక గిరాకి హెచ్చును.

## ౧౩. కొండపల్లి కొయ్యబొమ్మలు.

---

కొండపల్లెయందు తయారగు కొయ్యబొమ్మలలో నాకర్షణాశక్తి చాల గొప్పగనున్నది. ఈ బొమ్మలలో పాంచాలకాయంత్రపు పద్ధతి చేర్చుటవలన నూతనశోభ చేకూరగలదు. నేడు జపానువారి బొమ్మలయందు గానవచ్చు యంత్రవిధానమును పాంచాలికాయంత్ర నిర్మితము లనవచ్చును. కొండపల్లి బొమ్మలయందుగల సైనికులు, ఏనుగలు, గుఱ్ఱములు, గోవులు, కుటీరములు, కల్లుగడి, కల్లుగీత, మొదలగు వాటియందు యంత్రచలన మేర్పడిన వాణిజ్యము పలురీతుల పెంపొందెను.

---

## ౧౪. నక్కపల్లి కొయ్యసామానులు.

---

నక్కపల్లి, కుప్పాక తరిపెన కొయ్య బచ్చెన సామానులయందుగల లక్కలోని మెరుగు తరిపెనలోని శిల్పచతురత పొగడదగియున్నది. అలంకారసామానులుగాక వాడుకసామానులుగూడ వీరు నిర్మించుటవలన వాణిజ్యము ఇనుమడింపగలదు. వీరి సామానులలో ఒక్కభరిణెయందు పదిభరిణెలుండుట, ఒక్కకాయయందు పదికాయలుండుట, చదరంగపు సామానులు మొదలగునవి విశేషముగా పరదేశముల కేగుచున్నవి.

నైజాంకాలేజి ఇండస్ట్రియల్ ఇన్స్టిట్యూటునందు నక్కపల్లి బచ్చైనపద్ధతిగల కొయ్య చిత్రపుసామానులు తయారు చేయుటనుగూర్చి నేర్పుచున్నారు. చిన్నచిన్నపిల్లలు మిక్కిలి యుత్సాహముతో శ్రద్ధకలిగి అందముగుసామానులు తయారు చేయుచున్నారు. వీరిపరిశ్రమవలన జీవింపగలుగుట కుపయుక్తమగురీతితో నేర్పుచుండుట అభినందనీయమగుచున్నది. భారత దేశమునందుగల ప్రతిపాఠశాలయందును దినమున కర్థకాలము వృత్తిపరిశ్రమలు నేర్పుటవసరము.

---

## ౧౫. పటములకు చట్టములు కట్టుట-జీడినూనె

పటములకు చట్టములు కట్టుటకు దేశీయమయిన కొయ్యతో చాలవిధములుగ తయారుచేయవచ్చును. దేశీయ పద్ధతిగల చట్టములు చాల యందముగా కానవచ్చుచున్నవి. దేశవాళిచట్టములను తయారుచేయుచు వాడుకకు తేవలెను. నల్ల రేగడమట్టిలో "పికాకుబ్లు" యున్నటుల తెలియవచ్చుచున్నది. ఈ రంగు చాల సరసముగ గిట్టగలదు. ఇంతసరసముగ ఏ రంగునుగిట్టచాలదు.

కొయ్యకు రంగులెక్కించుటకుగాను జీడి (జీడిపక్కుల) నూనె చాలశ్రేష్ఠమైయున్నది. జీడి నూనెతో కొయ్యకు రంగు లెక్కించిన యెడల రంగులరుగుటగాని మెరుగు తగ్గుటగాని యుండ నేరదు.

జీడి నూనెపూసిన కొయ్య నీటిలో నానినను వర్షమునకు తడిసినను చెడనేరదు. భూమిలో పాతినను మట్టితినజాలదు.

మంగుళూరు, గోవాయందు తయారగుచున్న లక్షల కొలది రూపాయల జీడినూనె అమెరికాదేశమున కెగుమతి యగుచున్నది. అక్కడనుండి పరదేశములకు పంపబడుచున్నది. వారు ముఖ్యముగా కొయ్యలకును, కొయ్యలకెక్కించు రంగులలోను వాడుచున్నారు. 1.

## ౧౬. లక్క పరిశ్రమ.

ప్రాచీనకాలమునుండి భారతదేశమునందు లక్కను చెట్లపాలతో తయారుచేసి చాలపనుల కుపయోగపరచుచున్నారు. త్రిపురాసురులు లక్కతో కోటను గట్టించి యున్నారు. పాండవులకొఱకు సుయోధనుడు లక్కగృహమును తయారు చేయించెను. విశాఖపట్టణంజిల్లా నవరంగపూరు నందు లక్కతో నగలు చేయుచున్నారు. ఇవి చాల సుందరములయి రత్నపు నగలవలెయుండును. రంగూనునందు తయారగుచున్న మిక్కిలి యందమగు పళ్లెరములు, భరిణెలు, పెట్టెలు, మొదలగునవి ఎదురుపేళ్లతో నల్లి లక్కను నిండుగ పూయబడి చాల ప్రకాశవంతముగ జూపబడుచున్నవి. బచ్చన

1. జీడినూనె. క. రోసిరెడ్డి, వి. సరసయ్య అండు కంపెని నవాబుపేట, లింగబలిజెవీధి, నెల్లూరు వారు తయారుచేయుచున్నారు. దురదృష్టము చేత వీరి పరిశ్రమ అభివృద్ధి చెందకుండుట చాల విచారకరము.

పూయురంగులన్నియు లక్కతో తయారు చేయబడుచుండును. మురణాబాదు ఇత్తడి సామానులలో రత్నములవలె మెరయునట్టి పదార్థము లక్కతో చేయుచుందురు. అగసాలికి లక్క చాల యవసరమగుచున్నది. మిక్కిలి పక్కాగలిగి చాలయందముగానుండు ఎరుపురంగుగల పట్టునకు లక్కతో చాయ వేయుదురు. దీనినే లక్కతట్టుయందురు. చర్మములమీద లక్కతో శ్రేష్ఠతరమగు ఎరుపురంగెక్కించుచున్నారు. మరియు ఎన్నో రీతుల యుపయుక్తమగుచున్నది. ఇట్టి లక్కపరిశ్రమలను పునరుద్ధరింపవలసిన యవకాశము గానబడుచున్నది.

## ౧౭. ఇత్తడి సామానులు.

ఇత్తడిసామానులు తయారుచేయుటలో రాయవేలూరు, కుంభకోణం, పూనా మొదలగు ప్రాంతములు చాల ప్రసిద్ధిగాంచియున్నవి. నాటుపద్ధతితో ఘట్టితరమగు పాత్ర సామానులు చేయుటలో కోటపాడు, పార్వతీపురం, బొబ్బిలి, అనకాపల్లి, పెద్దాపురం, ఎలూరు, కాకినాడ మొదలగు ప్రదేశములు చాల పేరెన్నిక గలిగియున్నవి. ఈ నాటుసామానులు నగరములందుగల అంగడులందును, సంతలందును, జాతరలందును, తిరునాళ్ళయందును విపరీతముగా ఖర్చగుచున్నవి. పాటకపుజనులు ఈ ఘట్టితరమగు పాత్రసామానులను ప్రేమతో కొనుచున్నారు.

అల్యూమిని వ్యాపారము పెరిగిన తరువాత ౧౦౦కి ౬౦ పాళ్ళు కంచుసామానులకు, ౫౦ పాళ్ళు ఇత్తడి సామానులకును వ్యాపారము తగ్గియున్నది.

కాఫీహోటేలున్ను పెరిగినకొలది జపాను జర్మనీదేశపు ఇత్తడిగ్లాసులను చిన్నగిన్నెలనే కొనుచున్నారు. గాని ఎక్కువకాలము మనగల స్వదేశీ ఇత్తడిగ్లాసులు చిన్నగిన్నెలు కొనుటచాల అవసరమైయున్నది. వీరు దేశీయ సామానులు కొనుట చాల యవసరము. వీరి సామానులను తయారు చేయుటవలన వందలకొలది జనులు జీవింపగలరు.

## ఇత్తడి వేడుకసామానులు.

హిందూదేశమునందుగల అన్నిభాగములందును ఇత్తడి వేడుకసామానులు చేయుచున్నారు. ఉత్తర హిందూదేశమున జయపూరులో ఇత్తడి సాదా వేడుకసామానులు ప్రసిద్ధిగలవి తయారగుచున్నవి. మురదాబాదునందు చెక్కడపుపనిచేసిన ఇత్తడిసామానులు తయారగుచున్నవి. వీటియందు చూపు పనితనమునకుతోడు మధ్యమధ్య రత్నములు తాపినట్టుల రంగుల లక్కను కూర్చుచున్నారు. కూర్చినది లక్కయని తలంప వీలులేనట్లు మెరయుచుండును. ఈ సామానులలో నెమళ్లు, పళ్ళెరములు, గ్లాసులు, ఇతర బొమ్మలు మొదలగునవి చాల కళాకౌశలములతో పనిచేయబడుచుండును. జయపూరు, మురదాబాదుల ఇత్తడిసామానులు విరివిగా పరదేశముల కేగుచున్నవి.

## ౧౫. కంచుపరిశ్రమ.

దేశమునందు సమ్మకముగల కంచుసామానులు పూర్వకాలమువలె దొరకుట దుర్లభమగుచున్నది. ప్రస్తుతకాలపు పద్ధతిప్రకారమునకు తగినట్టుల వాడుకసామానులు వేడుక సామానులు తయారుచేసి అన్నిప్రదేశములయందును విక్రయించేయెడల ఎక్కువ ఖర్చుకాగలవు.

కృష్ణాపుష్కర ఖద్దరుచేతిపరిశ్రమల ప్రదర్శనము దుర్గాకళామందిరమునందు జరుపబడెను. ప్రదర్శనమునకు కృష్ణా అందు బ్రాస్ బెల్ మెటల్ వర్కుసువారు ఒకకంచు చిన్నయద్దము తయారుచేసి తెచ్చియున్నారు. ఒకమనిషి ఎనిమిది మాసము లీ యద్దమును తయారుజేసియున్నాడు. ఖరీదు రు ౫౦ లు గలిగియున్నది. ఇందుచేత ప్రాచీనకాలపు కంచద్దముల చరిత్ర పునరుద్ధరింపబడియున్నది. భారతదేశమునందు దమగంటిన మెరుగుపరిశ్రమలోని లలితకళానైపుణ్యమును వెలువడించినందుల కీపరిశ్రమ వారి నభినందింపవలసియున్నది.

## ౧౬. ఇనుప పరిశ్రమ.

ప్రాచీనకాలమునుండి క్రీ. శ. ౧౮౦౦॥ పూర్తియగు నాటివరకు భారతదేశమునందు ఇనుము కరగి పేరెన్నికగల ఇనుపసామానులు తయారుచేయుచున్నారు. అనంతరమా పరి

శ్రమ నీరసించియున్నది. మరల పునరుద్ధరించుటవలన దేశమునకు చాలమేలొనగూడకలదు. కమ్ముల్లు,దబ్బలములు, కాటాలు, బీగములు, మిల్లరు తాళములు, మరమేకులు, తీగె మేకులు, గడియలు, బోల్టుసు, స్క్రూబోల్టుసు, గిలకలు, బందులు, కీళ్లబందులు, నాడాలు, నాడామేకులు, గొలుసులు మొదలగునవన్నియు గృహపరిశ్రమలుగా తయారుచేయుటవలన పరిశ్రమ చాల పెరుగగలదు.

## ౨౦. ఉక్కు పరిశ్రమ.

ఉక్కుతో సన్ననివస్తువులు తయారుచేయుట వలన చాల కూలిని సంపాదింపవచ్చును.

రు ౪/ ఉక్కుతో కత్తెరలు చేసిన రు ౧౧౦౦
పేనా కత్తులుచేసిన రు ౨౨౦౦

స్విడ్జరులాండులోని గృహపరిశ్రమలలో తయారగు గడియారపు సామానులు ఒక పౌను ఉక్కుతో రు ౧౦౦౦౦/ల ఖరీదుగలవి తయారు చేయుచున్నారు. వీరిని ప్రపంచమునందెవ్వరును పోటీచేయజాలక గడియారపుసామానులన్నియు వీరివద్దనే కొనుచున్నారు. భారతదేశమునందు ఉక్కుపరిశ్రమను గృహపరిశ్రమగా పెంపొందించుట వలన ఎక్కువగా పరిశ్రమ పెంపొందగలదు.

## ఏ జ న్సీ ఉ క్కు.

విశాఖపట్టణం జిల్లాయందుగల జయపూరు యడవులందు ఉక్కు తయారుచేయు వాడుక గలదు. టంగాలనబడు యాయుధములు ఎక్కువగా ఏజన్సీలోని ఉక్కుపారిశ్రామికులు తయారు చేసిన ఉక్కుతో తయారు చేయబడు చుండును.

## మంగలికత్తులు.

హిందూదేశమున ప్రతివత్సరము ౫౦ లక్షలకుపైగా మంగలికత్తులు విక్రయమగుచున్నవి. వీటిఖరీదు ౧౦ లక్షల రూపాయల కెక్కువయగును. వీటిలో దేశవాళికత్తులు సున్నితముగ శబ్దముచేయక వెంట్రుకను కోతపెట్ట గలిగియున్నది. మంగలికత్తిని చక్కగ నూరగలిగిన శిల్పి వెంట్రుకను మధ్యకు చీల్పగలుగునంత సున్నితమగు పదును చేర్పగలిగియున్నాడు.

రాయలకాలము నందొక చిన్నవిషయము జరిగియుండెను. కృష్ణదేవరాయలు క్షురకర్మవేళకు దిండ్లపై ఆనుకొని నిదురించుచుండెను. ఇంతలో మంగలివచ్చి రాయలునకు దెలియకుండ క్షురకర్మపూర్తి గావించి శలవు కొఱకు నిరీక్షించుచుండెను. అంతటరాయలు నిద్రలేచి శిల్పియొక్క కళాకౌశలమున కానందభరితుండై గొప్పగబహూకరించెను. నేటికిని రాజపోషణగల క్షురశిల్పులు శరీరమున కాయుధము తాకకుండునట్టుల క్షౌరమును జేయగలిగియున్నారు. మూడు దినముల వరకు వెంట్రుక జాడకానరాకుండునట్టులగూడ క్షౌరమును చేయగల సిల్పులుగూడ యున్నారు.

నాటుకత్తులు రు ౦-౨-౦ మొదలు రు ౦-౬-౦ లు ఖరీదువరకు గలవు. వెంట్రుకను కత్తిరించుటలో నాటుకత్తెరలు గూడ మంచిపనిని చేయగలిగియున్నవి. నాటుకత్తులు, కత్తెరలు వాడుటవలన వీనిని తయారు చేయువారు సానపట్టువారు కలసి లక్షల ప్రజలు జీవింపగలరు.

గ్రా మ ఫో ను.

౧౯౩౫ సం॥ ఏప్రెలు ౧౪ తేది రాజమహేంద్రమున జరిగిన దేశీయ చేతిపరిశ్రమల వస్తుప్రదర్శనశాలకు తూర్పు గోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా ఆలమూరు గ్రామమున తయారుచేయబడిన గ్రామఫోన్ ఒకటి వచ్చియుండెను. ఫోన్ చాల శ్రేష్ఠతరముగ యుండెను. దేశీయపారిశ్రామికాభిమానులిట్టి మహాశిల్పులకు తగుసహాకార మొనరించినట్టులయిన ఇంకెన్నియో నూతన పరిశ్రమలను పునరుద్ధరింపగలరు.

ధవళేశ్వరములోని ఇనుపపరిశ్రమ

గోదావరీనదీతీరమునందున్న ధవళేశ్వరమునందు నూరు వత్సరముల క్రింద ఇనుపపనిచేయువా రొక్కరును గానరాకుండిరి. ౬౮ సం॥ క్రిందట గోదావరి యానకట్టకట్టుటకు గాను ప్రభుత్వమువారు కర్మాగారమొకటి స్థాపనజేసియున్నారు. అప్పటినుంచి క్రమక్రమముగా గ్రామవాసులలో చాల భాగము ఉక్కు ఇనుపపరిశ్రమలను చక్కగ తెలిసికొనియున్నారు. ఈనాడు ఆంధ్రదేశమునకెల్ల మేలయిన ఇనుపపెట్టెలు, పరదేశముల పరిశ్రమను పోటీచేయుచున్న శ్రేష్ట

తరమగు కాటాలు, పేరెన్నికగల ఉక్కు కొలిముట్లు, తయారు చేయుచుండుటేగాక గోదావరి లాంచీలు చాలవరకు ఇక్కడనే తయారగుచున్నవి. పెద్దపెద్ద స్టీమరులనుగూడ తయారు చేయగల మేస్త్రీలిచ్చటగలరు.

ధవళేశ్వరపు చరిత్రనుబట్టి ఇనుము ఉక్కు పరిశ్రమలను శ్రద్ధతో కష్టపడి నేర్చుటచేత చాలసులభముగా వాడుక పరచుకొనుటయే గాక త్వరలో శ్రేష్ఠతరమగు కొలిముట్లును గూడ తయారు చేయవచ్చునని తేటపడు చున్నది.

## ౨౧. ఎదురల్లికలు.

సన్నని ఎదురుపేళ్ళతో పర్లాకిమిడియందు పేరెన్నికగల పూలబుట్టలు మొదలగునవి విశేషముగను మిక్కిలి యలంకారముగను అల్లబడుచున్నవి. సాధారణముగా ఎదురుపేళ్ళతో మేదరవారు వాడుకసామానులన్నియు వెడల్పుపేడుతో నల్లుచుందురు. మిక్కిలిసన్నగ పేడునుచీల్చి సూటుకేసులు, రయిలు సంచులు, పెట్టెలు, కుర్చీలు, సోపాలు, టేబిల్సు, మంచములు మొదలగునవి యల్లుట ప్రారంభింపవలెను. విశాఖపట్టణము నందొక జమీందారునియింట ఎదురుబద్దతోను ఎదురు కర్రలతోను అల్లిన సోపా కుర్చీలను గాంచితిని. అవి చాల యందముగ నుండుటయెగాక మిక్కిలిగట్టిదనముగను వాడుక కెక్కువ కాలము మనునట్లుగను గాన్పించుచున్నవి. పేముతో అల్లిన సామానులవలె సన్నని ఎదురుపేడుతో అల్లిన సామానులు

గూడ అందముగ నుండుట కేమి సందేహము లేదు. ఈ పరిశ్రమ పట్టణములందే గాక పల్లెలందును ప్రారంభించి అభివృద్ధి చేయ దగియున్నది.

## ౨౨. తుంగచాపలు.

దక్షిణ హిందూదేశమునందు తుంగచాపల పరిశ్రమ విశేషముగా గలదు. వీటియందనేక రీతుల రంగుల నేతగూడ చూపబడుచున్నది. నేడు హిందూదేశమునందంతటను జపాను చాపలు విశేషముగా నమ్ముడుపోవు చున్నవి. జపాను చాపలు చూచుటకు సన్నగనుండి అనేకచిత్రములగు శిల్పము విరాజిల్లు చుండుటచేత ప్రతివారును ప్రేమించుచున్నారు.

దేశీయ చాపలనుగూడ ఆ విధముగ తయారు చేసిన యెడల దేశీయచాపలే ఎక్కువగ వాడుకకురాగలవు. కొయ్య రూలరులమధ్య అల్లిక పూర్తియయిన చాపను ఒత్తిడిచేయించిన యెడల తుంగబద్దవలెనుండి చదరముగ నుండును. వాని పయి కావలసిన రంగులబొమ్మల నద్దిన జపానుచాపలవలె మిక్కిలి యందముగ ప్రకాశింపగలవు. మితిలేని తుంగపంటయు ప్రశస్తములయిన చాపలల్లు శిల్పులు గలిగిన హిందూదేశము నందు విదేశీ చాపల విక్రయ మపారముగా సాగుచుండుట భారతీయులయొక్క నిర్లక్ష్యభావమే కారణమని తెలుసుకొనదగియున్నది.

తిరునల్వేలి జిల్లాయందు పల్లాడెయను నగరమున ప్రపంచమునందంతటను పేరెన్నిక గల చాపలు తయారగు

చున్నవి. తుంగను పట్టుదారమువలె మిక్కిలి సన్నగ చీల్చి సన్నని చాపలల్లబడుచున్నవి. పట్టుబట్టవలె మృదుత్వము, మెరుపు, గలిగి మిక్కిలి యందముగ ప్రకాశించుచున్నవి. వీనిని పరదేశములందు జరుగు సమస్త ప్రదర్శనములందును విక్రయింపబడుచున్నవి. స్వదేశమునందుగల సంపన్నులు గూడ మిక్కిలి ప్రేమతో వాడుచున్నారు. ౨ మూ. వె. ౪ మూ. పొ. గల చాప ౧కి రు ౨/- మొదలు రు ౨౦/- వరకు విక్రయింపబడుచున్నవి.

## ౨౩. నర్సాపురపు లేసు.

గోటు, నక్కీ, లేసు, యనుపేర్లతో ప్రాచీనకాలము నుండి భారతదేశమునందు పలురీతుల యల్లికలు తయారు కాబడుచున్నవి. అందు నర్సాపురమునందు ఈస్టిండియావారి కాలమునుండి విశేషముగ అల్లికపరిశ్రమ సాగనారంభించి యుండెను. క్రీ. శ. ౧౯౦౦ సం॥ నాటికి ౨ వేల కుటుంబములు ఈప్రాంతమునందు అల్లికవలన జీవించుచుండిరి. సుమారు ప్రతివత్సరము పది పన్నెండు లక్షల రూపాయల వాణిజ్యము ఇంగ్లాండు, అమెరికా, ఫ్రాన్సు మొదలగు దేశములతో సాగుచుండెను. నేడు నాలుగవ వంతు మాత్రము జరుగుచున్నది. ఈప్రాంతమున గల క్రైస్తవ కుటుంబములలో ప్రతియింటను లేసులల్లిక సాగుచున్నది. హిందువులలో ముఖ్యముగా అగ్నికుల క్షత్రియులు విశేషముగా నల్లుచుందురు. ఒక దినము

రు ౦-౮-౦ లు మొదలు ఒకటి రెండు రూపాయలవరకు సంపాదించువారుగూడ కలరు.

జాకెట్లకును, గౌనులకును పలుచోట్ల కుట్టులేసు, గౌనులపైన స్త్రీలుధరించుటకు మెడకు కాలర్లుగను, కాఫీ గిన్నెలమీద, ఫలహారపు పళ్ళెరములమీద కప్పుటకును, చిన్న చిన్న మేజాబల్లలమీద పరచుటకు నుపయోగ పడునట్లును అల్లబడుచున్నవి. అల్లికయందు లతలు, పుష్పములు, కాయలగుత్తులు, పక్షులు, మృగములు మొదలగు రీతులతో వందలకొలది నమోనాలల్లుచున్నారు. యంత్రపరిశ్రమ పరిపూర్ణ వికాశముతోనున్న కెనడా, న్యూజిలాండు, ఆస్ట్రేలియా, ఇంగ్లాండు, ఫ్రాన్సు, అమెరికా మొదలగు పరదేశములకు నర్సాపురమునందు గల నారీమణుల హస్తకళా నిర్మితంబగు లేసు అతివ్యామోహమును గూర్చుచున్నదనుట చాల యాశ్చర్యమును! ఆనందమును గూర్చుచున్నది. ఈ పరిశ్రమను పెంపుజేసినట్టులయిన అభివృద్ధి చెందగలదు.

## ౨౮. పల్నాటి నాపరాళ్లు.

పల్నాటి సీమనుగల నాపరాయియందు పిండిగలిగియుండుటచేత శిల్పమును చిత్రించుటకు చాల యనుకూలముగ నుండును. అమరావతి ప్రాశస్త్యశిల్పము ఈ రాతిమీదనే విరాజిల్లియుండెను. ఆగ్రాయందుగల పిండిరాతి వేడుకవస్తువుల వలె పల్నాటి నాపరాతిపయి చిత్రింపవచ్చును. పక్షులు,

జంతువులు, మృగములు, ఇండ్లు, భవనములు, కాగితములపయి బరువుగ పెట్టుటకు రమ్యమగురాళ్లు, మేజాబల్లలందు పెద్ద తొట్లు, గుండీలు మొదలగునవెన్ని యోతయారుచేయవచ్చును.

వినుకొండయందు రాతితో కుండీలుచేయు పరిశ్రమ చాల నీరసముగాగలదు. ఈ పరిశ్రమను వృద్ధిచేయుట చాల యవసరము.

## ౨౫. టూటుగర్ మట్టిపరిశ్రమ.

టూటుగరునందు చాల యందమగు మట్టి మూకుళ్లు తయారగుచున్నవి. ఈ మూకుళ్లను భవనములందు గోడలకు బంధింతురు. మూకుడు లోభాగమున ప్రకృతివైభవమును చిత్రింపబడును. గోడయందుండిన ఈయలంకారమును దూరముగ గాంచునపుడు చాలవైభవముగ గానుపించుచుండును.

---

## ౨౬. గాజుపరిశ్రమ.

---

భారతీయులతి ప్రాచీనకాలమునుండి గాజుకంభములు, అద్దాలమేడ లతివైభవముగనిర్మించుచుండెడివారు. స్త్రీల కలంకారమగు గాజులు ఆదికాలమునుండి భరతఖండమున విరాజిల్లుచునేయున్నవి. మద్రాసుచిత్ర వస్తుదర్శనశాలయందు కాళహస్త్రినుండి వచ్చిన నలుపు, వూదా, ఆకుపచ్చగాజులు,

గాజులు తయారుచేసిన కుప్పె, చాలయందముతో కళా పరిపూర్ణముగ ప్రకాశించుచున్నవి.

నెల్లూరుజిల్లా వెంకటగిరి ప్రాంతమునందును, కావలి తాలూకాయందును, చిత్తూరు కర్నూలు జిల్లాలయందును నల్లగాజులు తయారుచేయుచున్నారు. వీరి గాజులకు గావలసిన అద్దాలుగూడా వీరే తయారు చేయుచున్నారు. అనంతపురము జిల్లా పెనుగొండతాలూకా మక్కాజిపల్లి గ్రామమునందు కరుప్ప మల్లప్పగారు నల్లగాజులు అద్దాల బిళ్ళారిగాజులు తయారుచేయుచున్నారు. ఈ గాజుపరిశ్రమను యంత్రవిధానముగా తయారుచేయుటకు పలువురు ప్రయత్నించుచున్నారు. గాని మక్కాజిపల్లె గాజు చేతిపరిశ్రమ గృహపరిశ్రమగా సాగించుటకు చాల యవకాశమున్నటుల దెలుసుకో గలుగుచున్నాము.

ఈ పరిశ్రమకు కావలసిన చవుడు, చెకుముకి రాయి తెల్లయిసుక మనదేశమున చాల సులభముగా దొరకుటయేగాక తయారుచేయుటకుగూడ ఎక్కువ ప్రయాసము లేదు. అన్నిటికన్న కూలీనాలీలు చాల సరసముగ గిట్టుచున్నవి. యంత్రపరిశ్రమ కట్టులగాక విశేషమైన ఖర్చులు ఆపాదించుచున్నవి.

## ౨౭. ప్లైవుడ్.

(జాయంటు కొయ్యపలక)

---

భారతదేశమున పేరెన్నికగల కలపదారుకు యడవు లెన్నో యుండగ పోలండు, బల్గేరియా, జర్మని మొదలగు దేశములనుండి జాయంటుకొయ్య పలకలు లక్షలకొలది రూపాయలకు దిగుమతియగుట చాలవిచారకరముగయున్నది. ఈ పలకలను నిర్మించుటకు అడ్డముగను నిడువుగను మూడు పొరలుగ చక్కలను వజ్రముతో నంటించుదురు. నేడీ పలకలు సమస్త కొయ్యసామానులలోను చేర్పబడుచున్నవి.

ఈ చెక్కను తయారుచేయుటకుగాను అడవి బూరుగ అడవిమామిడి, పనస, గంగిరేని, పాల, దేవదారు, జీడి, మొదలగు జాతివృక్షము లుపయోగించును.

మలబారు, మైసూరు, తిరువాన్కూరు, జయపూరు, నల్లమల మొదలగు ప్రాంతముల యడవులు చాల యనుకూలించు చుండును.

## ౨౮. జీర్ణవస్త్ర వ్యాపారము

పాతబట్టలతోగూడిన వ్యాపారము సాలునకు లక్షల రూపాయలకు జరుగుచున్నది. కలకత్తారాజధానిలో చిన్నచిన్న వ్యాపారులు పిల్లలాట సామానులు, చిన్నచిన్న బొమ్మలు

తక్కువఖరీదుగల అద్దములు దువ్వెనలు మొదలగు వస్తువు లను గొనిపోయి ఇల్లుయిల్లుదిరిగి జీర్ణవస్త్రములగు ధోవతులు, అంగీలు, చీరెలు, మొదలగు వాటిని గైకొని విక్రయించుచుందురు. ఈ జీర్ణవస్త్రములను నగరములందుగల పెద్దవ్యాపారులకు చిన్నవ్యాపారులు విక్రయించి వారికి గావలసిన వస్తువులను కొంత ధనమును గొనిపోవుచుందురు.

కలకత్తాయందు ఇట్టి పాతవస్త్రములకు రంగులద్ది పరుపులు, దిండ్లు, చేతిగుడ్డలు, చొకములు, ఉత్తరీయములు, ధోవతులు, అంగీలు, టోపీలు, చీరెలు, మొదలగు ఆకారములుగ తయారుచేసి విక్రయించుచున్నారు. ఆంధ్రదేశమునందుగూడ ఇట్టి వ్యాపారులు షుమారు ఇరువది పాకీలకు పైగా ౨౦౦ కుటుంబములువారు జీవనము చేయుచున్నారు. తోలుత వస్త్రములను కొనుగోలుచేయుటకు ఒక లక్షరూపాయల వస్తువులను ఖర్చుపెట్టుదురు. కలకత్తా షాహుకార్ల వద్దకు చేరునరికి ౧౫౦౦౦౦ రూపాయలు గిట్టుచున్నవి. మారుబేరము వారివద్దకు చేరునాటికి ౨ లక్షల రూపాయ లగుచున్నవి. చిల్లులు చినుగులు కుట్టి క్రొత్తబట్టవలె గోధుమ (మైదా) పిండిని బట్టలకెక్కించుదురు. అప్పుడు చూచుటకు మల్లుబట్ట వలె కానుపించుచుండును. తెల్లబట్టమీాద పలురంగుల అద్దకములు, లతలు పూలు మొదలగు రీతుల అంచులు కమ్మలద్దియుత్తరీయములుగను, చీరెలుగను, తుండుగుడ్డలుగను తయారుచేసి రాజవీధులందును సంతలందును పల్లెలందును ముఖ్యముగా రాత్రులందు వేలము వేయుచుందురు. కాశి, ద్వారక

మొదలగు పుణ్యక్షేత్రములందు శ్రీపాదములు, భగవన్నామ ములు, దేవతా స్వరూపములు, కామధేను వాకారములు మొదలగు పూజార్హ వాస్త్ర రూపములుగా అద్ది విక్రయించు చున్నారు. ఇవ్విధముగా దేశమంతట విక్రయింపబడుచున్న. జీర్ణ వస్త్రముల వ్యాపారము సాలుసకు అయిదారు లక్షల రూపా యల వ్యాపారము జరుగుచున్నది. ౧౯౧౪ సం॥ మొదలు ౨౦ సం॥ వరకు ఐరోపాయుద్ధము వలన వస్త్రముల వెల పెరు గుటచేత జీర్ణవస్త్రముల వ్యాపారము ౧౨ లక్షలు మొదలు ౧౫ లక్షల వరకు జరిగియుండెను.

---

## ౨౮. చర్మపరిశ్రమ.

---

భారతదేశమునందాధిక్యముగా చర్మపుపరిశ్రమ తోడ్పడు చున్నది. లక్షలప్రజలీ పరిశ్రమవలన జీవించు చున్నారు. ప్రపంచమునందు పచ్చి తోళ్లవ్యాపారముచేయు అరేబియా, చైనా, దక్షిణాఫ్రికా, దక్షిణమెరికా దేశములకన్న భారతదేశ మెక్కువ వ్యాపారము చేయుచున్నది. ప్రతి సం॥ పచ్చిచర్మ ములు ౬ కోట్లు ఊనినతోళ్లు ౨ కోట్లు ఎగుమతి చేయబడు చున్నవి. చర్మములూనుటలో చెన్నరాజధానియందు చాల సరసముగా తయారగుచున్నవి. ఊనినచర్మములు చెన్నరాజ ధాని బొంబాయిరాజధానులు మాత్ర మెగుమతిచేయుచున్నవి. ఊనిన చర్మపు ఎగుమతిలో ౯౦ పాళ్లు లండను కేగుచున్నవి. వీరీ చర్మములతో సూటుకేసులు మున్నగునవి తయారుచేయు

చున్నారు. పచ్చిచర్మములను టానరీలుకొని నాజూకుచేసి పాదరక్షలు సంచులుమున్నగునవి చేయుచున్నారు. అమెరికా, ఇటలీ, జర్మనివారుగూడాఊనిన చర్మములు తెప్పించుకొనుచున్నారు.

చర్మములూనుటకు గావలసిన తంగేడు రేలంగిచక్కలను దెచ్చుసామాన్య జనులుగూడ లక్షలకొలదిగ భారత దేశమునందు జీవించుచున్నారు. చర్మములూను హరిజనులకు పూర్తిగ జీవనమున కాధారమగుచున్నదని వేరుగ దెలుప నక్కరలేదు.

ప్రాచీనకాలమునుండి భారతదేశమునందు అల్లాకు, సజ్జాకు, లక్క, పసుపు మొదలగు పదార్థములతో ఎరుపు రంగును, నీలిరంగుతో నలుపు వూదారంగులును చర్మముల పయి నెక్కించు వాడుకగలిగియున్నది. ఈ పరిశ్రమను పున రుద్ధరించుట చాల యవసరము. సూటుకేసులు, రికార్డు సంచులు, మణిపర్సులు, దిండ్లు, నడుముపటకాలు, పరుపులు కట్టు పటకాలు, గుఱ్ఱపుసామానులు, రయితుకు ఎడ్లకు గావలసిన సామానులు, చెప్పులజోళ్ళు మొదలయినవి విరివిగా తయారుజేయవలసి యున్నది.

## తంగేటిచక్క వ్యాపారము.

భారతదేశమున ఊనబడు కోట్లకొలది చర్మములకు గాను తంగేడు, రేలంగి, కరక్కాయలు, సున్నము మొదలగునవి ఒకటిరెండు కోట్లరూపాయల వ్యాపారము జరుగుచుండెను. నేడు అమెరికా, ఆఫ్రికాలనుండి తంగేటిచక్కను

పోటీచేయు మారుచక్క వచ్చుచుండుటచేత దేశములోని తంగేటిచక్క వ్యాపారము పూర్తిగ నాశనమై పోయినది. పరదేశములనుండి దిగెడు చక్కపై పన్నువిధించి దేశీయచక్క వ్యాపారమును పునరుద్ధరించినయెడల లక్షలకొలది హరిజనులు వేలకొలది చక్కవ్యాపారులు సుభిక్షముగ జీవింపగలరు.

---

## ౩౦. చేతిమగ్గముల నేతపరిశ్రమ.

భారతదేశమునందుగల పరిశ్రమలలో చేతిమగ్గముల నేత పరిశ్రమ ప్రధానపరిశ్రమయని తెలుపవచ్చును. ఈ పరిశ్రమ స్వదేశీ, విదేశీయుల యంత్రనిర్మిత వస్త్రములచేత ౧౦౦ సంవత్సరములుగా విపరీతమగు పోటీగలిగియుండి నప్పటికిని ౨౫ లక్షల మగ్గములీనాడు సజీవమయి వర్ధిల్లుచున్నవి. ఒక కోటిజనులు వీటియం దాధారపడి యున్నారు. ౮౦ కోట్ల రూపాయలకు పయిగా వాణిజ్యము జరుగుచున్నది. వాణిజ్యమునకు కట్టడిగాని ప్రభుత్వమువారివల్ల రక్షక చట్టములుగాని, బ్యాంకీల హామీగాని, నీరసించుచున్న పరదేశపు ఎగుమతుల నభివృద్ధిపరచు నభిమానులుగాని, వస్త్రనిర్మాతలలో నైకమత్యతగాని లేని కారణముచేత ౮౦ లక్షల జనులకు మాత్రము జీవనము గడపుచున్నది.

హిందూదేశమునందు చేతిమగ్గముల నేతపరిశ్రమకు చాల పలుకుబడిగలదు. ౬౦ బట్టల యంత్రములుగల బొంబాయి నగరమునందు చేతి మగ్గములతో నేయబడిన చీర

లకు గొప్పగిరాకీగలదు. ఈ చీరెలు విక్రయించునంగడులు గల వీధులుగూడ గలిగియున్నవి. ఈ నగరమునందుగల నారీ మణులలో నూరింట ౭౦ పాళ్ళు చేతిమగ్గముల నేతబట్ట లేగట్టుచున్నారు.

కాంచీపురమునందు ౩౦ వేల చేతిమగ్గములు గలవు. ఇన్ని చేతిమగ్గములు హిందూదేశమునం దెక్కడను కాన వచ్చుటలేదు. ప్రతిసంవత్సరము కొద్దిగనో గొప్పగనో మగ్గముల సంఖ్య పెరుగుచున్నదిగాని తగ్గుటలేదు. రు ౦-౮-౦లు ఖరీదు గల యంగవస్త్రము మొదలు నూర్లకొలది రూపాయలఖరీదు గల పట్టుచీరెల వరకు మిక్కిలి ప్రసిద్ధిగా నేయుచున్నారు. హిందూదేశమునగల అన్నిప్రాంతములకు వీరి వస్త్రము లేగు చునే యున్నవి.

సోలాపురమునందు ౭ కోట్ల రూపాయల పెట్టుబడితో పెద్దపెద్ద యంత్రశాల లేడు నిర్మించి సాలునకు ౩ కోట్ల రూ. ఖరీదుగల వస్త్రములు విక్రయించు చుండగా నగరమునందు ౧౬ వేల చేతిమగ్గములు గలిగియున్నవి. ఈ మగ్గముల యాదాయముతో ౪౦ వేల ప్రజలు సుభిక్షముగా జీవించు చున్నారు. ఈ మగ్గములన్నింటియందును చీరెలు మాత్రము నేయబడు చున్నవి. ఈ చీరెలు బొంబాయి, నైజాం, సి. పి, యు. పి, మైసూరు, ఒరిస్సా, బిహారు, మొదలగు ప్రాంత ముల కెగుమతి చేయబడుచున్నవి.

కడపజిల్లాయందుగల జమ్ములమడుగు ప్రొద్దుటూరు తాలూకాలయందు వేలకొలది చేతిమగ్గములు గలవు. ఈ

మగ్గములలో ౯౦ పాళ్లు అంచులందు పేట్లుగల చీరెలు నేయుచున్నారు. ఈ చీరెలు బొంబాయి, మధ్యరాష్ట్రములు, ఇందూరుస్టేటు, కాండ్వా, ఇటార్సి, అలహాబాదు, కాశీ, సూరతు, ఆనంద, బ్రోచి, అహమదాబాదు, మొదలగు ప్రాంతముల కెగుమతిచేయ బడుచున్నవి. ఇదేమాదిరి అంచులు కమ్ములుగల చీరెలు ఇర్కల్, రబ్కవి, సాంగ్లి, పూనా, సోలాపూరు, అహమదునగరు, మాలేగావ్, కంబాయత్, బీవండి, నాగపూరు, మొగలగు ప్రాంతములందు నేయుచున్నారు.

పాలకొల్లు నగరమునందు ప్రశస్తములయిన తలపాగాలు నేయబడుచున్నవి. ౨౦ మొదలు ౨౦౦ నెంబరువరకును, 3 మూరలచౌకము మొదలు ౬ మూరల చవకమువరకును తయారుచేయుచున్నారు. హిందూదేశములో పాగాల వ్యాపారమునందు పాలకొల్లు నగరముమాత్రము కానవచ్చుచున్నది. వీరి పాగాలు నైజాము, బళ్లారి, షోళాపూరు, బెల్గాం, ధోండు, బిజాపూరు, అక్కలకోట, తాళికోట, పర్భిని చుట్టుప్రక్కల పలుప్రాంతములకును, రైళ్ళద్వారాను బండ్లద్వారాను, కడకు ఒంటెలమీద ప్రయాణముచేసి విక్రయింప బడుచున్నవి.

పశ్చిమగోదావరిజిల్లాలోని రాజోలు అమలాపురం తాలూకాలనుండి కలకత్తా నగరమునకు రాజధానిలో పలు ప్రాంతములకును సాలుకు లక్షలకొలది చీరెలెగుమతి చేయబడుచున్నవి. చిత్తూరుజిల్లాయందుగల పాడిపేటనుండి సిలోను నగరమునకు విరివిగా చీరెలెగుమతి చేయబడుచున్నవి.

గుంటూరు గోదావరిజిల్లాలనుండి రంగూనునకు పలువిధము లగు వస్త్రములు లక్షల రూపాయలకు పంపబడుచున్నవి.

మధుర, కోయంబుత్తూరు, సేలం, బెంగుళూరు, పుల్లంపేట, మాధవరం, నెల్లూరు, బుచ్చిరెడ్డిపాలెం, చీరాల, పేరాల, భట్టిప్రోలు, పెడన, ఉప్పాడ, సరసన్నపేట, శ్రీకాకుళం, బరంపురం, మొదలగు ప్రాంతములలో గాంచిన యెడల చేతిమగ్గముల పునాదులెంత ఘట్టిగ నాటుకొని చెక్కుచెదరక వర్ధిల్లుచున్నవో తేటపడుచుండును.

మిల్లు పోటీపెరుగుకొలది చేతిమగ్గముల నేత పరిశ్రమయందు ప్రజలకును పరిపాలకులకును ప్రేమ తొలగుటచేత పరిశ్రమ నిరాధారముగ జీవింపవలసివచ్చినది. ఇందుచేత చేతిమగ్గముల నేతబట్టల వ్యాపారులు స్వలాభము కొఱకు గాను ఒకరినొకరు పోటీచేసుకొనుచు వస్త్రములలోని శ్రేష్ఠత్వము, చాయలలోని నమ్మికపోగొట్టి మంచిజరీ వాడుటకు బదులు మాయజరీ వాడుచు వాణిజ్యమును నాశనముగావించి వస్త్రనిర్మాతల జీవనమును నీరసింపజేసి ఒక కోటి ప్రజలకు పలుకష్టములను ప్రాప్తింపజేసియున్నారు. నేయబడిన వస్త్రములన్నియు ఖర్చగుచు నేయుండిసను వస్త్రనిర్మాతల కాదాయముమాత్రము నశించియున్నది. ఇందులకు వస్త్రవ్యాపారులే బాధ్యులగుచున్నారు.

ఉప్పాడగ్రామము తూర్పు సముద్ర తీరమున యున్నది. తూర్పుతీరమున సన్నని వలువలు నేయుటలో చాల ప్రసిద్ధిగలిగియున్నది. నూలుజరీగలచీరె లొక్కొక్కటి ౪౦

రూపాయలు ౫౦ వరకు నేయుచుండురు. ఈ నగరమునందు ౧౯3౦ సం॥లో పక్కారంగులు గల నూరునెంబరు కడ్డీయుంచు చీరె ఒకటింటికి రు ౭-౮-౦లు ఖరీదు గలిగి యుండెను. ౧౯3౪ సం॥ నాటికి వ్యాపారులలో స్వలాభమెక్కువగా నేర్పడి ఒకరికన్న మరియొకరు ధరలుతగ్గించుచు రు ౨-౧౬-౦లకు విక్రయించు చున్నారు. చీరెలు నమ్మకముగానున్న రోజులలో నెల ౧ కి. ౨౦ వేల రూపాయల సరుకెగుమతి యగుచున్నను గిరాకిహెచ్చుగానుండెను. ధరలు తగ్గించిన రోజులలో చాల నీరసముగాయున్నది. నమ్మకమగుచీరెలు తయారగుచున్న రోజులలో నాగరీకుల కందరకును ప్రేమ పుట్టించుచుండెను. నాణ్యము చెడగనే ప్రేమగల వారు కట్టుటమాని యున్నారు. మండపేట గ్రామమునుండి కలకత్తాకు ౪౦ నెం. గల ౫ గ. చీరెలెగుమతి యగుచుండెను.

| | |
|---|---|
| పక్కారంగు నూలు ౧౫ పిళ్ళు | ౧౦-౧౨-౦ |
| అంచులకు జైమనుపిడి | ౦-౧౨-౦ |
| పట్టు సిలప ౧ కి | ౦- ౪-౦ |
| గ ౪౫-పొడవునకు నేతకూలి | ౧౨- ౮-౦ |
| ౯ చీరెలు షాహుకారి గిట్టుపాటు | ౨౪- ౪-౦ |
| షాహుకారి విక్రయలాభం | ౧3- ౪-౦ |
| | 3౮- ౮-౦ |

కలకత్తాలో చీరె ౫ రు/ చొప్పున ౪౫ రు/ విక్రయింప బడుచుండెను.

ఇవ్విధముగా లాభకరమగు వ్యాపారమునందు గల షాహుకార్లలో స్వలాభమేర్పడి ఒకరినొకరు పోటీచేయుచు పక్కారంగులకు బదులు కచ్చారంగులద్దించుచు,

| | | | |
|---|---|---|---|
| కచ్చారంగు నూలు ౧౨ పిళ్ళు | | రు | ౪- ౫-౦ |
| పట్టు డైమన్ | ... | ... | ౦-౧౨-౦ |
| ౪౫ గ॥ లకు నేతకూలి | | | ౨- ౮-౦ |
| | | | ౭- ౯-౦ |
| షాహుకారి లాభము | | | ౦-౧౪-౦ |
| | | | ౮- ౭-౦ |

పై విధముగా ధరలు తగ్గిన తరువాత కలకత్తాలో ఈ చీరెలు ఖర్చగుట నీరసించినది.

౪౫ గజముల నేతకూలి రు. ౧౨-౮-౦ లు గిట్టుచున్న పరిశ్రమను నసింపజేసి రు ౨-౮-౦ ల కూలినిచ్చుచు వస్త్రనిర్మాతల కార్థికదుస్థితిని సమకూర్చియుండిరి.

ఈ దుస్థితి బాపుకొనుటకు చట్టసభలందు రక్షకచట్టములను పొందవలెను. రక్షకచట్టములు పొందుటకుగాను వస్త్రనిర్మాతలెల్లరు కలసి పనిచేయవలసి యున్నది. వస్త్రనిర్మాతల ప్రతినిధులు చట్టసభలయందు ప్రత్యేకముగానుండి పనిజేయుటవసరమని వేరుగ దెలుప నక్కరలేదు.

రంగూను కేగుచున్న దోబీచీరెలు, గువ్వంచుకండువాలు, రుమాళ్లు నేసినందులకుగాను ౪౫ గజములకు రు౭-౦-౦ కూలిని ఇచ్చుచుండిరి. షాహుకార్లు పోటీచేసుకొని ధరలు తగ్గించి ఈనాడు రు ౧-౮-౦ మాత్రము ఇచ్చు

చున్నారు. రంగూనునందు గువ్వంచు కండువాలు ఒక లక్ష, దోబీచీరె లొకలక్ష, రుమాళ్లొకలక్ష ఇటలీ జపాను మాయ పట్టుచీరెలు కొన్ని లక్షలమ్మ వ్యాపారమును షాహుకార్ల పోటీచేత నసింపచేసియున్నారు. గువ్వంచు కండువ ౧ కి రు ౧-౧౫-౦ లు మండపేటలో గిట్టుచున్నదానిని రంగూనులో ౧-౪-౦ విక్రయింపబడుచుండెను. ఈనాడు గువ్వంచు కండువ రంగూనులో రు ౦-౩-౬ లకు విక్రయింపబడుచున్నది. ఇందునుబట్టి వ్యాపారులు స్వలాభమునకు గాను వాణిజ్యమెంత నాశనము గావించుచున్నారో చక్కగ తేటపడుచున్నది.

చీరాలగ్రామమునందు ప్రపంచమునందెచ్చటను తయారుకాజాలని "ఆషియా" లను రుమాళ్ళు నేయబడుచున్నవి. ఈరుమాళ్లకుగాను తయారుచేయు తొగరు చాల ప్రసిద్ధిగలిగియుండును. ఈతొగరు ఉతుకుకొలది రంగు నినుమడించుచుండును. వీటినే బొడ్డబ్యాసీలనిగూడ పిలువబడుచున్నవి.

౧౯౦౦ సం॥ వరకు ఆషియాలు, నకలాషియాలు మొదలగునవి హైదరాబాదు, గుల్బర్గ, బొంబాయిమీదుగ ఏడెనులలో సాలుకు ౧౨ లక్షల రూపాయలకెక్కువ ఖరీదు గలిగి నవి ఖర్చగుచుండెను. ఈవాణిజ్యముమీద ౬౦౦ మగ్గములుమొదలు ౧౦౦౦ మగ్గములవరకు ఆధారపడియుండెడివి. ౧౯౧౪ సం॥ ఐరోపా సంగ్రామమారంభమయినది మొదలు ఈవస్త్రములకు ధరలు హెచ్చియుండెను. ౧౯౨౧సం॥లో ౪౦ నెం. అయిదు జానల వెడల్పుగల ౨౦ మూరల ఆషియా ౧ కి

| | | |
|---|---|---|
| నూలు రంగు | రు | ౭-౦-౦ |
| కూలి | | ౧౫-౦-౦ |
| నేయించిన షాహుకారిలాభము | | 33-౦-౦ |
| చీరాల ఖరీదు | | ౫౫-౦-౦ |

౧౯3౪ సం॥ ఆప్కోయూఖరీదు.

| | | |
|---|---|---|
| నూలురంగు | రు | 3-౮-౦ |
| కూలి | | ౨-౦-౦ |
| షాహుకారిలాభం | | ౧-౦-౦ |
| చీరాల ఖరీదు | | ౬-౮-౦ |

౧౯౨౧ సం॥ రం లుంగీలు శేక కలిళ్లు ఖరీదు ౧౮ మూరలు గల తాను ౧కి రు ౯-౦-౦ లు గలిగి యున్నది. ఇందులో కూలి ౫-౦-౦ రూపాయిలుండెను. ఇదే తాను ౧౯3౨ సం॥ లో రు ౦-౧౨-౦ లు: నేత కూలితోసహా రు ౨-౮-౦ లు ఖరీదుగలిగి యుండి వాణిజ్యము నసించి యుండెను.

నిజాముారాజధానిలో గల సిద్దిపేటయందు పేరెన్నికగల జరీబనారసు చీరెలు పట్టుతాప్తాలు నేయబడు చున్నవి. ౧౯౨౪ సం॥ రముసుమారు రూ. ౧౨౦ ల ఖరీదు గలిగియుండిన చీరె ౧౯3౪ సం॥ సుమారు ౪౦-౦-౦ లు మాత్రము గలిగి యున్నది.

రు౧౨౦లు ఖరీదునాడు రు౪౦-౦-౦ నేయుటకుగాను కూలియొసంగిన షాహుకారి ౧౯3౪ సం॥లో రు ౧౦-౦-౦ లు మాత్రము కూలి నిచ్చుచున్నాడు.

## లుంగీలు - చేతిరుమాళ్ళు లేక పట్టిమార్పులు.

అతిప్రాచీనకాలమునుండి దక్షిణ హిందూదేశమునందు పక్కారంగులతో గూడిన వన్నెల వస్త్రములు విపరీతముగా ఎగుమతి యగుచుండెను. క్రి. శ. ౧౭ శతాబ్దమునందు వలందా వారు చిలకసముద్రమున గల ప్రళయకావేరియందు చేరి ఈవన్నెల వస్త్రముల నాక్రమించుకొని కవిలియను పేరుతో విదేశముల కెగుమతిచేయ నారంభించియుండిరి. అందుచేతనే కవిళ్లకు "ప్రళయకాట్" కవిలియను పేరుతో పరదేశములందు చెల్లుబడి యగుచున్నవి. వాణిజ్యము క్రమాభివృద్ధిచెంది పున్నమనాటి నిండుచంద్రుని మాడ్కి ప్రకాశించియుండెను.

మిల్బరనుగారు వ్రాసిన తూర్పుదేశపు వర్తకము అను గ్రంథములో ఈవిధముగా గలదు "క్రి. శ. ౧౭౯౨ సం॥ మొదలు ౧౮౦౯ వరకును మదరాసునుండి వస్త్రములు ముఖ్యముగ ఎగుమతి యగుచుండెను. పులికట్టు చేతిరుమాళ్ళు వేటపాలెపు చేతిరుమాళ్ళు, నీలపుగుడ్డలు, బుక్కామజ్లినులు, పుంజపుగుడ్డలు, సాలీలు, సాలంపూరులు, పాలంపూరులు చీటీ గుడ్డలు, అనేక రకముల మజ్లినులు గలవు. చేతిరుమాళ్ళు ఇంగ్లండు అమెరికాల కెగుమతి యగుచుండెను. 1.

ఇవ్విధమయిన వ్యాపారము ఈస్టిండియా కంపెనివారి తరువాత దేశీయ షాహుకార్లలో కొద్దిమందిమాత్ర మాక్రమించుకొని అపారమగు ధనమార్జించుచుండిరి.

1. రాటము, మగ్గము ౮౯ పే.

౧౯౩౪ సం॥ న ఐరోపా సంగ్రామ మారంభము నుండి ౧౯౩౮ సం॥ వరకు సం ౧ కి॥ ౨ కో. రూ. ల కెక్కువగా వాణిజ్యము సాగనారంభించి యుండెను. ఈ వస్త్రములన్నియు ఆర్కాటు, చిత్తూరు, మెడ్రాసు, చెంగల్పట్టు, నెల్లూరు, గుంటూరు, కృష్ణాజిల్లాలందుగల మారుమూలలందును నేయు చుండెండివారు.

పశ్చిమాఫ్రికా, మాల్ దీవి, జాంజిబారు, ఏడెన్, సింగపూరు, పెనాంగి, రంగూను, జావా, సుమత్రా, మలాకా, కొళంబు, సిరుబోయి, సీయం, పాడాంగు, మైడాన్, బత్తావి, స్విజర్లాండు, లాగాసు, బెర్లిన్, అమెరికా మొదలగు ప్రాంతముల కీవస్త్రము లెగుమతి చేయబడుచుండెను.

ఇంత ప్రశస్తమగు యీ వ్యాపారమునకు రక్షకచట్టములు లేనందువల్లను వాణిజ్యపరులలో సమ్మేళనసంఘముగాని, ఐకమత్యతగాని లేనందున వ్యాపారులు పోటీలుచేయుచు ధరలు తగ్గించి వాణిజ్యమును పూర్తిగ నసింపజేసి యున్నారు. ౩౬ మూరలుగల పట్టెమార్పు (చేతిరుమాళ్లు) తాను ౧ కి నేతకూలి రూ ౧౧-౦-౦ లుండెను. ౧౯౩౩ సం॥ లో అదే తానునకు రూ ౧-౮-౧ ల కూలిని ఇచ్చునట్లుల తీర్మానింపబడెను. అట్లుతరి మద్రాసు, పొన్నేరి, మాదరపాక, మానెల్లూరు, సూళ్లూరుపేట, కాళహస్తి మొదలగు గ్రామములందు పట్టెమార్పులనునేయు వస్త్రనిర్మాతలు ఆరుమాసముల పొడవున కూలీలు పెంపుచేయవలసినదిగా షాహుకార్లతో

తగాదా జరుపబడిన తరువాత స్వలాభులగు కొందరు షాహు కార్లు రాజీ కుదరకుండునట్లుల జేసియున్నారు.

ఇవ్విధముగా భారతదేశమునందుగల ౨౫ లక్షుల చేతి మగ్గములయందును మానవుడు పొందలేనంత కష్టపరంపరలు వాణిజ్యపరులచే నాపాదింపబడినవి. విద్యాహీనులును, అమా యకులును, ప్రస్తుత కాలపు లోకవ్యవహారములు తెలియని వారును అగు చేతిమగ్గముల నేతపారిశ్రామికుల పునరుద్ధరిం చుట దేశీయుల కార్యమగుచున్నది. ఇందువలన దేశమునకు గొప్ప లాభము చేకూరగలదని వేరుగ దెలుపనక్కరలేదు.

## వస్త్రనిర్మాతలు.

భారతదేశమునందుగల వస్త్రనిర్మాతలెల్లరు కలసి నేతపారి శ్రామిక సంఘముల నేర్పాటుచేయుట చాల యవసరము. వీరిలోగల స్వసంఘాతిశయములు, పరసంఘ ద్వేషములు వెంటనే నసింపవలెను. ఆ స్థానమునం దైకమత్యత పెంపొంద వలసియున్నది. ప్రతి గ్రామమునందును చేతిమగ్గముల నేత పరిశ్రమ పునరుద్ధారక సంఘములు నెలకొల్పి ఆయా గ్రామములందుగల కష్టపరంపరలను వెళ్ళడించుచుండవలెను. ప్రతిగ్రామమునందును వస్త్రవాణిజ్య సంఘములు నెలకొలిపి నమ్మకమగు చాయలుగల వస్త్రములను, సరియగు కూలీలను క్రమమగులాభమును నుండునట్లుల విక్రయము జరుగునట్లే ర్పాట్లు చేయవలసియున్నది. ప్రతిరాష్ట్రమునందును రాష్ట్ర సభలు గావించి ఆయా రాష్ట్రచట్ట సభలద్వారా రక్షకచట్ట




[illegible] దేశీయ పరిశ్రమలు

[illegible]ములను పొందవలెను. భారతదేశ వస్త్రనిర్మాతల సభ ప్రతి వత్సరము కూడు[illegible]ట చాల యవసరము.

వస్త్ర[illegible] చేయుటలో సమ్మకగల జరీ, పక్కారం గు[illegible]గనంత పుంజము, నేతకలిగి యుండునట్లును; ఎల్లప్పుడు నాణ్యముచెడక నమ్మకముతో వాణిజ్యము జరుగులాగున పైసంఘములు ఇతర అభిమానులు పాటుపడుచుండుట చాలయవసరము.

అనుకూలమగురీతితో పయివిధముగా చట్టములు నిర్మింపజేయుట వల్లనుగూడ మేలు కలుగుచుండును. ఇంతేగాక పరదేశములనుండి దిగుమతియగు వస్త్రములమీద పూర్తిగ సుంకముల భారముండునట్లు చేయుచుండవలెను. చేతిమగ్గముల రక్షణకొరకు స్వదేశీ మిల్లులమీద పన్ను విధింపవలసియున్నది.

“చేతిమగ్గములమీద అధికముగా తయారగునట్టి బట్టల రకములు మిల్లులలో తయారుకాబడకుండ జేయుటకు క్రమముగా ఏర్పాటుచేయబడును” అని ప్రభుత్వమువారు వెల్లడించిన విషయమును ప్రతివస్త్రనిర్మాతయు మరువకూడదు. కడుశ్రద్ధగలిగి కృషిసలిపి కావలసిన కోర్కెలు కోరుకొనుచు రక్షణపొందవలెను. సకాలమున జాగ్రత్త పొందనియెడల చేతిమగ్గముల నేతపరిశ్రమయొక్క కష్టపరంపరలకు ముక్తి కలుగనేరదు. కాబట్టి వస్త్రనిర్మాతలెల్లరు కలసి పాటుపడి మేలు పొందవలెను.

సకలం శ్రీ బ్రహ[illegible]